# ఆంధ్రకేసరి కథ

బారిష్టరీ చదువు కోసం ప్రకాశం ఇంగ్లాండు వెళ్ళ దానికి నిశ్చయించు కున్నాడు.

ఆ రోజుల్లో మన దేశం నుంచి చదువు కోసం ఇంగ్లాండు వెళ్ళిన వాళ్ళు చాలా తక్కువ మంది. అతి కష్టం మీద తల్లిని ఒప్పించాడు.

1903 అక్టోబర్ మొదటి వారంలో మెయిల్ బోటులో ఇంగ్లాండుకు ప్రకాశం బయలు దేరాడు.



రెండు వారాలు స్టీమర్ ప్రయాణం చేసి ఇంగ్లాండు చేరాడు



ప్రకాశం అక్కడ చదువుతుండగా పార్లమెంటు ఎన్నికలు వచ్చాయి. దాదాభాయి నౌరోజీ నిలబడ్డాడు. ఆయన తరఫున ప్రకాశం ప్రచారం చేశాడు.

ఈ రకంగా భారత స్వాతంత్ర్యం కోసం పాటుపడే మహా పురుషుల సాహచర్యం కలిగింది ప్రకాశానికి.

చదువుల్లో మాత్రం ఏ లోపం రానియ్య లేదు. మొదటి టెరమ్ పూర్తిచేశాడు.



సర్టిఫికెట్ ఆఫ్ ఆనర్ సంపాదించాడు. బారిష్టరు చదువు పూర్తి చేశాడు.



1907 లో భారత దేశం చేరాడు



ఇంగ్లాండు నుంచి రాజమహేంద్రవరం చేరగానే- ప్రాయశ్చిత్తం చేసుకుంటేనే గాని బంధువులు యిళ్ళకు రానీయము అన్నారు. ప్రకాశం అందుకు నిరాకరించాడు.




ప్రకాశం మద్రాసు చేరాడు. ఆ రోజుల్లో అక్కడ మైలాపూర్ వకీళ్ళ ప్రభావం వెలిగిపోతూ ఉండేది.

ఒక మిత్రుడు ప్రకాశానికి సలహా ఇచ్చాడు.



# ఆంధ్ర ప్రదేశ్

సంపుటి : 19 ]

మార్చి, 1975
ఫాల్గుణ—చైత్ర, 1896-97 శా. శ.

[ సంచిక : 5

ప్రధాన సంపాదకులు :
శ్రీ రాజ్యం సిన్హా

సంపాదకులు :
యన్. గోపాలకృష్ణమూర్తి

దేశమును ప్రేమించుమన్నా
మంచియన్నది పెంచుమన్నా
వట్టిమాటలు కట్టిపెట్టోయ్
గట్టిమేల్ తలపెట్టవోయ్

మొదటి కవరు పేజీ : పల్లె పట్టుల నవోదయం

రెండవ, మూడవ కవరు పేజీలు : ప్రకాశం కథ (చిత్రాల్లో)

చివరి కవరు పేజీ : బంజారా వనిత (నిర్మల్ పెయింట్ : హాండీక్రాఫ్ట్స్ విభాగం వారి సౌజన్యంతో)

## ఇది మన తెలుగు సాంస్కృతిక సంవత్సరం

( ఈ సందర్భంగా శ్రీయుతులు జలగం వెంగళరావు, పిడతల రంగారెడ్డి, మండలి వెంకటకృష్ణారావు తెనుగు ప్రజనుద్దేశించి యిచ్చిన సందేశాలను మధ్య పేజీల్లో ప్రచురిస్తున్నాం.
—ప్ర. సం.)

సాలు చందా ఆరు రూపాయలు

వెల: 50 పైసలు

రిజిస్టరు నెం: హెచ్/హెచ్. డి. 81

ఈ సంచికలోని రచయితలు వెలిబుచ్చిన అభిప్రాయాలు తప్పనిసరిగా ప్రభుత్వానికి చెందినవిగా భావించ నక్కరలేదు

## ఈ సంచికలో

# దేశం ముందడుగు వేయాలి

శ్రీ జె. బాపురెడ్డి

కాలం కళ్ళల్లో చీకట్లు క్రమ్మిన
కారడవుల్లోనుంచి
ప్రగతిపథాలను అడ్డిన
పర్వత శిఖరాలనుంచి
ఆశలను మట్టిలో కలిపిన
ఊషర క్షేత్రాలనుంచి
వినిపిస్తున్నది విప్లవ సందేశం
వేయాలి, ముందడుగు వేయాలి దేశం

కరిగిపోయిన కలల్లాగ దొరలిపోయి
కడలిపాలౌతున్న నదీనదాలు
ప్రజా చైతన్యశంఖారావ మోహితలై
పచ్చ పచ్చని విప్లవ భావతరంగితలై
కొలువు తీరాలి కొండల్లో కోనకోనలో
నంగల్ భాక్రాలో, నాగార్జునసాగర్‌లో
నవజీవన హస్తాలుసాచి, దళితభూములలో
హోశిరంగేశి ఆడుకోవాలి
విద్యుద్దరహాసం చిందుతూ
ఇంటింటా పాడుకోవాలి
వేయాలి ముందడుగు వేయాలి దేశం
వినిపిస్తున్నది విప్లవ సందేశం

ప్రఫుల్ల భారత గంధవతిని
ప్రశస్త భారత రత్నాకరాన్ని
ప్రసన్న భారత మహోబిలాన్ని
యోధవర శైలాట శతఘ్నులు
వీర మరుత్ గరుత్ విమానాలు
విక్రమనాక్రా నౌకా బలాలు
దీక్షా దక్షతలతో రక్షించాలి
దుష్టనికృష్ట శత్రులను శిక్షించాలి
వేయాలి ముందడుగు వేయాలి దేశం
వినిపిస్తున్నది ప్లవ సందేశం

కల్తీలతో నీ తిండిని విషం చేస్తున్న
కసాయివాళ్ళను
దొంగనిలువలతో నీ బ్రతుకు శిథిలం చేస్తున్న
నీచపు తోడేళ్ళను
సిమెంటును బూడిద చేస్తున్న మాయావులను
నూనెను గోమూత్రం చేస్తున్న బాబూలను
నీతిని కాటేస్తున్న భుజంగాలను
జాతిని త్రుంచేస్తున్న ప్లవంగాలను
రవిని మ్రింగేస్తున్న పైరవిగాళ్ళను
కదం త్రొక్కి నీపాదాలక్రింద నలిపేయి
పదునెక్కిన నీప్రతిభాశూలంతో నులిచేయి
ఉత్తిష్ఠ! ఉత్తిష్ఠ! తమ్ముడూ మేలుకో
నిస్త్రాణ నిరీహతనుంచి తేలుకో

అయిదు అయిదు అడుగులు వేస్తున్నది
అభివృద్ధి ప్రణాళికా ప్రసవంతి
ప్రతి అడుగున ఆమెను ముంచేస్తున్నది
అతిరభసంగా పొంగుతున్న జనాభా ప్రవంతి
ఆ పవిత్ర ప్రసవిత్ర ప్రస్థానాన్ని
సఫలంచేయ నడుం కట్టు
ఆ ప్రమాద కల్లోలిని దాడిని
నిరోధించు, నియంత్రించు, అరికట్టు.

భిలాయిలో, రూర్కెలాలో, విశాఖలో,
సేలంలో
ఉక్కు కవచాన్ని ధరించి
కృష్ణా కావేరి సీమల్లో
గంగా యమునా మైదానాల్లో
ఉజ్జ్వల మరకత చేలాంచలాలు సవరించి
ఆత్మశక్తిని అణుశక్తిని
అప్రతిహత సాధనాలుగా స్వీకరించి
భారతీయ ఆర్థిక వ్యవస్థ
వీరయోధునిలా విజృంభించాలి
తరతరాల దరిద్రాల కంఠాలు
కరకర తెగి నేలకూలాలి
నిర్నిమిష, జిజీవిష
నిర్మలంగా నిబిడంగా వెలగాలి

ఓహో! అలా అంటున్నది ఎవరు?
బాపు!
జాతిపిత జీవన గీత బాపు
చీకట్లను చీలుస్తున్న తూపు
మనలను నడిపిస్తున్న ముందు చూపు
బాపు!

# గవర్నరు సందేశం

(ఆంధ్ర ప్రదేశ్ గవర్నరు శ్రీ శేషారెడ్డి ఓబుల్ రెడ్డి అసెంబ్లీ ఉభయ సభలను ఉద్దేశించి 1975 జనవరి 27 వ తేదీన చేసిన ప్రసంగంలోని అంశాలను దిగువ ప్రచురిస్తున్నాం —ప్ర. సం.)

గడచిన సంవత్సరం ఆంధ్రప్రదేశ్ రాష్ట్రానికి చాలా ముఖ్య మైనట్టిది. వరుసగా కొన్ని సంవత్సరాలలో బుతుపవన పరిస్థితులు ప్రతికూలంగా వుండటంచేత వ్యవసాయ ఉత్పత్తుల విషయంలో మందస్థితి ఏర్పడింది. ఇప్పుడీ మందస్థితి తొలగిపోయి, ఉత్పత్తులు గణనీయంగా పెరిగాయి. 1974 జూన్‌తో అంతమయ్యే వ్యవసాయ సంవత్సరంలోమొత్తం మన ఆహార ధాన్యాల ఉత్పత్తి 86 లక్షల టన్నులకు పైబడి రికార్డు స్థాయిని అందుకొన్నది. ఈ సంవత్సరం రాష్ట్రంలోని కొన్నిప్రాంతాలు ప్రతికూల బుతు పరిస్థితులకు గురి అయినప్పటికీ మొత్తంమీద వ్యవసాయ ఉత్పత్తి స్థితి ఆశాజనకంగానే వున్నది. అగ్ర ప్రాధాన్యంగల జాతీయ కర్తవ్యంగా భావించి ఆహారధాన్యాల ఉత్పత్తిని ఇనుమడింప చేయటం మిక్కిలి ఆవశ్యకం. అందుచేత రాష్ట్ర ప్రభుత్వం ప్రత్యేక రబీ ఉత్పత్తి కార్యక్రమాన్ని ప్రారంభించింది. మన రిజర్వాయర్లలో నిల్వ వున్న నీటిని, నదులలోని ప్రవాహ జలాలను ఉపయోగించుకొని అదనంగా 8 లక్ల ఎకరాలను ఈ పంటకాలంలో సేద్యం క్రిందికి తీసుకురావాలని ఈ కార్యక్రమం సంకల్పిస్తున్నది. కాబట్టి వచ్చే సంవత్సరంకూడా వ్యవసాయ దిగుబడి సంతృప్తికరంగా వుండగలదని మనం విశ్వసించ వచ్చును.

1974 ఏప్రిల్‌లో మన రాష్ట్రం అయిదవ పంచవర్ష ప్రణాళిక ను ప్రారంభించింది. ఆర్థిక వనరుల కొరత మూలంగా నాల్గవ పంచవర్ష ప్రణాళిక చివర సంవత్సరాలలో కొన్ని చిక్కులు ఎదురైన సంగతి గౌరవనీయ సభ్యులకు విదితమే. వనరుల పరిస్థితి మెరుగు కావటంవల్ల ప్రణాళికా వ్యయాన్ని అయిదవ ప్రణాళిక మొదటి సంవత్సరమైన 1974–75 లో రూ. 142 కోట్లకు పెంచేం దుకు వీలు పడింది. 1973–74 లోని వ్యయం రూ. 89 కోట్లు మాత్రమే. ప్రణాళికా వ్యయంలో కావచ్చే ఈ పెరుగుదల రానున్న సంవత్సరాలలో కూడా కొనసాగ గలదు. ఇది ముదావహమైన విషయం.

పెద్ద తరహా నీటిపారుదల, విద్యుచ్ఛక్తి ప్రాజెక్టులు పూర్తి చేసేందుకు రాష్ట్ర ప్రణాళికలో అధిక భాగం కేటాయించటం అవసరమై వున్న సంగతి గౌరవనీయ సభ్యులకు తెలిసినదే. దీనివల్ల నాగార్జున సాగరు, పోచంపాడు, తుంగభద్ర ఎగువకాలువ, నిజాం సాగరు, వంశధార ప్రాజెక్టులవంటి కొన్ని నీటిపారుదల ప్రాజెక్టులకు ప్రయోజనం చేకూరుతుంది. ఇదేవిధంగా విద్యుచ్ఛక్తికి సంబంధించి దిగువ సీలేరు, శ్రీశైలం, నాగార్జున సాగరు జలవిద్యుత్తు ప్రాజెక్టులు, కొత్తగూడెం, విజయవాడలలోని ఉష్ణ విద్యుత్ ప్రాజెక్టుల వంటి ప్రాజెక్టులు ప్రయోజనం పొందగలవు. ప్రణాళికా వ్యయపరిమితి పెరిగినందువల్ల ఈ రంగాలకోసం ఎక్కువ మొత్తాలను కేటా యించడానికి వీలు కలిగింది. అయినప్పటికీ ఇందుకు సంబంధించి ఎంతో కృషి జరుగవలసి వున్నది. ఈ ప్రాజెక్టులను సత్వరంగా పూర్తి చేసేందుకు కేంద్రం నుంచి ఎక్కువ మొత్తంలోనే అదనపు సహాయం పొందవలసి ఉంటుంది. 1975–76 సంవత్సరంలో

కేంద్రం ఇట్టి సహాయాన్ని అందజేయగలదని మన ప్రభుత్వం విశ్వసిస్తున్నది. గోదావరి బ్యారేజిని ప్రపంచబ్యాంకు సహాయంతో నిర్మించే ప్రాజెక్టుగా చేపట్టేందుకు సంకల్పించటం శుభ సూచకం. ఇందు మూలంగా ఈ ప్రాజెక్టు నాలుగు సంవత్సరాలలో పూర్తి కాగలదని ఆశించ బడుతున్నది.

రాబడి వసూళ్లను అధికం చేయటం, అదనపు వనరులను సమీకరించుకోవటం ద్వారా రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని మెరుగు పరచేందుకు మనం తీవ్ర కృషి జరిపాం. తత్ఫలితంగా రాష్ట్ర ప్రణాళికావ్యయాన్ని పెంచగలిగాం. వ్యవసాయేతర రంగం నుంచి అదనపు వనరులను సమకూర్చుకొనేందుకు ఇదివరకే శాసనచర్యలు తీసుకొన్నాం. కాగా నమ్మకమైన నీటిపారుదల వనరుల క్రింద సాగు అయ్యే భూముల పై భూమిశిస్తు పెంచటం, వాణిజ్య పంటలు పండించే భూముల పై ప్రత్యేకశిస్తు విధించటం మూలంగా వ్యవసాయ రంగంలో కూడ అదనపు వనరులను సమీకరించేందుకు మనం నిర్ణయించుకొన్నాం.

ఆరు సూత్రాల పథకాన్ని అమలు పరచటంలో సహాయ సహకారాలందించినందుకు గౌరవనీయ సభ్యులను అభినందిస్తున్నాము. రాష్ట్రంలోని మూడు ప్రాంతాలలోను వెనుకబడిన ప్రదేశాలను శీఘ్ర తరంగా అభివృద్ధిపరచే నిమిత్తం అయిదవ ప్రణాళికా కాలంలో రూ. 90 కోట్ల మేరకు ప్రత్యేక సహాయాన్ని అందించే విషయంలో భారత ప్రభుత్వం తమ ఆమోదం తెలిపిన సంగతి గౌరవనీయ సభ్యులకు విదితమే. జరుగుతున్న సంవత్సరములో మంజూరైన మొత్తం రూ. 18 కోట్లు. ఇది ప్రణాళికా పరిధి వెలుపలగాను, దానికి అదనంగాను ఉంటుంది. మూడు ప్రణాళికా అభివృద్ధి సంఘాలు, రాష్ట్ర ప్రణాళికా మండలిచేసిన సిఫారసుల పురస్కరించుకొని ఆయా జిల్లాలలో వెనుకబడిన ప్రదేశాల అభివృద్ధి నిమిత్తం రూపొందించిన పథకాలు భారత ప్రభుత్వానికి పంపటం జరిగింది. ఈ పథకాల ద్వారా చిన్నతరహా నీటిపారుదల, గ్రామీణ విద్యుదీకరణ, వ్యవసాయం, పశుసంవర్ధన, పాడి పరిశ్రమ, గ్రామీణ నీటి సరఫరా మొదలైన రంగాలలో అదనపు పెటుబడి లభిస్తుంది. దీనికి తోడు పరిశ్రమలు పెంపొందుతాయి. ఈ పథకాలలో చాల వాటికి భారత ప్రభుత్వం తమ అనుమతి తెలియపరచి, జరుగుతున్న సంవత్సరంలో కేంద్రసహాయం తాలూకు మొదటి వాయిదా మొత్తాని విడుదల చేసిన సంగతి గౌరవ నీయ సభ్యులకు సంతోషదాయకం కాగలదు.

రాష్ట్ర రాజధానిని అభివృద్ధి పరచవలసిన ఆవశ్యకతను గురించి కూడ ఆరు సూత్రాల పథకం తెలియజేస్తున్నది. ఇందుకోసం జరుగుతున్న సంవత్సరంలో ఒక కోటి రూపాయల కేంద్ర సహాయం లభించగలదని సూచించబడింది. రాష్ట్ర ప్రభుత్వం ఇందుకు సంబంధించి పంపిన పథకాలను భారత ప్రభుత్వ ఇటీవలే ఆమోదించిన సంగతి గౌరవ నీయ సభ్యులకు సంతోషదాయకం కాగలదు. పట్టణ అభివృద్ధి సంస్థ ఏర్పాటు అయ్యేవరకు ఈ విషయంలో సన్నాహక కార్యక్రమాన్ని నిర్వహించేందుకు ప్రత్యేకాధికారి ఒకరు పదవీ బాధ్యతలు స్వీకరించారు.

రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి పరిస్థితి క్రమక్రమంగా తప్పకుండా మెరుగుకాగలదనే సంగతి గౌరవనీయ సభ్యులకు హర్షప్రదమవుతుంది. క్రిందటిసంవత్సరం కొత్త గూడెం ఉష్ణ విద్యుత్ కేంద్రంలో 110 మెగావాట్ల ఉత్పాదక యంత్రాలు రెండు, వాణిజ్య సరళిలో పని చేయటం ప్రారంభించాయి. దిగువ సీలేరులో 110 మెగా వాట్ల మొదటి ఉత్పాదక యంత్రం 1975 ఆగస్టు నాటికి పనిచేయటం ప్రారంభించగలదని ఆశించ బడుతున్నది. రానున్న రెండు మూడు సంవత్సరాలలో కొత్తగుడెం నాల్గవ దశ ఉష్ణ విద్యుత్ యూనిటు, నాగార్జునసాగరు, శ్రీ శైలం జల విద్యుత్ యూనిట్లు పనిచేయటం ప్రారంభించగలవని మన ప్రభుత్వం, భావిస్తున్నది. వీటిమూలంగా రాష్ట్రంలో విద్యుచ్ఛక్తి లభ్యత గణనీయంగా పెరుగ గలదు. మన రాష్ట్రంలో నే కాకుండా ఇరుగు పొరుగు రాష్ట్రాలలో కూడ విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చేందుకు వీలుగా ఉష్ణ విద్యుత్తును అధికంగా ఉత్పత్తి చేసేందుకు మన రాష్ట్రంలో ఇంకా ఎన్నో అవకాశాలున్నాయి. మొత్తం దక్షిణ మండలంలోని విద్యుచ్ఛక్తి అవసరాలను తీర్చడానికి వీలుగా ఒక్కొక్కటి 1050 మెగావాట్ల శక్తిగల రెండు సూపర్ ఉష్ణ విద్యుత్ కేంద్రాలను రామగుండం, భద్రాచలం పరిసరాలలో నెలకొల్పవలసిందిగా కేంద్రానికి మన ప్రభుత్వం సిఫారసు చేసింది.

రాష్ట్రంలో మామూలు పరిస్థితి తిరిగి నెలకొన్నమీదట పారిశ్రామిక రంగంలో క్రొత్తగా పెట్టుబడులు పెట్టేందుకు అనుకూలమైన వాతావరణం ఏర్పడింది. రాష్ట్రమందు పెద్దతరహా పారిశ్రామిక రంగం లోను, చిన్నతరహా పారిశ్రామిక రంగంలోను పెక్కుమంది పారిశ్రామిక వేత్తలు పరిశ్రమలను నెలకొల్పాలనే ఆసక్తి వ్యక్తపరచారు. అలాంటి క్రొత్త పరిశ్రమలకు కావలసిన సౌకర్యాలను, ఆయా ప్రభుత్వరంగసంస్థలద్వారాను తగు చర్యలు తీసుకొంటున్నది. రాబోయే కొద్ది సంవత్సరాలలో విద్యుచ్ఛక్తి పరిస్థితి మెరుగుపడినమీదట పారిశ్రామిక పెట్టు బడులకు ఇతోధికమైన అవకాశాలు లభించగలవని ఆశిస్తున్నాం. విశాఖపట్నంలో ఉక్కు కర్మాగారాన్ని స్థాపించాలనే కృతనిశ్చయాన్ని కేంద్రప్రభుత్వం పునరుద్ఘాటించిందనే విషయం గౌరవనీయ సభ్యులకు హర్షదాయకం కాగలదు.

జంటనగరాలలోను ఇతర తావులలోను విద్యావకాశాలను విస్తృత పరచటమే ప్రభుత్వవిధానమే ఉన్నది. పార్లమెంటు హైదరాబాదు విశ్వవిద్యాలయ చట్టాన్ని ఆమోదించినసంగతి , ఆ కొత్త విశ్వ విద్యాలయ ఉపాధ్యక్షులు పదవీ బాధ్యతలు చేపట్టిన సంగతి గౌరవనీయ సభ్యులకు విదితమే. జంటనగరాల వెలుపల ప్రస్తుతం ఉన్న మూడు విశ్వ విద్యాలయ ప్రాంతాలలో పట్టభద్రానంతరం విద్యా కేంద్రాలు ఏర్పాటు చేసేందుకు ప్రభుత్వం నిర్ణయించింది. రాష్ట్రమందు గుంటూరులో ఒకటి, వరంగల్లులో మరొకటి — రెండు కొత్త విశ్వవిద్యాలయాలు స్థాపించే ప్రతిపాదనను రాష్ట్ర ప్రభుత్వం విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘానికి పంపిందనే సంగతి గౌరవనీయ సభ్యులకు తెలియజేయడానికి నేనెంతో సంతోషిసు న్నాను.

రాష్ట్రంలో బలహీనవర్గాల వారు ముఖ్యంగా షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగలు, వెనుకబడిన తరగతులవారి సంక్షేమంపట్ల ప్రత్యేక శ్రద్ధవహించటం జరుగుతున్నదనే విషయం గౌరవనీయ సభ్యులకు తెలుసును. వ్యవసాయం, పశుసంవర్ధన, లఘు కుటీర పరిశ్రమలువంటి కార్యక్రమాల ద్వారా షెడ్యూలుకులాలవారి ఆర్థిక అభ్యున్నతికోసం కృషి చేసేందుకు ఆంధ్రప్రదేశ్ షెడ్యూలుకులాలు ఆర్థిక సహకార సంస్థను ఏర్పాటుచేయడంజరిగింది. వెనుకబడిన తరగతుల వారి శ్రేయోభి వృద్ధుల కోసం కూడా ఇదేమాదిరిగా సంస్థ మరొకటి ఏర్పాటయింది. భూమి లేని పేదవారికి భూమి కేటాయించే కార్యక్రమం చురుకుగా అమలు జరుగుతున్నది. షెడ్యూలు కులాలు, ఇతర బలహీన వర్గాల వారికి ఇళ్ల స్థలాలు సమకూర్చే ప్రత్యేక కార్యక్రమం ఒకటి ప్రారంభించబడింది. రాష్ట్రంలో అమలు పరచడం కోసం కేంద్రప్రభుత్వం 4 ఆదివాసీ అభివృది పథకాలను ఆమోదించడం మిక్కిలి ముదావహమైన విషయం.

రాష్ట్ర ప్రభుత్వం భూసంస్కరణల కార్యక్రమానికి ఇస్తున్న ప్రాధాన్యతను గురించి గౌరవనీయ సభ్యులకు విదితమే. 1975 జనవరి 1వ తేదీ నుండి ప్రభుత్వం 1973, ఆంధ్ర ప్రదేశ్ భూసంస్కరణల (వ్యవసాయ కమతములపై గరిష్ట పరిమితి) చట్టాన్ని అమలు లోనికి తెచ్చింది. చట్టం నిబంధనలను శీఘ్ర గతిని అమలు పరచేందుకు అవసరమైన పరిపాలనా యంత్రాంగాన్ని కూడా ప్రభుత్వం ఏర్పాటు చేసింది.

భూమిని తిరిగి పంపిణీ చేయడమన్నది ఆర్థిక, సామ్యవాద సంస్కరణలలో అత్యవసర భాగం అయి ఉన్నది. అయితే సన్నకారు రైతులకు, పేద రైతులకు ప్రత్యక్ష సహాయం సమకూర్చేందుకు గాను దీనికి తోడుగా ఇతర కార్యక్రమాలను కూడా చేర్చడం మిక్కిలి ఆవశ్యకం. నాలుగవ ప్రణాళిక కాలంలో రాష్ట్రమందలి 4 జిల్లాలలో సన్నకారు రైతుల, పేద రైతుల అభివృద్ధి సంస్థలు నెలకొల్ప బడినాయనే సంగతి గౌరవ నీయ సభ్యులకు తెలుసును. ఐదవ పంచవర్ష ప్రణాళికా కాలంలో మరో 12 జిల్లాలలో ఇట్టి సంస్థలు ఏర్పాటు చేయాలని నిశ్చయించడం జరిగింది. అందులో ఆరు సంస్థలు జరుగుతున్న సంవత్సరంలో ఏర్పాటు చేయ బడినాయి. అనావృష్టికి గురి అయ్యే ప్రాంతాల సహాయ పథకానికి తోడుగా దీనిని అమలు పరచడమవుతుంది.

ఆంధ్ర ప్రదేశ్‌లో అధికార సంబంధమైన ఉత్తర ప్రత్యుత్తరాల నిమిత్తం తెలుగును ప్రవేశ పెట్టి దానిని అభివృద్ధి పరచాలనే మహదాశయానికి రాష్ట్ర ప్రభుత్వం అధిక ప్రాముఖ్యతను ఇస్తున్నది, ఈ లక్ష్య సాధన కృషిలో భాగంగా తొలి చర్యగా 1974 తెలుగు ఉగాది నుండి తాలూకా స్థాయి, ఆ క్రింది స్థాయి ప్రభుత్వ కార్యాలయాలలో శాసన పరం కాని ఉత్తర ప్రత్యుత్తరాల కోసం, సామాన్య ప్రజానీకంతో జరిపే ఉత్తర ప్రత్యుత రాల కోసం తెలుగును ఉపయోగించాలని ప్రభుత్వం ఉత రువులు జారీ చేసింది.

ధరల పెరుగుదల, ద్రవ్యోల్బణ పరిస్థితి మూలంగా ఆర్థిక వ్యవస్థ మరింత క్లిష్టమవుతున్నదనే సంగతి ప్రభుత్వానికి తెలుసును. మన దేశంలోనే కాకుండా ప్రపంచం మొత్తం మీద కూడా ఇదే మోస్తరు పరిస్థితి ఏర్పడి ఉన్నది. ఆహార ధాన్యాలు, తదితర అత్యవసర సరుకుల అక్రమ నిల్వలను, దొంగ చాటుగా చేర వేతను, అధిక లాభార్జనను, కల్తీనీఅరికట్టేందుకు రాష్ట్ర స్థాయిలో సాధ్యమైన అన్ని చర్యలను మన ప్రభుత్వం తీసుకొంటూ ఉన్నది. ధరలు పెరగటం వల్ల నికరాదాయ వర్గాల వారి ఆదాయ వ్యయ స్థితి దెబ్బ తింటున్నదనే సంగతి ప్రభుత్వం గుర్తించింది. ఈ సంవత్సరం జనవరి నుండి ప్రభుత్వ ఉద్యోగులు ,స్థానిక సంస్థల ఉద్యోగుల కరువు భత్యాన్ని గణనీయంగా పెంచుతూ ప్రభుత్వం ఒక ప్రకటన చేసింది. రాష్ట్ర ప్రభుత్వ పించనుదార్ల ప్రయోజనార్థం కూడా కొన్ని రాయితీలను ప్రకటించింది.

రాష్ట్రంలో శాంతి భద్రతల పరిస్థితి మొత్తంమీద సంతృప్తికరంగా ఉన్నప్పటికీ అశాంతిని, అలజడులను సృష్టించడానికి గాను ఆర్థిక పరిస్థితిని వినియోగించుకొనేందుకు సంఘ విద్రోహ శక్తులు సర్వదా సన్నద్ధమవుతుంటాయి. శాంతి భద్రతలను కాపాడేందుకు, రాష్ట్రం శాంతి యుతంగా పురోగమించేటట్లు చూడడానికి అవసరమైన చర్యలన్నిటినీ గైకొనేందుకు మన ప్రభుత్వం కృతనిశ్చయమై ఉన్నది.

**గాంధీజీ కన్న కలలు ఫలించే తరుణం ఆసన్నమయింది. అందుకోసం ప్రతి ఒక్కరూ సమైక్యంగా కృషి చేద్దాం.**

# 1975-76 ఆంధ్రప్రదేశ్ బడ్జెట్

## శ్రీ పిడతల రంగారెడ్డి

ఆంధ్ర ప్రదేశ్ శాసన సభలో, శాసన మండలిలో 1975-76 సంవత్సరపు బడ్జెటును సమర్పిస్తూ 1975 ఫిబ్రవరి 15వ తేదీన ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డిగారు చేసిన ప్రసంగంలోని కొన్ని భాగాలను యీ దిగువ ప్రచురిస్తున్నాం

ఆంధ్ర ప్రదేశ్‌కు 1973–74 సంవత్సరం చెప్పుకోదగిన సంవత్సరం. ఒకే విధంగా కాదు—అనేక విధాల. తెలుగు ప్రజల ఐకమత్యపు విజయం దృష్ట్యానే కాదు, చాలా కాలంగా వుంటూ వచ్చిన ఆర్థిక మాంద్యం తొలగి, ఈ ఏడాది సుస్థిర పురోగతికి బాటలు వేసింది. 1972–73లో కన్న 1973–74 లో రాష్ట్ర ఆదాయం 5–9 శాతం పెరుగ గలదని తాత్కాలికపు అంచనా కాని, నిజానికి ఆదాయం సుమారు 14 శాతం పెరిగింది. 1972–73 లోని రూ. 1,271 కోట్ల నుంచి ఆదాయం 1973–74 లో రూ. 1,450 కోట్లకు పెరిగింది. ఈ పెరుగుదలకు ప్రధాన కారణం—1973–74లో 86 లక్షల టన్నులకు పైగా ఆహార ధాన్యాలు పండటం. ఇది గణనీయమైన అధికోత్పత్తి, వ్యవసాయిక ఉత్పత్తి విజృంభించటంతో, పారిశ్రామిక ఉత్పత్తి కూడా ముందడుగువేసింది. విద్యుచ్ఛక్తి పరిస్థితి క్రమంగా చక్కబడటంతో, పారిశ్రామిక పెట్టుబడుల విస్తృతికి తగు వాతావరణం ఏర్పడింది. ఈ ఏడాది వర్షపాతం అంతటా సమంగా లేకపోవటం వలన, ఖరీఫ్ పంట కొంత వరకు దెబ్బతిన్నది. అయినప్పటికీ, ప్రత్యేక రబీ పంటఉత్పత్తి కార్యక్రమాన్ని చేపట్టటం మూలంగా, వ్యవసాయిక ఉత్పత్తి తృప్తి కరంగా వుండగలదని భావిస్తున్నాం. పారిశ్రామిక ఉత్పత్తి పుంజుకుంటోంది.



రాష్ట్ర ఆర్థిక వ్యవస్థ పునరుజ్జీవితం కావటంతో, రాష్ట్ర ఆర్థిక వనరులపై దాని ప్రభావం పడింది. ఇందుకు ఒక్క ఉదాహరణ—1973–74లో రాష్ట్ర ప్రణాళికా వ్యయం సుమారు రూ. 89 కోట్లు ఉంటే, ఈ ఏడాది ఆ మొత్తాన్ని రూ. 142 కోట్లకు పెంచుకోగలిగాం. ఇందుకు ముఖ్య కారణం—రాష్ట్ర రివిన్యూలు అధిక స్థాయిని చేరటం. ప్రభుత్వం చేపట్టిన అదనపు వనరులకృషి.

గతంలో ప్రధాన వస్తువుల ధరల తీరుతెన్నులు చూస్తే, సప్లయిలలో కొది పాటి తరుగుదలలు ఉన్నప్పటికీ మార్కెట్‌లోని ధరల వ్యవస్థ విపరీతపోకడలకు లోబడగలదనే విషయం సంపూర్ణంగా ఋజువయింది. ఆ ధోరణిని అరికట్టాలంటే, ప్రధాన వస్తువులను, ముఖ్యంగా ఆహారధాన్యాలను ఇంకా ఎక్కువగా అందించ గలిగేట్లుగా పబ్లిక్ విధానాన్ని విస్తృతం చేయవలసివుంది. అధికమవుతున్న ఈ బాధ్యతను నిర్వర్తించటానికి, ప్రభుత్వం ఆంధ్ర ప్రదేశ్ స్టేట్ సివిల్ సప్లయిస్ కార్పొరేషన్‌ను నెలకొల్పింది. ఆహార ధాన్యాల సేకరణకై ఈ సంస్థ త్వరలో వ్యాపార రంగంలోకి దిగనున్నది. అటు ఫుడ్ కార్పొరేషన్, ఇటు రాష్ట్ర కార్పొరేషన్ రెండూ

కలిసి పనిచేయుటంవలన, పబ్లిక్ పంపిణీ విధానాన్ని పటిష్టంగా నిర్వహించేందుకై కావలసిన నిలువలను సమీకరించుకోగలం అని అనుకుంటున్నాం. అన్ని జిల్లాల్లోనూ చౌక దుకాణాలద్వారా నెలకు 30,000 టన్నుల బియ్యం సరఫరా అవుతోంది. ఇదే సమయంలో, రాష్ట్ర సరిహద్దులగుండా ఆహార ధాన్యాల దొంగ రవాణాను అరికట్టడానికి తగు చర్యలు తీసుకోబడుతున్నాయి. బ్లాక్ మార్కెట్ దార్ల సంఘ వ్యతిరేక చర్యలను అరికట్టేందుకై ఆంత రంగిక భద్రతా నిర్వహణ చట్టంక్రింద కూడా చర్యలు తీసుకోబడుతున్నాయి. రాష్ట్రంలోని వినియోగ వస్తువుల ధర పెరుగుదల అఖిలభారత సాయికన్న తక్కువగా వుండటం మనకు తృప్తికరమైన విషయం. 1974 ఏప్రిల్ — నవంబర్ కాలంలో రాష్ట్రంలోని వినియోగ ధరలసూచీ సగటు సంఖ్య 1973లో అదే కాలంలోకంటే 21.9 శాతం తక్కువ. కాని అఖిల భారత స్థాయి 28.7 శాతంతో పోలిస్తే మన రాష్ట్ర ధరల సూచీసంఖ్య తక్కువ.

## 1975-76 వార్షిక ప్రణాళిక

ఓట్—ఆన్—అక్కౌంట్ బడ్జెట్‌లో 1974—75 వార్షిక ప్రణాళికకై కేటాయించిన వ్యయం రూ. 128.39 కోట్లు. ఇందులో కేంద్ర సహాయం రూ. 48.75 కోట్లు. రాష్ట్ర వసతులు రూ. 79.64 కోట్లు. తుది బడ్జెట్‌లో ప్రణాళికా వ్యయం రూ. 132.73 కోట్లకు పెంచబడింది. కొన్ని పథకాలకు అదనపు నిధులను కేటాయించడం, కోస్తా ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణా ప్రత్యేక అభివృద్ధి పథకాలక్రింద ఖర్చవని నిలువలను మళ్లీ నమోదు చేయుటం—ఇందు మూలంగా ఈ పెరుగుదల సమకూరింది.

ప్రణాళికా సంఘంతో జరిపిన చర్చల్లో, 1975—76 వార్షిక ప్రణాళిక వసతులు రూ. 131.16 కోట్లుగా మొదట్లో అంచనా వేయబడింది. ఇందులో కేంద్ర సహాయం రూ. 48.75 కోట్లు, ప్రస్తుత సంవత్సరపు మొత్తముకూడా ఇంతే. అయినా నీటిసాగు, విద్యుచ్ఛక్తి రంగాల తక్షణ అవసరాల దృష్ట్యానూ, మిగతా రంగాల్లోని ముఖ్యమైన బాధ్యతల దృష్ట్యానూ రూ. 153.68 కోట్ల వ్యయం బడ్జెట్‌లో కేటాయించబడింది.

1975—76 వార్షిక ప్రణాళిక కేటాయింపుల్లో, ఎక్కువ భాగం మళ్లీ నీటిసాగు, విద్యుచ్ఛక్తి రంగాలకు సమకూర్చబడింది. ఇది సహజమే. విద్యుచ్ఛక్తి కేటాయింపు రూ. 54 కోట్లు. నీటిసాగుకు రూ. 38 కోట్లు. మొత్తం ప్రణాళిక వ్యయంలో 60 శాతం ఉంటుంది ఈ రెండింటి కేటాయింపు. రోడ్డు రవాణాల వ్యయం ప్రస్తుత సంవత్సరంలోని రూ. 9.89 కోట్ల నుంచి 1975—76 లో రూ. 17.86 కోట్లకు పెరిగింది. ఈ పెరుగుదల యావత్తూ ఆర్. టి. సి. ప్రణాళిక వ్యయానికి వరిస్తుంది. సాంఘిక, సామాజిక సేవావసతులకు రూ. 24.97 కోట్లు, సహకారంతో సహా అనుబంధ వసతులకు, వ్యవసాయరంగానికి రూ. 14.21 కోట్లు, పరిశ్రమకు, ఖనిజాలకు రూ. 4.53 కోట్లు.

## వ్యవసాయం

1974 అక్టోబర్‌లోని అధికవర్షాలను లాభసాటి చేసుకోటానికిగాను, నాగార్జునసాగర్ ప్రాజెక్టు, కృష్ణా డెల్టా ప్రాంతలో సుమారు 5.5 లక్షల ఎకరాలమేరలో ప్రత్యేక రబీ ఉత్పత్తి కార్యక్రమాన్ని రాష్ట్ర ప్రభుత్వం ప్రారంభించింది. ఈ ప్రాంతాల్లోని రైతాంగానికి కావలసిన వ్యావసాయిక సదుపాయాలను సమకూరిస్తేనే ఈ కార్యక్రమం జయప్రదం అవుతుంది. ఇందుకని రూ. 8 కోట్లు కేటాయించబడినై. ఈ కార్యక్రమానికి మామూలుగా లభించే ఎరువులకంటే అదనంగా 24 వేలమెట్రిక్‌టన్నుల నైట్రోజన్ ఎరువును పొందగలిగాం. వ్యావసాయిక సదుపాయాల హెచ్చువిలువల దృష్ట్యాను, రైతాంగానికి వ్యావసాయిక పరపతిని సులభంగా సమకూర్చవలసిన అవసరం దృష్ట్యాను రూ. 6 కోట్లు మేరకు అనుబంధ పరపతిని చేకూర్చవలసిందని చేసిన సూచనకు, రిజర్వుబ్యాంకు అంగీకరించింది.

వ్యాపారపు పంటల విషయంలో, పత్తి అభివృద్ధిలో చెప్పుకోదగిన విజయం సాధించబడింది. అదనంగా 1,15,500 పత్తి బేళ్ల ఉత్పత్తి చేయబడింది. నాగార్జున సాగర్ ప్రాజెక్టు, తుంగభద్ర ప్రాజెక్టు, కర్నూలు జిల్లా లోని కె.సి. కెనాల్...వీటిక్రింద నీటిసాగు ప్రత్తిపంట ప్రాంతాన్ని విస్తరించటంవలన ఇది సాధ్యం అయింది. 1975—76లో, ఐ.సి.డి.పి. లో ఒక భాగంగా ఆదిలాబాద్, కర్నూలు జిల్లాల్లో వర్షప్రాంతాల్లో 1.5 లక్షల ఎకరముల మేరకు ఈ కార్యక్రమాన్ని విస్తరించాలని ప్రతిపాదించబడింది. నాగార్జున సాగర్ ప్రాంతంలో 3.25 లక్షల ఎకరాల్లో యం.సి.యు—5 పత్తిని, కృష్ణా వరిపంట భూముల్లో 50,000 ఎకరాలో కృష్ణపత్తిని పండించాలని కూడా అనుకుంటున్నాం.

వ్యావసాయిక రంగంలో అధికోత్పత్తిదే అగ్రస్థానం అయినప్పటికీ, ఈ కార్యసాధనలో గ్రామీణ ఆర్థిక వ్యవస్థలో ఆదాయ తారతమ్యాలు మరింత అస్తవ్యస్థం కాకుండా చూడటం అవసరం. బలహీన వర్గాలపట్ల చిన్నకారు, సన్నకారు రైతుల్లాంటి తక్కువ పనిపాటలుగల వారిపట్ల ప్రత్యేక శ్రద్ధ చూపాలి.

## సహకార రంగం

వ్యవసాయ ఉత్పత్తికై రైతులకు తక్కువ గడువు పరపతిని సమకూర్చటంలో ఈ ఏడాది సహకార సంఘాలు, చెప్పుకోతగ్గ ప్రగతిని సాధించినాయి. 1974—75లో ఈ విధమైన పరపతి క్రింద లక్ష్యం రూ. 32 కోట్లు. అయినా 1974 ఖరీఫ్ తరుణంలోనే సమకూర్చిన పరపతి రూ. 32.30 కోట్లు. రబీ తరుణంలో మరొక రూ. 10 కోట్లు సమకూర్చాలని ప్రతిపాదించబడింది. అంటే, ఈ విధంగా రైతులకు సమకూర్చిన పరపతి రూ. 42 కోట్లు దాటిపోవచ్చు. నాల్గవ ప్రణాళిక కాలంలో సగటు సాలుసరి మొత్తం సుమారు రూ. 25 కోట్లు మాత్రమే. వచ్చే ఏడాదికూడా పరపతి ఇదే స్థాయిలో ఉండగలదనుకుంటున్నాం.

బలహీన వర్గాలకు సహాయపడేందుకై ఉద్యోగ పూర్వకమైన ప్రత్యేక కార్యక్రమాలను ప్రభుత్వం అమలు జరుపుతోంది. బలహీన వర్గాల సహకార సంఘాలకు సాయపడటానికై ఈ ఏడాది రూ. 10.95 లక్షలు కేటాయించబడ్డాయి. సహకార వ్యవసాయ సంఘాలు, శ్రామికకాంట్రాక్టు సంఘాలు,రిక్షావారి సంఘాలు రజకులు, మంగలి సంఘాల సహాయానికై ఈ మొత్తం పూర్తిగా వినియోగించ బడుతుంది. ఈ కార్యక్రమాల భౌతిక ప్రయోజనం వచ్చే ఏడాది మరింత విస్తృతం చేయబడుతోంది. ఇందుకోసమని కేటాయింపును 1975–76 బడ్జెట్ అంచనాల్లో రూ. 55 లక్షలకు పెంచటమైంది.

## విద్యుచ్ఛక్తి

రాష్ట్ర ఆర్థిక అభివృద్ధి విషయంలో విద్యుచ్ఛక్తికి ముఖ్య స్థానం ఉంది. దీర్ఘకాలికమైన ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ గా చూసినా అవసరమే,. అలాగే, విద్యుచ్ఛక్తి కొరతను బాగా తగ్గించడం ద్వారా ధరలపై వత్తిడిని తగ్గించే తక్కువ గడువు సాధనంగా కూడా విద్యుచ్ఛక్తి ఉపయోగపడు తుంది. అదనపు ఉత్పాదక సెట్లను నెలకొల్పే విషయానికి ప్రాముఖ్యం చూపటంతో బాటు, అవసరమైన థర్మల్ శక్తిని సమకూర్చటం ద్వారా, విద్యుచ్ఛక్తి ఆపుదలను నివారించటం జరుగుతోంది. వర్షాభావపు ఫలితాలను ఇందు మూలంగా కొంత తగ్గించుకోవచ్చు. కొత్తగూడెం థర్మల్ విద్యుచ్ఛక్తి కేంద్రపు మూడవ దశకు చెందిన రెండు యూనిట్లను ఈ ఏడాది ప్రారంభించటంతో, స్థాపిత విద్యుచ్ఛక్తి 888 మెగా వాట్లకు పెరిగింది. ఈ రెండు యూనిట్ల శక్తి ఒక్కొక్కటి 110 మెగా వాట్లు. విద్యుచ్ఛక్తి రంగానికి ప్రభుత్వం ప్రాధాన్యం చూపుతూనే వుంది. విద్యుచ్ఛక్తి ఉత్పాదన, ప్రసారం, పంపిణీల పై వ్యయం పెరుగుతూనే వుంది. మూడవ ప్రణాళికలో ఈ పెట్టుబడి రూ. 93.6 కోట్లు. నాల్గవ ప్రణాళికలో సుమారు రూ. 186.4 కోట్లు . అంటే దాదాపు రెట్టింపు అన్నమాట,. 1975–76 కు వ్యయం రూ. 54 కోట్లుగా ప్రతిపాదించ బడింది. కొరదలా ప్రాజెక్టుల దృష్ట్యానూ, వాటిని ఐదవ ప్రణాళిక అంతానికి వినియోగంలోకి తేవలసిన అవసరం దృష్ట్యానూ, ఈ వ్యయాన్ని ఇంకా అధికం చేయ వలసివుంది. ఈ ఏడాది, రాష్ట్ర విద్యుచ్ఛక్తి సంస్థకు బడ్జెటులో కేటాయించిన సహాయానికి అదనంగా, మరొక రూ. 9.33 కోట్లు కేటాయింప బడినై—ఉత్పాదనకు, గ్రామీణ విద్యుదీకరణ పథకాలకు వచ్చే ఏడాది కార్య క్రమాల్లో దిగువ సీలేరు వద్ద 1975 ఆగస్టు నాటికి 110 మెగావాట్ల కేంద్రాన్ని పనిలోకి తెచ్చే పథకం చేర్చ బడింది. కొత్తగూడెం నాల్గవ దశ, విజయ వాడ థర్మల్ కేంద్రం, నాగార్జునసాగర్ జల విద్యుచ్ఛక్తి పథకం—వీటి పనులు కూడా చురుగ్గా సాగుతున్నాయి.

## గృహవసతి

ఆరు సూత్రాల పథకం క్రింద కోటి రూపాయల కేంద్ర సహాయంతో అమలు జరిగే జంట నగరాల పథకాలను రూపొందించటం పూర్తి అయింది. జంట నగరాల అభివృద్ధి మాస్టర్ ప్రణాళిక త్వరలో ప్రకటించ బడుతుంది,. విశాఖపట్నం, విజయవాడ, గుంటూరు, వరంగల్, కర్నూలు, తిరుపతి లాంటి ఇతర ముఖ్య ప్రాంతాలకు మాస్టర్ ప్రణాళికలు తిరిగి రూపొందించబడుతున్నాయి.

## బలహీన వర్గాల సంక్షేమము

షెడ్యూల్డు కులాలకు, జాతులకు చెందే పోస్టు—మెట్రిక్ విద్యార్థులకు స్కాలర్ షిప్పుల రేట్లను ఈ ఏడాది పెంచటం గౌరవ సభ్యులకు తెలుసు. తల్లిదండ్రుల సాలుసరి ఆదాయ పరిమితి రూ. 3,600 నుంచి రూ. 6,000 లకు పెంచబడింది—ఈ స్కాలర్ షిప్పుల అర్హత కోసం.

ఇప్పుడు హాస్టళ్లు లేని అన్ని తాలూకా ప్రధాన నగరాల్లో విద్యార్థులే నిర్వహించే హాస్టళ్లకుగాను ఏర్పాటు చేయబడినాయి, ఈ ఏడాది షెడ్యూల్డు కులాల, జాతుల విద్యార్థులకు, సుమారు 16,000 మంది కాలేజి విద్యార్థులకు ఇవి వసతిని కల్పిస్తాయి. ఇప్పుడిలాంటి హాస్టళ్లు లేని జిల్లా ప్రధాన నగరాల్లో క్రొత్తగా 15 కాలేజీ విద్యార్థినుల హాస్టళ్లను ఏర్పాటు చేయటానికి ఉత్తర్వులు జారీ చేయబడినాయి.

## భూసంస్కరణలు

1973 ఆంధ్ర ప్రదేశ్ భూసంస్కరణలు (వ్యవసాయ కమతాలపై పరిమితి) చట్టం 1–1–1975 నుంచి అమలులోకి తేబడింది. చట్టం అమలుకై రివిన్యూ డివిజనల్ అధికార్లు (భూ సంస్కరణలు) ప్రతి రివిన్యూ డివిజన్‌లో నియమింపబడ్డారు. చట్టం క్రింద ట్రిబ్యునల్స్‌గా వ్యవహరించేందుకై చట్టాన్ని పటిష్టంగా అమలుపరచడానికి కావలసిన పరిపాలన ఏర్పాట్లన్నీ చేయబడినాయి. మిగులు భూస్వాములకు పరిహారం చెల్లించేందుకై వచ్చే ఏడాది బడ్జెట్‌లో రూ. 3 కోట్లు కేటాయించబడింది. చట్టంలో ఉద్దేశించబడినట్లు, ప్రభుత్వం తీసుకొన్న భూములను భూమిలేని పేదలకు పంపిణీ చేయాలనికూడా ప్రతిపాదించబడింది.

## 1975-76 బడ్జెటు అంచనాలు

మొదట్లోనే ప్రస్తావించినట్లు, వచ్చే సంవత్సరపు ఆర్థిక పరిస్థితులు ప్రోత్సాహకరంగా ఉన్నాయి. ఈ ఆర్థిక చైతన్యాన్ని ఆధారం చేసుకొని, అదనపు వసతుల సమీకరణ ఫలితంగా రివిన్యూ జమ రూ. 505.37 కోట్లుగా అంచనా వేయబడినాయి. 1974–75 సవరించిన అంచనాలు రూ. 459.69 కోట్లు. ఇక రివిన్యూ ఖర్చు 1974–75 లోని రూ. 433.18 కోట్లనుంచి 1975–76 లో రూ. 491.88 కోట్లకు పెరగ గలదని అంచనా వేయబడింది. ఈ పెరుగుదలకు ముఖ్య కారణం — ధరలు తీవ్రంగా పెరగటం. ఇందుమూలంగా అభివృద్ధికి చెందని ఖర్చు, ముఖ్యంగా జీతాలు, అలవెన్సులు—పెరిగింది, ధరల పెరుగుదల దృష్ట్యా ఈ ఏడాది ప్రభుత్వ ఉద్యోగుల కరువుభత్యపు రేట్లు, అలాగే అనుబంధ ఉద్యోగుల కరువుభత్యపు రేట్లు 1–1–1975

( తరువాయి 51వ పేజీలో )



భారత ఉపాధ్యక్షులు శ్రీ బి.డి. జెట్టికి బేగంపేట విమానాశ్రయంలో స్వాగతం చెబుతోన్న గవర్నరు శ్రీ యస్. ఓబుల్‌రెడ్డి, ముఖ్య మంత్రి శ్రీ జలగం వెంగళరావు ప్రభృతులు, పురప్రముఖులు.

# పత్రచిత్రాలు



భారత ఉపాధ్యక్షులు శ్రీ బి.డి. జెట్టి జనవరి 8న హైదరాబాద్ వచ్చిన సందర్భంగా మాజీ గవర్నరు శ్రీ ఖండూభాయి దేశాయి స్వాగతం పలుకుతోన్న దృశ్యం



గవర్నరు శ్రీ యస్. ఓబుల్‌రెడ్డి ఫిబ్రవరి 1 వ తేదీన పోచంపాడు ప్రాజెక్టును సందర్శించారు. ప్రాజెక్టు అధికారులు వారికి వివరాలను సావిస్తరంగా తెలియ పరుస్తోన్న చిత్రం.

# రాజధాని విశేషాలు

—రామచంద్ర



## ఫిలిం, టెలివిజన్ సంస్థ

ఫిలిములలోను, టెలివిజన్‌లలోను పనిచేయడానికి ఉత్సాహ పడేవారికి తగిన శిక్షణ ఇవ్వడంకోసం వచ్చే ఏప్రిల్ నెలనుండి రాజధానిలో ఒక సంస్థ నెలకొంటున్నది. దేశంలో టెలివిజన్ ప్రచారమయినప్పుడు కనీసం 15 వేల మంది సాంకేతిక నిపుణులు కావలసివస్తారు కనుక యిప్పటినుండే ఈ సంస్థ నిపుణులను తయారు చేస్తుంది. దీని నిర్వాహక సంఘానికి కార్యదర్శి శ్రీ ఎన్. ఎ అయ్యంగార్ సదరన్ మూవీటోన్ స్టూడియోస్‌లో ఈ సంస్థ నెలకొల్పబడుతుంది.

## మాజీ మంత్రిణికి సన్మానం

మాజీ మంత్రిణి శ్రీమతి మాసుమా బేగంకు కేంద్ర ప్రభుత్వం పద్మశ్రీ బిరుదం ఇచ్చిన సందర్భంగా డిసెంబర్ 12వ తేదీన లేడి హైదరి క్లబ్బులో అఖిల భారత మహిళా మహాసభ ఆంధ్రప్రదేశ్‌లో ఉత్తర ప్రాంత శాఖ యాజమాన్యాన జరిగిన సన్మానసభలో పెక్కు మహిళా సంఘాల ప్రతినిధులు ఆమెను అభినందించారు. శ్రీమతి కమలాదేవి ఛటోపాధ్యాయ శ్రీమతులు ఎస్. ఎన్. రెడి. వహబుద్దీన్ అహమ్మద్, సెబాస్టన్ మొదలయినవారు ప్రసంగించారు.

## ఆంధ్ర విశ్వ విద్యాలయం క్రొత్త వైస్‌ఛాన్సలర్

శ్రీ యం. ఆర్. అప్పారావు శ్రీ ఎల్. బుల్లెయ్య స్థానంలో ఆంధ్ర విశ్వ విద్యాలయం వైస్ ఛాన్సలర్‌గా నియమించబడ్డారు. శ్రీ అప్పారావు వయస్సు 59 సంవత్సరాలు 1940 లో ఎం. ఏ. పట్టా పుచ్చుకున్నారు. 1938 నుండి 62 వరకు ఆంధ్ర విశ్వవిద్యాలయం సెనేటు సభ్యులుగా వున్నారు. తర్వాత మంత్రి అయ్యారు 1950 లో ఉమ్మడి మద్రాసు రాష్ట్ర శాసనసభకు నూజివీడు నియోజకవర్గమునుండి 1957 లో ఎన్నికయి, అప్పటి నుంచి శాసన సభ్యులుగా వున్నారు సాహిత్య అకాడెమీ సభ్యులుగాను, సంగీత నాటక అకాడెమి అధ్యక్షులుగానూ ఉన్నారు.

## ఆర్థికమంత్రి సలహా

ఆర్థిక సమాచార శాఖా మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి డిసెంబర్ 15న అసోసియేటెడ్ న్యూస్ సర్వీస్ రజతోత్సవానికి అధ్యక్షత వహించినప్పుడు ప్రసంగిస్తూ రాష్ట్రంలో ఇంకా కొన్ని పత్రికలు స్థాపించబడాలనీ, అలా జరిగితే ప్రభుత్వం వాటికి సహాయం చేస్తుందనీ అన్నారు. ముఖ్యమంత్రి శ్రీ వెంగళరావు ఈ ఉత్సవాన్ని ప్రారంభించారు. తెలుగు ప్రజల ఆశయాలు తెలుపడానికి ఇంకా ఎన్నో తెలుగు పత్రికలు, ఇతర భాషల పత్రికలు రావాలని ఆర్థిక మంత్రి కోరారు. పత్రికలకు పూర్తిగా స్వాతంత్ర్యం వుండాలని, ప్రభుత్వం అలాంటి స్వాతంత్ర్యాన్ని తగ్గించడం ప్రజాస్వామ్యాభివృద్ధికి భంగకరమని ఆయన నొక్కి చెప్పారు.

## కొత్త నాటు పద్ధతి

అఖిల భారత సమన్విత జొన్న అభివృద్ధి పథకం అధికారి డాక్టర్ ఎన్. గంగా ప్రసాద్‌రావు యిటీవల పత్రికా ప్రతినిధులతో ముచ్చటిస్తూ, ఈ పథకం క్రింద కొత్తరకం నాట్లపద్ధతి కనిపెట్టామనీ, దీనివల్ల వానలు సరిగా పడకపోయినా, రైతులకు నష్టంలేని పద్ధతిని పంటలు పండుతాయని తెలిపారు. ఒకచాలు జొన్న, మరొక చాలు సెనగ, ఇంకొక చాలు సోయాచిక్కుడు, లేక జొన్న, ఆముదము, సెనగ ఇలా చాళ్ళు మార్చడంవల్ల ఏ పంటా దెబ్బ తినదనీ, నష్టంకూడా వుండదనీ, ఒకటి పండకపోయినా మరొకటి పండుతుంది గనక కలసివస్తుందని ఆయన వివరించారు.

## పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ హితవు

పోలీస్ ఇన్‌స్పెక్టర్ జనరల్ శ్రీ అబ్దుస్సలాం ఖాన్ యిటీవల గాంధీభవన్‌లో సాంస్కృతిక కార్యక్రమం ప్రారంభిస్తూ, విద్యార్థులు, యువకులు వివిధ రంగాలలో దేశంకోసం సేవ చేయడానికి సిద్ధంగా వుండాలని ఉద్బోధించారు. రెవెన్యూ శాఖామంత్రి శ్రీ పి నర్సారెడ్డి ప్రధాన అతిథిగా ఉన్నారు కళాకారులు యువకులు పూర్వుల ఆదర్శాలను అనుసరిస్తూ భారతీయ కళాకారులను ప్రోత్సహించాలని ఆయన కోరారు అధ్యక్షత వహించిన ఆంధ్రప్రదేశ్ పత్రికా రచయితల సంఘాధ్యక్షుడు శ్రీ బి. నాగేశ్వరరావు దేశంలో జరుగుతున్న అభివృద్ధి రంగంలో ప్రయోగాలు జరిపే అవకాశం విద్యార్థులకు మాత్రమే వుండదని అన్నారు.

# గిరిజనులకు నవోదయం

శ్రీ భాట్టం శ్రీరామమూర్తి



గిరిజనులు దురదృష్టవశాత్తూ సమాజంలోని వెనుకబడిన వర్గాలలో మరీ వెనుకబడిన వర్గానికి చెందినవారు. అనేక కారణాలవల్ల శతాబ్దాల తరబడి వారు యితర ప్రపంచంతో సంబంధం లేకుండా అడవులలో ఒంటరిగా జీవిస్తున్నారు. తత్ఫలితంగా సమాజంలోని యితర వర్గాలకూ, గిరిజనులకూ మధ్య పెద్ద అగాధం ఏర్పడింది. అందువల్ల తమ ప్రపంచంలో తామే నివసిస్తూ నాగరిక ప్రపంచంతో సంబంధం లేకుండా జీవించసాగారు.

1947 లో స్వాతంత్ర్యం లభించడంతో సమాజంలోని యీ దురదృష్టవంతులకు నూతన జీవితం ప్రారంభమైంది. గిరిజనుల సత్వర అభివృద్ధికి మన రాజ్యాంగవేత్తలు రాజ్యాంగంలో తగిన అవకాశాలు కల్పించారు. ఉదాహరణకు, సమాజంలోని బలహీనవర్గాలకు–ముఖ్యంగా షెడ్యూలు కులాల, షెడ్యూలు తెగల ప్రజల విద్యావిషయక, ఆర్థిక పరమైన ప్రయోజనాలను పరిరక్షించడానికి ప్రభుత్వం ప్రత్యేక శ్రద్ధతో కృషిచేస్తూ, వారిని స్వప్రయోజనాలకు వినియోగించుకోకుండానూ, అన్యాయాలకు గురికాకుండానూ చేస్తుందని రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో పేర్కొన్నారు. తదనుగుణంగా, యితరరాజ్యాంగ సూత్రాలను అనుసరించి, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం గిరిజన సంక్షేమానికి అనేక శాసనాలను చేయడంతోపాటు వివిధ సంక్షేమ కార్యక్రమాలను అమలు జరుపుతున్నది.

## నూతన శకారంభం

ప్రథమ పంచవర్ష ప్రణాళికలోను, తర్వాతి ప్రణాళికలోనూ గిరిజన సంక్షేమానికి అనేక కార్యక్రమాలు జరపడంతో గిరిజనులకు నూతనశకం ఆరంభమైంది. మొదటి పంచవర్ష ప్రణాళికలో గిరిజన ప్రాంతాలలో రూ. 118.72 లక్షల ఖర్చుతో కార్యక్రమాలు అమలు జరిపారు. ఉట్నూరు, అరకు, నరసంపేట, పాడేరులలో నాలుగు బహుళార్థ సాధక ప్రాజెక్టులను ప్రారంభించటంతో దీర్ఘకాలికమైన ప్రణాళికకు నాంది పలకడం జరిగింది. మూడవ పంచవర్ష ప్రణాళికా కాలంలో గిరిజన ప్రాంతాలలో 24 గిరిజన అభివృద్ధి బ్లాకులను ఏర్పాటు చేయడంతో మరో ముందడుగు వేశారు.

తర్వాతి ప్రణాళికలో అభివృద్ధి గమనం మరింత వేగవంతంగా నడచింది. గిరిజన సంక్షేమానికి నిర్దేశించిన నిధులు రూ. 118.72 లక్షల నుండి నాలుగవ ప్రణాళికలో రూ. 734.03 లక్షలకు పెరిగింది. దానికితోడు, ఈ సాంఘిక సమస్యను మరింత ప్రత్యేక శ్రద్ధతో పరిష్కరించడానికి గిరిజన సహకార సంఘం ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు తెగల సహకార గృహ నిర్మాణ సంస్థ వంటి ప్రత్యేక సంస్థను ఏర్పాటు చేశారు.

గిరిజనులకు ప్రధానమైన వృత్తి వ్యవసాయం. గిరిజనులు తమ భూములను ఎంతో ప్రాణప్రదంగా చూసుకుంటారు. అయితే ఎంతో కాలంనుండి వారు వడ్డీ వ్యాపారస్తుల చేతుల్లో నలిగిపోతున్నారు. 1947 సంవత్సరం తర్వాత పరిస్థితులు పూర్తిగా మారిపోయాయి. సంక్షేమ రాజ్యస్థాపనకు అంకితమైన ప్రభుత్వం పెద్ద ఎత్తున సహాయ కార్యక్రమాలను అమలు జరపనారంభించింది. ఇంతవరకు దాదాపు 10 లక్షల ఎకరాల భూమిని పేదలకు పంపిణీచేశారు. ఈ భూములు యివ్వడంలో షెడ్యూలు కులాలు షెడ్యూలు తెగల వారికి ఎక్కువ ప్రాధాన్యం యిచ్చారు. కౌలుదారు, ముఠాదారు, మాల్గుజారీవంటి మధ్యదళారీలను రద్దుచేశారు. గిరిజన ప్రాంతాలలో గిరిజన అభివృద్ధి బ్లాకులను ఏర్పాటు చేయుటతో వ్యవసాయ అభివృద్ధికి ఎక్కువ శ్రద్ధ తీసుకోవడం జరిగింది.

## నీటి పారుదల పథకాలు

గడచిన రెండు ప్రణాళికల కార్యక్రమాలలో గిరిజన ప్రాంతాలలో చిన్నతరహా నీటిపారుదల పనులపై ప్రత్యేక శ్రద్ధ వహించారు. విశాఖపట్నంజిల్లా చింతపల్లి గిరిజన అభివృద్ధి బ్లాకులోని రాజంగి రిజర్వాయరు ద్వారా దాదాపు 1000 ఎకరాలకు నీటి పారుదల సౌకర్యం లభిస్తున్నది. విశాఖపట్నం, శ్రీకాకుళం జిల్లాలలో చిన్నచిన్న సెలయేరుల నుండి నీటిని గిరిజన ప్రాంతాలకు మళ్లిస్తున్నారు. ఖమ్మం, పశ్చిమగోదావరి, వరంగల్లు, ఆదిలాబాదు జిల్లాలలోని మెట్టప్రాంతాలలో పెద్ద ఎత్తున సేద్యపు నీటి బావుల త్రవ్వకం, చెరువుల త్రవ్వకం చేపట్టారు.

సేద్యపు నీటిపారుదల సౌకర్యానికి బావుల నుండి, సరస్సుల నుండి, నదుల నుండి నీటిని తోడడానికి అవసరమైన పంపుసెట్లు, విద్యుచ్ఛక్తి మోటార్లు, డీసెల్ ఇంజనులను గిరిజన సంక్షేమ శాఖ వారు సరఫరా చేస్తున్నారు. గిరిజన అభివృద్ధి సంస్థవారు శ్రీకాకుళం జిల్లాలోని గిరిజన ప్రాంతాలలో 17 చిన్న తరహా నీటిపారుదల పనులను, 257 సేద్యపు నీటిబావుల త్రవ్వకం పనులను చురుకుగా కొనసాగిస్తున్నారు. గిరిజన అభివృద్ధి బ్లాకువారు 62,169 ఎకరాల భూమిని సాగులోకి తెచ్చారు.

## పరిశ్రమలు

గిరిజన కార్పొరేషన్‌వారు గిరిజన ప్రాంతాలలో ఉపాధితో కూడిన ప్రోసెసింగ్ యూనిట్లను నెలకొల్పారు. అడ్డాకుల కుట్టు కేంద్రాలు, మైరోబొలాన్ క్రషింగ్ ప్లాంటు మొదలైన వాటిలో గిరిజనులకు ఉపాధి అవకాశాలు కల్పిస్తున్నారు. వివిధ గిరిజన అభివృద్ధి బ్లాకులలోని శిక్షణాయుతమైన ఉత్పత్తి కేంద్రాలలో వడ్రంగం, కుమ్మరి, నేత మొదలైన వృత్తులలో గిరిజనులకు తమ కాళ్లపై తాము నిలబడడానికి శిక్షణ యిస్తున్నారు. గిరిజన ఆర్థిక వ్యవస్థపై ప్రైవేటు వ్యాపారస్థుల, వడ్డీ వ్యాపారస్థుల ఆధిపత్యాన్ని తొలగించడానికి సహకార వ్యవస్థ బాగా ఉపయోగపడుతున్నది. వ్యవసాయపరపతి సంఘాలు, అటవీ విషయాల సహకార సంఘాలు, మార్కెటింగ్ సంఘాలు, స్టోర్స్‌వంటి 278 వివిధ సహకార సంఘాలు గిరిజనుల అవసరాలను తీరుస్తున్నాయి. 1956 లో విశాఖపట్నంలో గిరిజన సహకార కార్పొరేషన్ ఏర్పాటు కావడంతో సహకార, మార్కెటింగ్ వ్యవస్థలో నూతన అధ్యాయం ప్రారంభమైంది. ఈ కార్పొరేషన్‌వారు గిరిజనుల నుండి అటవీ ఉత్పత్తులను కొనుగోలు చేయడంతోపాటు వారికి నిత్య జీవిత వస్తువులను సరసమైన ధరలకు సరఫరా చేస్తున్నారు. రాష్ట్రంలోని 16 జిల్లాలలో 30 మార్కెటింగ్ సంఘాలు, 311 డి. ఆర్. విక్రయశాలలు పనిచేస్తున్నాయి.

## విద్యాభివృద్ధి

గిరిజనులను అభివృద్ధి మార్గంలో పయనింపజేయడానికి విద్యఎంతగానో ఉపయోగపడుతుంది. ఆశ్రమ పాఠశాలల సంఖ్యను త్వరితగతిని ఎక్కువ చేస్తున్నారు. ఆంధ్రప్రదేశ్‌లో ఇప్పుడు 255 ఆశ్రమ పాఠశాలలు ఉన్నాయి. వాటికి తోడు, 297 హాస్టళ్లలో 12,771 మంది గిరిజన విద్యార్థులు ఉన్నారు. ప్రి మెట్రిక్, పోస్ట్ మెట్రిక్ స్కాలర్‌షిప్పులతోపాటు గిరిజన బాలబాలికలకు పుస్తకాలు, దుస్తులు, మొదలైన వాటిని ఉచితంగా సరఫరా చేస్తున్నారు. గిరిజన సంక్షేమ శాఖ నిరంతర కృషి ఫలితంగా ఉన్నతస్థాయిగల విద్యాసంస్థలలో సహితం గిరిజన విద్యార్థులకు ప్రవేశం లభిస్తున్నది. పబ్లిక్ పాఠశాలలు, సైనిక పాఠశాలలో వారికి సీట్లు రిజర్వు చేస్తున్నారు.

అనేక కారణాలవల్ల గిరిజన ప్రాంతాలలో జీవన పరిస్థితులు దుర్భరంగా ఉన్నాయి. అందువల్ల మారుతున్న జీవన పరిస్థితులకు అనుగుణంగా ఉత్తమ జీవన విధానాలు చాలా అవసరం. 1062 గిరిజన కుటుంబాలకు అన్నిసౌకర్యాలతో కూడిన పునరావాసం కల్పించడానికి 23 గృహవసతి, భూమి కాలనైజేషన్ పథకాలను గిరిజన సంక్షేమశాఖ ఏర్పాటు చేసింది. దానికితోడు ఆంధ్రప్రదేశ్ షెడ్యూలు కులాలు, షెడ్యూలు తెగల సహకార గృహనిర్మాణ సంస్థ పెద్ద ఎత్తున ఇండ్లు నిర్మించే కార్యక్రమాన్ని చేపట్టింది. రాష్ట్రంలో నిర్మించబడిన 55,546 ఇండ్లలో 7946 యిండ్లు గిరిజనులకు చెందినవి ఉన్నాయి.

ఈ సౌకర్యాల కల్పన ద్వారా గిరిజనులకు నవోదయం ప్రారంభమైంది. మారుతున్న పరిస్థితులకు అనుగుణంగా వారు కూడా మారుతున్నారు. వచ్చే సంవత్సరాలలో వారు నాగరిక ప్రపంచానికి తమవంతు కృషిని కొనసాగిస్తారని ఆశించవచ్చు.



# ప్రాంతీయ అభివృద్ధి పథకాలు

ఆరు సూత్రాల పథకం క్రింద ప్రస్తుత సంవత్సరంలో కేంద్రం కేటాయించిన నిధుల నుండి తెలంగాణా, రాయలసీమ, కోస్తా ఆంధ్ర ప్రాంతాలలోని గుర్తించబడిన వెనకబడిన ప్రాంతాల అభివృద్ధికి రాష్ట్ర ప్రణాళికా మండలి సిఫార్సు చేసిన రు. 18కోట్ల ఖర్చుతో కూడిన వివిధ పథకాలను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ఆమోదించింది. రాష్ట్ర సత్వరాభివృద్ధికి ఉద్దేశించబడిన యీ పథకాలలో చిన్నతరహా నీటిపారుదల, గ్రామీణ విద్యుదీకరణ, మంచినీటి సరఫరా పెంపుదల, పారిశ్రామిక అభివృద్ధి, వ్యవసాయం, తత్సంబంధమైన కార్యక్రమాలు ఉన్నత విద్యకు ఎక్కువ ప్రాధాన్యం యిస్తున్నారు.

ఈ పథకాలను ఆమోదిస్తూ, నీటిపారుదల, వ్యవసాయం, వెనుకబడిన తరగతులకు సంబంధించిన ఆర్థిక సహాయ కార్యక్రమాలు గ్రామీణ విద్యుదీకరణ, భూగర్భజలాల అభివృద్ధి వంటి జిల్లావారీ పథకాలకు 75 శాతం, ప్రాంతీయ పథకాల క్రింద ఉన్నత విద్య, పారిశ్రామికాభివృద్ధికి మిగతా 25 శాతం మొత్తాన్ని నిర్దేశించారు. జిల్లా వారీ పథకాల క్రింద రాష్ట్రంలో వివిధ అంశాల వారీగా దిగువ విధంగా కేటాయింపులు జరిగాయి.

రూపాయలు (లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | మధ్యతరహా నీటిపారుదల | 6-00 |
| 2. | చిన్నతరహా నీటిపారుదల | 516-00 |
| 3. | వ్యవసాయం, పాడిపరిశ్రమ అభివృద్ధి అడవులు, తత్సంబంధమైన అంశాలు | 209-45 |
| 4. | గ్రామీణ మంచినీటి సరఫరా | 203-59 |
| 5. | బలహీన వర్గాలకు ఆర్థిక సహాయ కార్యక్రమాలు | 57-84 |
| 6. | గ్రామీణ విద్యుదీకరణ | 300-00 |
| 7. | భూగర్భజలాల అభివృద్ధి | 12-50 |
| | | 1305-38 |

(సుమారు రు. 13 కోట్లు)

జిల్లా వారీ పథకాల నిమిత్తం నిర్దేశించిన నిధుల నుండి కోస్తా ఆంధ్రులకు రు. 2.89 కోట్లు, రాయలసీమకు రు. 3.91 కోట్లు, తెలంగాణా ప్రాంతానికి రు.6.75 కోట్లు కేటాయించారు.

## ప్రారిశ్రామిక అభివృద్ధి

పారిశ్రామిక అభివృద్ధి కార్యక్రమం క్రింద రు. 4.5 కోట్ల ఖర్చుతో కూడిన ప్రతిపాదనలను రాష్ట్ర ప్రభుత్వం పరిశీలించింది. వివరాలు దిగువ యివ్వబడినాయి.

రూపాయలు (లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ పారిశ్రామికాభివృద్ధి కార్పొరేషన్ | 155-00 |
| 2. | ఆంధ్రప్రదేశ్ పారిశ్రామిక పునాది సంబారాల కార్పొరేషన్ | 100-00 |
| 3. | ఆంధ్రప్రదేశ్ గనుల కార్పొరేషన్ | 30-00 |
| 4. | వస్త్ర పరిశ్రమ | 25-00 |
| 5. | చక్కెర పరిశ్రమ | 80-00 |
| 6. | చిన్నపరిశ్రమాభివృద్ధి కార్పొరేషన్ | 30-00 |
| 7 | లఘు పరిశ్రమలు | 28-00 |
| 8. | పరిశ్రమల శాఖ | 2-00 |
| | | రు. 450-00 |

పారిశ్రామికాభివృద్ధి పథకాలకు నిర్దేశించిన రు. 4.50 కోట్లలో తెలంగాణాకు రు. 2.25 కోట్లు, రాయలసీమకు రు.1.35 కోట్లు, కోస్తా ఆంధ్రకు రు. 0.90 కోట్లు కేటాయించారు.

ప్రభుత్వం ఆమోదించిన ప్రాంతీయవారీ పారిశ్రామిక అభివృద్ధి పథకాలు, వాటి ఖర్చు వివరాలు దిగువ యివ్వబడినాయి.

### కోస్తా ఆంధ్ర

రూపాయలు (లక్షలలో)

| | | |
|---|---|---|
| 1. | ప్లయివుడ్...రంపచోడవరం | 8-00 |
| 2. | సముద్ర ఆహార పదార్థాలు...నెల్లూరు జిల్లా | 4-00 |
| 3. | జనపనార మిల్లు...సాలూరు | 18-00 |
| 4. | ఉప్పు, సముద్ర ఉత్పత్తులు...టెక్కలి | 6-00 |

5. పారిశ్రామిక అభివృద్ధి ప్రాంతం...విశాఖపట్నం 12-00
6. గణపతి నగరం, ఎస్.కోట తాలూకాలలో గనులు, రాక్‌ఫాస్ఫేటు పరిశ్రమ—విశాఖపట్నం జిల్లా 6-00
7. సహకార చక్కెర ఫ్యాక్టరీ తాండవ—తూర్పు గోదావరి జిల్లా 16-00

## రాయలసీమ

1. కాగితం గుజ్జు కాగితం తయారీ...కర్నూలు 45-00
2. బేరియం రసాయనాలు...కడప 4-00
3. పారిశ్రామికాభివృద్ధి ప్రాంతం...రేణిగుంట, తిరుపతి 15-00
4. గుంతకల్లు, కడప, కర్నూలు, తిరుపతి, ప్రొద్దుటూరు, నంద్యాల 15-00
5. కడప జిల్లా, పులివెందల తాలూకా నూతులలో ఆస్బెస్టాస్ గనుల అభివృద్ధి 3-00
6. కడప జిల్లా మంగపేట, రాజంపేట, తాలూకాలలో బ్యారైటు గనులు 6-00
7. చిత్తూరు జిల్లా రేణిగుంటలో సహకార చక్కెర ఫ్యాక్టరీ 24-00
8. కర్నూలు జిల్లా నంద్యాలలో సహకార నూలు మిల్లు, దుస్తుల తయారీ 5-00

## తెలంగాణా ప్రాంతం

1. రేయాన్ గ్రేడు గుజ్జు తయారీ యూనిట్...వరంగల్లు జిల్లా 17-00
2. సాల్వెంటు విభజన...నల్లగొండ 4-00
3. స్పాంజి, ఉక్కు...ఖమ్మం జిల్లా 10-00
4. ఫైబరుగ్లాసు...మహబూబ్‌నగర్ జిల్లా 15-00
5. సాల్వెంటు విభజన...నిజామాబాదు జిల్లా 4-00
6 పర్టికల్ బోర్డు...మెదక్ జిల్లా 20-00
7. పారిశ్రామికాభివృద్ధి ప్రాంతం...పంట చెరువు 30-00
8. పారిశ్రామికాభివృద్ధి ప్రాంతం...శాద్‌నగర్ 10-00
9. పారిశ్రామిక వాటికలు...మిరాలగూడెం, ఆదిలాబాదు, భద్రాచలం, రామగుండం 15-00
10. మెలారం, (ఖమ్మంజిల్లాలో) రాగిగనులు, కేంద్రీకరణ ప్రాజెక్టులు 15-00
11. నల్లగొండ జిల్లా మిర్యాలగూడెంలో చక్కెర ఫ్యాక్టరీ 4-00
12. ఆదిలాబాదులో, సహకార నూలు మిల్లు, దుస్తుల తయారీ 20-00

## ఉన్నత విద్య

రు 0-50 లక్షల ఖర్చుతో పోస్ట్‌గ్రాడ్యుయేటు కోర్సు ప్రవేశాలను పెంచడానికి సంబంధించిన పథకాన్ని రాష్ట్ర ప్రభుత్వం ఆమోదించింది. ప్రతి కేంద్రానికి రు. 5 లక్షల చొప్పున ఖర్చుతో నిజామాబాదు, కర్నూలు, ఆంధ్ర విశ్వవిద్యాలయం ప్రాంతంలో ఒకటి చొప్పున కొత్తగా పోస్ట్‌గ్రాడ్యుయేటు కేంద్రాల ఏర్పాటు యీ ఉన్నత విద్యాపథకంలో చేర్చబడినాయి. పైజాబితా రాష్ట్ర వంతు ఖర్చును తెల్పుతుంది. ఈ కొత్త కేంద్రాలు సహాయం మంజూరు చేయాలని విశ్వవిద్యాలయ గ్రాంట్ల సంఘాన్ని కోరుతారు. కరీంనగర్, ఖమ్మం, కడప, శ్రీకాకుళం, విజయవాడ, నెల్లూరులలోని ప్రభుత్వ కళాశాలలో కొత్తగా పోస్ట్‌గ్రాడ్యుయేటు కేంద్రాలను ప్రారంభించాలని ప్రతిపాదించారు. ఇందు నిమిత్తం రు. 15 లక్షలు నిర్దేశించారు. వీటికితోడు వరంగల్లు, గుంటూరులలోని ప్రస్తుత పోస్ట్‌గ్రాడ్యుయేటు కేంద్రాలకు ఒక్కొక్క దానికి రు. 10 లక్షల చొప్పున గ్రాంటు యిస్తారు.



# వార్తావాహిని

రాష్ట్ర గవర్నరు శ్రీ యస్. ఓబుల్‌రెడ్డి ఫిబ్రవరి 12వ తేదీన కర్నూలు జిల్లాలోని గాజులదిన్నె ప్రాజెక్టు ప్రాంతాన్ని సందర్శించారు. రాయలసీమ అభివృద్ధి మండలి అధ్యక్షులు శ్రీ కె.బి. నరసప్ప, జిల్లా కలక్టర్ శ్రీ కోసలరామ్ లుకూడా గవర్నరుతో పాటు పర్యటించారు. ప్రాజెక్టు పనిలో అభివృద్ధిని పర్యవేక్షించి, లక్కసాదిన్నె, ఇరొన బండ, పిలిగుండ్ల, నెరుదుప్పల గ్రామవాసులతో వారి ఆస్తులకు పరిహారాలచెల్లింపు విషయమై ముచ్చటించారు. సవరింపబడ్డ అంచనాలననుసరించి పరిహారాల చెల్లింపుకై దాదాపు 125 లక్షల రూపాయలు ఖర్చవుతుంది.

పత్తికొండ తాలూకాలోని హంద్రీనదిపై నిర్మింపనున్న గాజులదిన్నె మధ్యతరహా ప్రాజెక్టుకు 578.5 లక్షల రూపాయలు ఖర్చవుతుందని అంచనా. ఈ ప్రాజెక్టు వలన ప్రత్తికొండ, ధోనె, కర్నూలు తాలూకాల్లోని బంజరు భూములకు నీటిపారుదల సౌకర్యాలు సమకూరుతాయి.

ప్రాజెక్టు చీఫ్ ఇంజనీర్ శ్రీ రాజారావు మూడు దశల్లో ప్రాజెక్టుపని పూర్తికావడానికి అవకాశంవుందని గవర్నరుకు తెలియజేశారు.

## దేశభక్త జయంతి ఉత్సవం

దేశభక్త కొండా వెంకటప్పయ్య పంతులుగారి 109వ జయంతి సందర్భంగా రాష్ట్ర సమాచార కేంద్రంలో ఫిబ్రవరి ఒకటవ తేదీన నిర్వహింపబడ్డ ఔత్సాహిక సమావేశంలో మాట్లాడుతూ శాసన మండలి సభ్యులు శ్రీ వి. వెంకటనారాయణ "దేశభక్త" శ్రీ కొండా జీవితంలో పాటించిన త్యాగ నిరతిని, సేవాతత్పరతను అలవరచుకోవాలని యువతరాన్ని ఉద్బోధించారు.

"దేశభక్త" సంక్షేమం కోసం చేసిన త్యాగాలూ, అవిరళ సేవా గాంధీజీ నెంతగానో ఆకర్షించాయని ఆయన అన్నారు.

హరిజనోద్ధరణకూ, ఖాదీ విప్లవానికీ పంతులుగారు చేసిన సేవ అమోఘమైనదని శాసన సభ్యులు శ్రీ టి. హయగ్రీవాచారిగారు శ్లాఘించారు.

శ్రీ కొండా వెంకటప్పయ్యగారి కుమార్తె శాసన మండలి సభ్యురాలు శ్రీమతి కొండా పార్వతీదేవి స్వాతంత్ర్య పోరాట సమయంలో తండ్రిగారి సాన్నిహిత్యంలో తన అనుభవాలనూ, అనుభూతులనూ విశదంగా వివరించారు.

## విస్తారంగా జనుపనార ఉత్పత్తి

రాష్ట్రంలో ఈ యేడాది గత సంవత్సరంలోకంటే 28 శాతం ఎక్కువ విస్తీర్ణంలో జనుముపంట పండించటం జరుగుతుంది. కడపటి అంచనాల ప్రకారం 1974-75 సంవత్సరంలో 5000 హెక్టార్ల భూమిలో జనుము పండిస్తారు. క్రిందటి సంవత్సరం 3,900 హెక్టార్ల విస్తీర్ణంలో మాత్రమే జనుము పండింది.

పచ్చి ఎరువు, పశుగ్రాసం, జనపనార మొదలైన వాటికోసం జనుము పండించబడుతుంది. ఈ నివేదికలో ఇచ్చిన పంట విస్తీర్ణం జనపనారకోసం మాత్రమే ప్రత్యేకంగా వేయబడ్డ జనుము పంటకు సంబంధించినది.

1973-74 సంవత్సరంలో జనపనార ఉత్పత్తి 5,800 బేళ్ళు కాగా యీ సంవత్సరం 180 కిలోగ్రాములకు 7,500 బేళ్ళ జనపనార ఉత్పత్తి కాగలదని తెలుస్తోంది.

## చిత్తశుద్ధితో కష్టించిపనిచేసే అధికార్లకు ప్రమోషన్లు

ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఫిబ్రవరి 1వ వాణిజ్యపుపన్నుల శాఖ గజిటెడ్ అధికారుల సంఘానికి ప్రారంభోత్సవంచేస్తూ చిత్తశుద్ధితో, కష్టపడి పనిచేసే అధికార్లకు ప్రమోషన్లివ్వటం జరుగుతుందనీ, శ్రమించి సేవచేసే అధికార్లకు చేయూతనివ్వటానికి ప్రభుత్వం ఎన్నటికీ వెనుకాడబోదనీ అన్నారు.

పన్నుల ఎగవేతను అరికట్టడానికి వాణిజ్యపు పన్నులశాఖ గట్టిచర్యలను తీసుకోవల్సి వుందనీ, పన్నుల ఎగవేత నరికట్టినట్లయితే రాష్ట్ర రెవిన్యూ కలెక్షను కనీసం 200 కోట్ల రూపాయలు ఉండేదని ముఖ్యమంత్రి అన్నారు.

గత సంవత్సరం రెవిన్యూ కలెక్షన్ 75 కోట్ల రూపాయలు. ఈ ఆదాయం హెచ్చయినందుకు ముఖ్యమంత్రి తమ సంతోషాన్ని వెలిబుచ్చారు. ఈ సంవత్సరం ఇది 125 కోట్ల రూపాయల మేరకు ఉండగలదని ఆశిస్తున్నామన్నారు.

ఆర్థిక మంత్రి శ్రీ పిడతల రంగారెడ్డి రెవిన్యూ కలెక్షను 100 కోట్లకు పైగా పెంచడానికి దోహదం చేసినందుకు వాణిజ్యపు పన్నుల అధికారులను అభినందించారు.



భారత దేశంలోని కెనడా హైకమీషనరు శ్రీ జె. ఆర్. మేబీ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావుతో జనవరి 30 వ తేదీన సంభాషణలు జరుపుతోన్న దృశ్యం.

# వార్తా చిత్రాలు



కేంద్ర పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ టి.ఎ. పాయ్ సికిందరాబాద్‌లో కాసెట్ టేప్ రికార్డరు విభాగానికి ప్రారంభోత్సవం చేశారు. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు, పరిశ్రమల శాఖ మంత్రి శ్రీ పి.బసిరెడ్డి గార్లను కూడా చిత్రంలో చూడవచ్చు.



ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు జనవరి 16 వ కామారెడ్డిలో ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ట్రాన్స్‌పోర్టు కార్పొరేషన్ వారి బస్‌డిపో కాంప్లెక్సుకు ప్రారంభోత్సవంచేశారు. ట్రాన్స్‌పోర్టు శాఖ మంత్రి శ్రీ జె. చొక్కారావు, ఎ. పి. యస్. ఆర్. టి.సి. అధ్యక్షులు శ్రీ పి. నరసింగ రావులను కూడా చిత్రంలో చూడవచ్చు.

## అనావృష్టి ప్రాంతాలకు ఆశాజ్యోతి

# ఇక్రిశాట్ సంస్థ

శ్రీ మునునూరు శివరామకృష్ణారావు

జీవనదులుగాని, చాలినంత వర్షపాతంగాని లేని ప్రాంతాలలో ఆధునిక శాస్త్రవిజ్ఞానం సహాయంతో అధికాహారోత్పత్తి సాధించడాన్ని గురించి పరిశోధనలు చేసే అంతర్జాతీయ సంస్థ "ఇక్రిశాట్" 1972 జులై నెలలో హైదరాబాదులో ఏర్పాటయ్యింది. 10 కోట్ల రూపాయలతో నిర్మించదలపెట్టిన యీ సంస్థ భవనాల సముదాయానికి పటాన్ చెరువు వద్ద గడచిన జనవరి 11 వ తేదీన ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ శంకుస్థాపన చేశారు. అధికాహారోత్పత్తికై సాగుచున్న అంతర్జాతీయ కృషి యొక్క తొలిఫలం అని యీ సంస్థను ఆమె అభివర్ణించారు.

భారత ప్రభుత్వం ఇచ్చిన దాదాపు 1400 హెక్టేర్ల భూమిలో 10 కోట్ల రూపాయలు ఖర్చుకాగల భవనాలు, పరిశోధనా క్షేత్రాలు, ప్రయోగశాలలు 1976 చివరికి ఏర్పాటు అవుతాయి. ఎక్కువగా వాడే జొన్న, సజ్జ, కంది, శనగ, వేరుశనగ పంటల అధికోత్పత్తికి యీ సంస్థ కృషి చేస్తుంది. తక్కువ నీటితో తక్కువ ఖర్చుతో, స్థానిక వాతావరణ పరిస్థితులను అనుకూలపరచుకొంటూ ఎక్కువ ఫలసాయాన్ని పొందడ మెలాగో పరిశోధించి, ఆ అనుభవ సారాన్ని వ్యవసాయదారులకు అందజేయడం ఇక్కడి శాస్త్రజ్ఞుల లక్ష్యం.

## వరుణదేవుడే ఆధారం

ప్రపంచంలోని ఉష్ణమండలాలలో కొన్ని ప్రాంతాలు అతివృష్టికి గురి అవుతుంటే మరికొన్ని ప్రాంతాలు అనావృష్టి వల్ల ఈ బాధలను ఎదుర్కొంటున్నాయి భారత దేశం, ఆఫ్రికా, దక్షిణ ఆసియా పశ్చిమఆసియా, దక్షిణ అమెరికాలోని అర్జెంటినా, మెక్సికో, బ్రెజిల్ మొదలైన దేశాలలో ఆహారోత్పత్తి, కోట్లాది ప్రజల జీవన పరిస్థితులు వరుణదేవుని కృపపై ఆధారపడివున్నాయి. వర్షం సరిగ్గా పడితే తినేట్లు; లేకపోతే క్షామం విలయతాండవం చేస్తుంది! రాయలసీమ, తెలంగాణాలలో అనావృష్టివలన చీటికీమాటికీ కరువు పరిస్థితులు ఏర్పడడం, ఆర్థికంగా ఆ ప్రాంతాలు వెనుకబడి వుండడం మనకు తెలిసిన విషయమే. శాశ్వత జలాధారాలు లేని ఇటువంటి ప్రాంతా



ఇక్రిశాట్ పంటచేలో పరిశీలన జరుపుతున్న పాశ్చాత్యనిపుణుడు



కన్నుల పండుగ చేసే జొన్న పంట

లలో ఆహారోత్పత్తి సమస్యలను పరిష్కరించనిదే ఆకలిపై పోరాటం విజయవంతం కానేరదు. ఆహారసమృద్ధి, స్వయం పోషకత్వం అనే మాటలు అర్థవంతం కావాలంటే జలసమృద్ధిగల ప్రాంతాలలో మాత్రమే వ్యవసాయ విప్లవం వస్తే చాలదు.

## ''ఇక్రిశాట్'' అవతరణ

ఈ అవగాహనతో, వ్యవసాయ పరిశోధనా విషయాల అంతర్జాతీయ సంప్రదింపుల సంఘం 'ఇక్రిశాట్' సంస్థను నెలకొల్పింది. ఆస్ట్రేలియా, బెల్జియం, కెనడా, పశ్చిమ జర్మనీ, నెదర్లాండ్స్, నైజీరియా, నార్వే, స్వీడన్, స్విట్జర్లాండ్, థాయిలాండ్, అమెరికా, బ్రిటన్ దేశాలు, ఐక్యరాజ్య సమితి అభివృద్ధి వ్యవహారాల మండలి, వాతావరణ వ్యవహారాల మండలి, అభివృద్ధి, పునర్నిర్మాణాల అంతర్జాతీయ బ్యాంక్, అంతర్జాతీయ అభివృద్ధి వ్యవహారాల పరిశోధనా కేంద్రం, ఫోర్డ్ ధర్మనిధి, ప్రపంచ ఆహార, వ్యవసాయ సంస్థ 'ఇక్రిశాట్' కు అంగబలాన్ని అర్థబలాన్ని, సమకూరుస్తున్నాయి.

మెట్ట భూముల పరిశోధనా వ్యవహారాల అఖిల భారత సమన్వయ పథకం, జొన్న అభివృద్ధి వ్యవహారాల అఖిల భారత సమన్వయ పథకం, రాజేంద్ర నగర్ వ్యవసాయ విశ్వవిద్యాలయం హైదరాబాదు లోనే వుండడం ఇక్రిశాట్‌కు చేదోడు వాదోడుగా వుంటుందని భావించడమేగాక, ఆఫ్రికా, ఆసియా, దక్షిణ అమెరికాలలోని అనావృష్టి ప్రాంతాలలో ఎక్కువగా కానవచ్చే ఎర్రనేలలు, నల్లనేలలు కూడా హైదరాబాదు పరిసరాలలో వుండడం వలన పరిశోధనలకు అనువుగా వుంటుందని యీ అంతర్జాతీయ సంస్థను ఆంధ్రప్రదేశ్ రాజధానిలో నెలకొల్పడం జరిగింది. జొన్న, సజ్జ, కంది, శెనగ, వేరుశెనగకు సంబంధించి ప్రపంచమంతటా లభించే భిన్న వంగడాలను సేకరించి ఫలసాయం తగ్గకుండా, తక్కువ ఖర్చుతో, ఎక్కువ పోషక పదార్థాలుండి, చీడపీడలకు తట్టుకొని, స్థానిక వాతవరణానికి సానుకూల పడేవిధంగా అభిలషణీయమైన లక్షణాలను ప్రోది చేసి, అవాంఛనీయమైన వాటిని తొలగించి నూతన వంగడాలను రూపొందించడం ఇక్రిశాట్ ప్రధానధ్యేయం. ప్రస్తుతం 200 హెక్టేర్ల భూమిలో పరిశోధనా క్షేత్రాలు ప్రారంభించి 200 మంది శాస్త్రజ్ఞులు ప్రయోగాలు చేస్తున్నారు.

## అభివృద్ధికరమైన మార్పులు

వ్యవసాయ విధానాలలో కూడా మార్పులు తీసుకొని రావాలని యీ పరిశోధకుల అభిప్రాయం. వెలుపలినుంచి సాగు నీటిని తీసుకొని రాకుండా, లభించినంత వర్షపు నీటినే వృధా కాకుండా ఉపయోగించుకొని ఉత్పత్తిని అధికంచేసే మార్గాలను అన్వేషించడం; భూమిని సేద్యయోగ్యం చేయడంలోను, వ్యవసాయంలోను పెట్టుబడి అధికమయ్యే యంత్ర సామాగ్రిని వాడకుండా సాధారణ వ్యవసాయ పరికరాలను, పశువులను ఉపయోగించి ఉత్తమ ఫలితాలను సాధించే మేలిరకం పద్ధతులను కనుగొనడం, ఏడాదిలో ఇప్పటికంటె ఎక్కువ పంటలను పండించే అవకాశాలు సృష్టించడం లక్ష్యంగా పరిశోధకులు సాగిస్తున్న కృషి ఆశాజనకమైన ఫలితాలను చూపిస్తున్నది.

ప్రపంచంలో వివిధ పరిశోధనా సంస్థలు సాగిస్తున్న కృషిని సమన్వయం చేసుకొంటూ అధిక రాలుబడి, నాణ్యత కలిగిన జొన్న వంగడాన్ని రూపొందించేందుకు ప్రయత్నం జరుగుతున్నది. కొత్తగా రూపొందిస్తున్న ఒపేక్-2 రకం జొన్న విత్తనంలో అధిక పోషక శక్తి వుంటుందని నిపుణుల అంచనా. అలాగే సజ్జ విషయంలో చీడలను తట్టుకొనే దృఢమైన సంకర వంగడాన్ని సాధించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి.

మాంసాహారం తినని వారికి, స్వల్పాదాయ వర్గాలకు శరీర నిర్మాణానికి అత్యవసరమైన మాంసకృత్తులు లభించాలంటే కంది, శనగ, వేరుశెనగ వంటి పప్పుదినుసులపైననే ఆధారపడవలసి వున్నది. అందు వలన ఈ మూడు పప్పు ధాన్యాలను అభివృద్ధి పరచడానికి ఇక్రిశాట్ పూనుకొన్నది. కందులలో నాణ్యతను, పోషక విలువను పెంచడం, రాలుబడిని అధికంచేయడం, పంట కొచ్చే కాలాన్ని తగ్గించడం మిశ్రమ సేద్యావకాశాలు పరిశీలించడం ప్రధాన లక్ష్యాలుగా పని కొనసాగుతున్నది. శనగపంటకు తెగుళ్ళ బాధ ఎక్కువ. అందువలన తెగుళ్ళను నిరోధించుకొనే బలమైన లక్షణాన్ని ప్రవేశ పెట్టడం, ఒకే కాయలో ఎక్కువ గింజలు వచ్చేటట్లు చూడడం, ఒకే శనగ మండకు ఎక్కువ కాయలు కాసేటట్లు చూడడం పరిశోధనల లక్ష్యంగా పెట్టుకొన్నారు. వేరుశెనగపై పరిశోధనలు ఈ సంవత్సరం ప్రారంభమౌతాయి

పంటల రాలుబడి పెంచడమేగాక, వర్షపు నీటిని వృధాకాకుండా నిలువచేసి అదునులో ఉపయోగించు కొనడానికి గల అవకాశాలు కూడా ఇక్కడి శాస్త్రజ్ఞులు పరిశీలిస్తున్నారు. మెట్ట సాగులో విప్లవాత్మక పరిణామాలు తీసుకొని రాగల యిటువంటి అంతర్జాతీయ పరిశోధనా సంస్థ హైదరాబాదులో నెలకొనడం మన భావి భాగ్యోదయానికి శుభ సూచన.



# తక్కువ ఖర్చుతో హెచ్చు దిగుబడినిచ్చే వేసవి వరిరకాలు

డా. ఎస్. వి. ఎస్. శాస్త్రి

గడచిన సంవత్సరంలో ఖరీఫ్ వరి పంట కార్యక్రమము ఎన్నో సమస్యలను ఎదుర్కొనవలసివచ్చింది. వర్షాభావ పరిస్థితులు, విద్యుచ్ఛక్తి సరఫరాలో అంతరాయము, ఇంధన తైలముల ధరలలో విపరీతమైన పెరుగుదల, రసాయనిక ఎరువుల కొరత, వరదలు మొదలైనవి వరిపంట తగ్గుదలకు కారణమైనాయి. అందుచేతనే ప్రస్తుతపు రబీ, వేసవి వరి ఉత్పత్తి కార్యక్రమమును మరింత పట్టుదలతో చేపట్టి గడచిన వరిపంట లోపమును పూరించవలసి వుంటుంది.

కృష్ణా, గోదావరి నదుల డెల్టాలలో నీటి పారుదల వసతి భూములలో ఈ అధికోత్పత్తి లక్ష్యమును విధిగా సాధించవలసి వున్నది. ఆంధ్రప్రదేశ్‌లో దాళ్వావరి ఊడ్పులు ఫిబ్రవరికి బదులుగా అంతకుముందు డిసెంబరు నెలలోనే పూర్తి చేయుట వలన ఎక్కువ పంటను పండించుటకు అవకాశము కలిగినది. సాధారణముగా కోస్తా ఆంధ్రప్రదేశ్‌లోని రైతులు ఖరీఫ్ వరిపంటను కోసిన తరువాత సుమారు 3 నెలలకు ఫిబ్రవరి మాసములో దాళ్వా పంటకు ఊడ్చేవారు. వరంపరాగతముగా వస్తున్న ఈ పద్ధతి స్థానిక వరి రకములకు అనువుగా వుండేది. అయితే ఈ వరి రకములు తక్కువ పిలకలు పెట్టి, అగ్గి తెగులుకు తరచు లోనయ్యేను. ఈ రకములను డిశంబరు-జనవరి నెలలలో ఊడ్చినట్లైతే అప్పటి శీతల పరిస్థితుల వలన శీఘ్రముగా ఎదిగేవికాదు. అంతేకాక, కాండము తొలిచే పురుగు దాడికి ఇవి లోనయ్యేవి. అందుచేతనే ఈ వరి రకములను రైతులు ఫిబ్రవరి మాసములో ఊడ్చి, మే నెలలో కోసేవారు. పంట కోతకువచ్చే ఈ పరిమిత కాలములో ఎక్కువ పంటలు పండేవికావు. ఈ సమయములో నీటి ఎద్దడి, కాండము తొలిచే పురుగులకు పంట లోనగుట, తక్కువ పంటలకు కారణమయ్యేది.

## తెగుళ్ళ, చీడల నివారణ

అయితే, ఎక్కువ పిలకలు పెట్టి, క్రిమినాశక ఔషధముల ద్వారా కాండమును దొలిచే పురుగుల బారి నుండి రక్షణ కల్పించబడుటతో ఎక్కువ పంటనిచ్చే వరి రకములను రైతులు విరివిగా పండించ నారంభించారు. అందుచేతనే ఈనాడు మార్చినెలకు ముందుగా జయ లేక సోనా వంటి వరిరకములను పండించి రైతులు ఎక్కువ పంటలను పండించ గలుగుతున్నారు. ఋతువులో వరిని పండించే భూమి విస్తీర్ణము కూడా బాగా పెరిగింది. పశ్చిమ గోదావరి జిల్లాలో వరిపంటపై జరిపిన పరిశీలన ఫలితముగానే ఇది సాధ్యమైనది,

రబీ పంటకు ఉపయోగించే వరిరకములు నారుమడి దశలో వరి కాండమును తొలిచే పురుగునుండి, మిడతల నుండి తట్టుకొనగలగాలి. పొట్టి వరిరకములు సాధారణముగా దీనికి అనువైనవి. నారుమడిలోను, ఊడ్చిన కొద్దిరోజుల తరువాత ఒకటి, రెండు పర్యాయములు క్రిమినాశక ఔషధములను చల్లుట వలన చౌకలో వరి కాండమును దొలిచే పురుగుల బారి నుండి పంటను రక్షించవచ్చును. అగ్గి తెగులుకు లోనుకాని సోనా-ఐ.ఇ.టి.-4254 రకములను పండించుట మంచిది. ఈ తెగులు విస్తృతముగా వ్యాపించిన ప్రాంతములలో జయ ఐ.ఇ.టి.-1444 రకములను వేయవచ్చును. ఊడ్చిన 30 నుండి 40 రోజుల ప్రాంతములో వరిమొక్కలు మిడతలబారికి లోనుకాకుండా వాటి మొదళ్ళు కదులునట్లు వరుసల మధ్య నడిచి మిడతలు కాండమునుండి రసమును పీల్చకుండా చేయాలి. అటు తరువాత కాండపు మొదళ్ళు తడియునట్లు క్రిమినాశక ఔషధమును చల్లాలి. ఊడ్చిన 50 నుండి 60 రోజుల ప్రాంతమున వరిచేసును జాగ్రత్తగా పరిశీలించి అవసరమైనట్లయితే మిడతలబారి నుండి కాపాడుటకు ఒక పర్యాయము క్రిమినాశక ఔషధమును చల్లాలి.

## సరియైన మోతాదులో ఎరువులు

రసాయనిక ఎరువులు మామూలుగా దొరికే రోజులలోనే వాటి ఖరీదు రైతులకు అందుబాటులో వుండదు. అది అతికష్టముపై లభించే ఈ రోజులలో రైతులకు రసాయనిక ఎరువులు లభించుట మరింత కష్టము. ఎక్కువ పంటనిచ్చే వరి రకములకు ఎక్కువ రసాయనిక ఎరువు కావలెననే అభిప్రాయము సరియైనది కాదు. అందుచేతనే తగిన వ్యవసాయ పద్ధతులను అవలంబించినట్లైయితే ఎక్కువ పంటనిచ్చే వరి రకములు తక్కువ రసాయనిక ఎరువులను ఉపయోగించినా మామూలు రకములకంటె ఎక్కువ పంటనే ఇస్తాయి.

రసాయనిక ఎరువులు లభించుట కష్టమైన యీ రోజులలో సోనా, జయ, విజయ, ఐఇటి-2254, ఐఆర్-8 రకములను పండించుట మరింత ముఖ్యము. పైన పేర్కొనినట్లు సరియైన వ్యవసాయ పద్ధతులను అవలంబించుట, రసాయనిక ఎరువులను పాత పద్ధతిలోకాక, పరిమితముగా ఉపయోగించుట ఈనాడు ఎరువుల కరువు సమయములో ప్రతి రైతూ అవలంబించవలసిన పద్ధతులు.

దమ్ము సమయములో రసాయనిక ఎరువులను ఉపయోగించుట ఎక్కువ ఖర్చుతో గూడిన పని. దీనికి బదులుగా 10+10 సెం. మీ. లేక 15 15 సెం. మీ. దూరంలో ప్రతి కుదురుకూ 1 లేక 2 బలిష్టమైన నారు మొక్కలను ఉపయోగించుట వలన మంచి ఫలితములు లభించాయి. నారుమడిని పల్చగా చల్లుటవలన బలిష్టమైన నారుమొక్కలు లభిస్తాయి. ఈ నారును 5 సెం. మీ. లోతుకు మించకుండా పైపైనే నాటాలి. వరిమొక్కలు పిలకలు పెట్టే సమయములో 5 నుండి 10 సెం.మీ. లోతుకు మించకుండా వరిచేనులో నీరు వుండాలి. దీనివలన బాగా పిలకలు పెట్టుటకు అవకాశము వుంటుంది. వరి నారును ఊడ్చిన 30 నుండి 40 రోజులలో ఒకే పర్యాయము హెక్టారుకు 40 నుండి 50 కి.గ్రా. నత్రజని నిచ్చే ఎరువు చల్లుట వలన ఎంతో మంచి ఫలితములు లభించాయి. అనగా, ఒత్తుగా ఊడ్చిన చేనులో స్థానికముగా లభించే భూసారమును పూర్తిగా గ్రహించే వరివేళ్ళు వ్యాపించుతాయి, ఇక గ్రహించుటకు నత్రజని అంతగా లభించని సమయములో పైన పేర్కొనినట్లు నత్రజని ఎరువును ఒకే పర్యాయము సరఫరా చేయుట వలన మంచి ఫలితములు లభించాయి. దీనికి సంబంధించిన పరిశీలనలు పరిశోధనాక్షేత్రములలో మాత్రమేకాక, రైతుల పొలములలోకూడా కొనసాగించగా మంచి ఫలితములు లభించాయి.

పైన పేర్కొనిన మేలైన వరి రకములను ఉపయోగించినప్పుడు నత్రజని ఎరువును అసలు వాడకపోయినా, సరియైన వ్యవసాయ పద్ధతులను అవలంబించుట వలన హెక్టారుకు 3 నుంచి 4 టన్నుల పంటను రైతులు పండించగలిగారు. అందుచేతనే రసాయనిక ఎరువులు లేకపోయినా రైతులు సరియైన వ్యవసాయ పద్ధతులను అవలంబించి ఎక్కువ ఖర్చులేకుండా మంచి పంటలు పండించవచ్చును.

( ఐ. సి. ఎ. ఆర్. )

# క్షార భూములలో వరి పంట

మన దేశంలో 70లక్షల హెక్టార్ల విస్తీర్ణంగల ప్రాంతంలో చవిటిభూములు వున్నాయి. క్షారంలేక ఉప్పు శాతం ఎక్కువగా వున్న ఈ భూములలో అసలు పంటలు పండకపోవడం, ఒకవేళ పండినా దిగుబడి చాలా తక్కువగా వుండడం జరుగుతున్నది. ఇలాంటి భూములను వ్యవసాయయోగ్యం చెయ్యడానికి సంబంధించిన పరిశోధన జరపడానికి 1960లో కర్నాల్‌లో కేంద్ర ప్రభుత్వ సంస్థ ఒకటి ఏర్పాటైంది. ఈ సంస్థ ఎన్నో ప్రయోగాలను నిర్వహించిన మీదట చవిటి నేలలను మెరుగుపరచడానికి కొన్ని మెళకువలను రూపొందించగలిగింది. క్షారం ఎక్కువగా వుండే భూములలో అవసరాన్నిబట్టి ఎకరానికి రెండు నుంచి ఆరు టన్నుల వరకు వేస్తే ఆ భూములు వ్యవసాయయోగ్యం అవుతాయని ఈ సంస్థలోని శాస్త్రజ్ఞులు కనుగొన్నారు. క్షారం ఎక్కువగా వుండే భూములలో నత్రజని, జింకు(తుత్తునాగం) చాలా తక్కువగా ఉంటాయని శాస్త్రజ్ఞుల అభిప్రాయం. కాబట్టి ఇట్టి భూములలో మామూలు భూములలోకంటే 15 నుంచి 20 శాతం వరకు ఎక్కువ నత్రజనిని వెయ్యడం అవసరం అని వారు భావిస్తున్నారు.

క్షారం ఎక్కువగావుండే భూములు వరి పండించడానికి చాలా అనువుగా వుంటాయి. ఈ భూములకు సరిపోయే వంగడాలను రూపొందిస్తున్నారు.

ప్రధానమంత్రి శ్రీమతి ఇందిరాగాంధీ ఇటీవల కర్నాల్‌లో ఒక రసాయనిక ఎరువుల కర్మాగారానికి ప్రారంభోత్సవం జరిపారు. భారతీయ వ్యవసాయదారుల రసాయన ఎరువుల సహకార సంఘం నెలకొల్పిన కర్మాగారం ఇది. 25వేల గ్రామీణ సహకారసంఘాలకు ఇందులో సభ్యత్వం వున్నది. పదికిపైగా రాష్ట్రాలలోని రెండు కోట్ల 50 లక్షల మంది రైతులకు ఈ సహకార సంఘం సేవలు లభిస్తున్నాయి.

కర్నాల్‌లోని ఈ కర్మాగారం రోజుకు 910 టన్నుల అమ్మోనియాను, 12 వందల టన్నుల యూరియాను తయారు చేస్తుంది. ఈ కర్మాగారంలోని మిల్లు అమ్మోనియాను ఇదే సహకార సంఘానికి చెందిన కాండ్లాలోని రసాయనిక ఎరువుల కర్మాగారానికి, దేశంలోని ఇతర రసాయనిక ఎరువుల తయారీ సంస్థలకు పంపిస్తారు. ప్రస్తుతానికి ఈ కర్మాగారం నుంచి కాండ్లాలోని రసాయన ఎరువుల కర్మాగారానికి రోజుకు సుమారు 200 టన్నుల అమ్మోనియాను పంపిస్తారు. అక్కడ దీనిని ఎన్.పి.కె ఎరువులలోనికి మారుస్తారు.

ఈ ప్రాజెక్టుకు మొత్తం రు. 94 కోట్లు ఖర్చవుతుందని అనుకొంటున్నారు. ఈ రసాయన ఎరువుల ప్రాజెక్టువల్ల సంవత్సరానికి రు. 100 కోట్ల మేరకు విదేశీమారకద్రవ్యం ఆదా అవుతుంది. దేశంలో సంవత్సరానికి రు. 400 కోట్లకు పైగా విలువచేసే ఆహార ధాన్యాలను అధికంగా ఉత్పత్తి చేయడానికి కూడా దోహదం చేస్తుంది ఈ రసాయనిక ఎరువుల ప్రాజెక్టు.

# ఫణిగిరి, గాజులబండ త్రవ్వకాలలో బయల్పడ్డ

# బౌద్ధమత సంస్కృతి

తెలుగు దేశంలో పురాతత్వ శాఖవారు కొన్ని ప్రదేశాలలో త్రవ్వించి జరిపిన పరిశోధనల వల్ల బౌద్ధావశేషాలు, జైనావశేషాలకు నెలవైన చరిత్ర ప్రసిద్ధి చెందిన ప్రదేశాలెన్నో బయల్పడి. మన దేశంలో గతకాలంలో బయల్పడ బౌద్ధ, జైనమత సంస్కృతులకు ఎంతగానో తోడ్పడి వాటిని కొంగ్రొత్త రీతుల్లోకి మళ్లించాయి. ఇలా త్రవ్వకాలు జరిపించిన ప్రదేశాల్లో అమరావతి, నాగార్జున కొండ, భట్టిప్రోలు, ఘంటసాల జగ్గయ్యపేట శాలిహుండము ముఖ్యంగా పేర్కొనదగినవి.

తెలుగు దేశంలో బౌద్ధమతం జనాదరణను చూరగొని క్రీ.పూ. మూడవ శతాబ్దం మొదలు ఏడవ శతాబ్దం వరకు వాస్తు, శిల్ప, చిత్రకళను తీర్చిదిద్ద గలిగింది. ఆనాడు బౌద్ధ సంఘాలు వేరు వేరు కులాలకు, తెగలకు ఉన్నత ధర్మాలను చూపి నైతికంగా ప్రజల్లో గొప్పమార్పును తెచ్చాయి భౌతికమైన అవధులను దాటి మతాన్ని వ్యాపింప జేయడానికి ఆకాలంలో బౌద్ధ భిక్షువులు అపారమైన కృషికావించారు ఆంధ్ర నాగరికతకు అభ్యున్నతికి ఎంతో శోభను సమకూర్చ గలిగారు.



ఫణిగిరి ఆకృతి

బౌద్ధుల వాస్తు నిర్మాణాన్ని గూర్చిన పరిశోధన భారతీయ పురాతత్వ శాస్త్రంలో ప్రధానమైన స్థానాన్ని ఆక్రమిస్తుంది. బౌద్ధులకు పవిత్రమైన కట్టడాలలో సంఘారామాలు, స్తూపాలు అతిముఖ్యమైనవి.

గత రెండువేల సంవత్సరాల నాడు మనదేశంలో వెలసిన బౌద్ధయుగంనాటి సంస్కృతి వెలుగులోకి రావడానికి తోడ్పడ త్రవ్వకాలలో ఫణిగిరి, గాజుల బండ త్రవ్వకాలు కూడా అతి ముఖ్యమైనవి. హైదరాబాదు పురాతత్వ శాఖవారు 1940లో ఫణిగిరిలోను, 1947లో గాజులబండ వద్దను త్రవ్వకాలు జరిపించారు ఈ రెండు బౌద్ధారామాలు నల్గొండ జిల్లా సూర్యాపేట తాలూకాలో కనుగొనబడాయి. జనగామ నుండి సూర్యాపేట వెళ్ళే బస్‌లో ఫణిగిరి చేరుకో వచ్చును జనగామ నుండి ఫణిగిరి గ్రామం 30 మైళ్ల దూరంలో ఉంటుంది. ఫణిగిరికి 2 మైళ్లదూరంలోనే ఈటూరు గ్రామమున్నది. ఈ గ్రామం వెలుపలనున్న కొండలలో గాజులబండ అనే కొండ పైన బౌద్ధారామం కనుగొనబడింది. అందువల్లనే దీనిని గాజుల బండ బౌద్ధారామం అంటారు.

## ఫణి ఆకారంలో కొండ

ఫణిగిరి కొండ బౌద్ధుల పవిత్రారామమై మొదటి శతాబ్దపు నాగరికతను ప్రతిబింబ జేసిన ఆంధ్ర శిల్పుల ప్రతిభా విశేషాలను చాటుతున్నది. ఈ కొండపైన మొదట మెరిసిన పాలరాతి అవశేషాలు శిల్పకళా ఖండాలు, బౌద్ధ స్తూపావశేషాలు కనిపిస్తాయి. ఇచటి కొండను ఫణిగిరి అనడానికి గల చారిత్రిక ఆధారాలేవీ లేవు. ఈ కొండ ఫణి ఆకారంలో నున్నందున ఇది ఫణిగిరిగా రూపొందిందని చెప్పవచ్చును. ఈ కొండమీదనే బౌద్ధ విహారం ఉన్నది.

శ్రీ ఎ. పండరినాథ్

1941లో పురాతత్వశాఖ వారు ఈ ప్రాంతాన్ని త్రవ్వగా 30 స్తూపాల శిథిలాలు కనిపించాయి. ఇవన్నీ గుండ్రని కట్టడాలు. కొండకు పశ్చిమ భాగాన కొండ వాలున వివిధ అంతస్తులుగా నిర్మించబడ్డ కట్టడాలున్నాయి ఆరామానికి మధ్యగా చతురపు వ్యూహంగా ఇటుక కట్టడాల పునాదులున్నాయి వీటిపైన గదులున్నట్లు. అవి బౌద్ధ భిక్షువుల నివాసానికుద్దేశింపబడినట్లు ప్రతీతి.

బౌద్ధుల ఆరాధనా మందిరాలను చైత్యాలంటారు. ఇచటి చైత్య నిర్మాణం ప్రధానం దాక్షిణాత్య శిల్పంలోగాని, తదితర ప్రదేశాల్లోని శిల్పంలోగాని కనబడని ప్రత్యేకతను కలిగిఉన్నది

బౌద్ధయుగం నాటి ఆంధ్రులు వివిధ మృత్తికలను కలిపి ఇటుకను చేసి స్తూపాలను నిర్మించేవారు.

## నిర్మాణ వైఖరి

ఇచట 1.8 మరియు 1.2 హెక్టార్లు పై శాల్యంగల ప్రదేశమంతా ఇటికలతో, సున్నపురాళ్లతో, పాలరాతి శిల్పకళా ఖండాలతో పెద్దదిబ్బలాగా కనిపిస్తుంది. ఈ బౌద్ధ స్తూపం చుట్టూ దీర్ఘ చతురస్రాకారంలో గల గదులన్నీ సమానంగా ఉన్నాయి. ఆంధ్రదేశంలో విలసిల్లిన ప్రతిబౌద్ధ స్తూపం ఈ విధంగానే నిర్మించ బడింది ఈ ఈ గదులు బండి చక్రపు ఆకులను పోలి ఉంటాయి దీనికి వాడబడిన ఇటుకలు చాలా పెద్దగా ఉన్నాయి. వీటి ప్రమాణం 35.5 సెం. మీ.-17.9 సెం. మీ ఈ ప్రాంతంలో త్రిభుజాకారంగా నున్న ఇటుకలు కూడా కనిపిస్తాయి. ఈ త్రిభుజాకార ఇటుకలతో కూడా స్తూప నిర్మాణం జరిగింది.

ఈ కొండపైన కొన్ని స్తంభాలు, రెంకు లింగాలు కనిపిస్తాయి. ఈ స్తంభాలు దేవాలయ నిర్మాణానికై మధ్యకాలంలో ఉపయోగించబడి ఉండవచ్చును. స్తూపానికి పడమటి వైపున యేటవాలులో రెండు మంచినీటి సరస్సులున్నాయి. ఇవి వర్షాకాలంలో నీరు నిలువ చేసుకోడానికి ఏర్పాటు చేసుకున్నవిగా భావించబడుతున్నాయి.



గాజుల బండపై స్థూపం

ఎర్రమట్టి, వల్లమట్టితో చేయబడిన కుంకలపై గజిబిజిగా గీయబడిన గీతలు, ఆకులు, బొమ్మలు. ఒకరకమైన చేప ఎముకల నమూనాలు గీయబడ్డాయి. ఇవి చైత్యాల పైభాగాలను అలంకరింప జేయడానికి వాడబడెనని చరిత్ర కారులు అభిప్రాయ పడారు. ఈ విధమైనవే నాగార్జున కొండ, కొండాపురం, ఏలేశ్వరంలలో కనిపిస్తాయి ఇచట ఇంకా మొదటి శతాబ్దానికి చెందిన శాతవాహన వంశీయుల నాణాలు లభించాయి.

ఇచట లభించిన ఒక విగ్రహం యొక్క పైభాగం ముఖవిలాసం చిత్తవృత్తుల్ని, శరీర పుష్టిని ప్రకటిప జేస్తుంది. చెవులకు బరువైన ఆభరణాలుండి వ్రేలాడు తున్నట్లున్నాయి. శిరోభాగంలో విజయ లాంఛనంగా ఒక ఆకు కొమ్మ చుట్టబడిఉన్నది. ఈ పద్ధతి ప్రాచీన గ్రీకు సాంప్రదాయానికి సంబంధించినది. ప్రాచీన గ్రీకుదేశీయుల తోను వారి సాంప్రదాయంతోను ఆనాడిచటి ప్రాంతీయులకు సంబంధం ఉండి ఉంటుంది.

## కళా చతురిమ

ఇచ్చట కుడ్య భాగానికి చెందిన ఒక ఫలకం దిమ్మ దొరికింది. ఆచిన్నముక్క మీద మూడు ప్రక్కల్లో నిశ్చల చిత్రాలు చెక్కబడి ఉన్నాయి. ముఖ భాగంలో సంపూర్ణంగా రేకులు విచ్చిన సుందర పద్మం, పద్మానికి దిగువ భాగాన ఒక వృషభం, మానవుడు ఏనుగు చెక్కబడి ఉన్నాయి. వృషభం మూపురం ఎత్తుగా, సొంపుగా ఉన్నది. వృషభాన్ని గజం తరుము తున్నట్లున్నది. ఇంకా ఇచట వామన రూపుడైన ఒక బొజ్జయ్య శిల్పం కూడా లభించింది. దీనినొక వ్యంగ్య చిత్రంగా తేల్చినారు.

ఇచట లభించిన శిల్పావశేషాలన్నీ అజంతా, సాంచీ, బరహత్‌లలో కనిపిస్తాయి. ఇవన్నీ విదేశీయాను కరణాలే. ప్రధానంగా పశ్చిమాసియా అనుకరణాలు ఈ కొండకు క్రింది వైపున కూడా ఇటుకల నిర్మాణం శిథిలావశేషాలు కనిపిస్తాయి ప్రభుత్వం త్రవ్వకాలు జరిపిస్తే మరికొన్ని చారిత్రిక ఆధారాలు లభించవచ్చును.

ఈ పర్వతం మలుపు తిరిగిన చోట ఒక పెద్ద లోయగా ఏర్పడింది. ఈ లోయ ప్రాంతంలో ఒక ప్రాచీన దేవాలయం కనిపిస్తుంది. ఈ ఆలయంలో ఆంధ్రుల శిల్పవిధానం గోచరిస్తుంది. ఆనాడు ఆంధ్ర శిల్పులు గర్భాలయాన్ని ముఖమంటపాన్ని మధ్య కళ్యాణమంటపాన్ని శిలలతో నిర్మించి శిఖరాన్ని మాత్రం ఇటుకలతో నిర్మించారు. ఇలాంటి విధానం చాళుక్యుల శిల్ప సంప్రదాయానికి సంబంధించినది ఇది సీతారామాలయం. ప్రస్తుతమిది శిథిలావస్థలో నున్నది. ఈ ఆలయంలో స్తంభాలమీద, అక్కడక్కడ చెక్కబడిన శిల్పం తీరు అత్యంత మనోహరంగా ఉన్నది.

## గాజుల బండ

హైదరాబాదు పురాతత్వ శాఖవారు 1917 లో గాజుల బండ బౌద్ధారామాన్ని కనుగొన్నారు. పురాతత్వ శాఖవారు త్రవ్వకం సాగించగా బౌద్ధయుగం నాటి చిహ్నాలు కనుగొన బడ్డాయి. ఈ అవశేషాలు, ప్రాచీన కాలంనాటి కట్టడాలన్నీ శిధిలావశేషాలుగా ఒక దిబ్బ రూపంగా ఒక గుట్ట మీద ఏర్పడాయి. ఈ దిబ్బ భూతల సుమారు 50 అడుగుల ఎత్తున ఉంటుంది, ప్రభుత్వం వారిచట త్రవ్వకం జరిపించే వరకు ఇచటి ప్రాంతం వారు దీనినొక మట్టి దిబ్బ మాత్రమే అనుకునే వారు.

ఇచట జరిపిన త్రవ్వకాన్ని బట్టి ఈ ప్రాంతం అనాడు బౌద్ధమత ప్రాంతంగా విరాజిల్లిందనక తప్పదు. ఇచట బయల్పడ్డ బౌద్ధారామం గత రెండు వేల సంవత్సరాలకు చెందినట్టిదిగా భావించబడుతున్నది. ఇచటి ఈ కాలనిర్ణయానికి రెండు ముఖ్య ఆధారాలు లభించాయి.

ఇచట లభించిన సీసపు నాణెంపై ఒకవైపున గజవిగ్రహం మరొక వైపున స్వస్తిక్ గుర్తులున్నాయి. ఇది అత్యంత ప్రాచీన

కాలంలో ఆంధ్రరాజులకు చెందిన నాణెంగా భావించబడుతున్నది. ఆంధ్రరాజుల ప్రారంభకాలంలో ఈ రకమైన నాణాలు చెలామణీలో నున్నట్లు చరిత్రకు ఆధారాలున్నాయి.

మరొక ఆధారం వంకర టింకరగానున్న భాండ శకలం. భాండశకలం మీద బౌద్ధ యుగానికి సంబంధించిన మూడక్షరాలు ఆ నాటి బ్రాహ్మీలిపిలో కనిపించాయి. ఈ లిపినిబట్టి ఇచట విలసిల్లిన సంస్కృతి ఒకటి లేదా రెండవ శతాబ్దానికి సంబంధించినట్లు పరిశీలకులు భావిస్తున్నారు. అనాడు అంటే రెండువేల సంవత్సరాల నాడు బౌద్ధులు తమ పేర్లను భాండాలపై వ్రాయించుకునే ఆచారం కూడా ఉన్నదని చరిత్రకారులు అభిప్రాయపడుతున్నారు.

ఈ గుట్టమీద దక్షిణ ప్రాంతంలో బండి చక్రాకారంలో కట్టబడి ఒక స్తూపం బయటపడింది. ఈ స్తూపం 30 అడుగుల వ్యాసం కలిగి ఉన్నది. పశ్చిమ దిశలో చైత్య విహారం యొక్క శిథిలాలు కనుక్కోబడ్డాయి.

తూర్పు ముఖంగా మరొక చైత్య విహారం ఉన్నది. ఇది సుమారు 34 అడుగుల పొడవు, 12 అడుగుల వెడల్పు కలదిగా నున్నది. వాయవ్య దిశలో మరొక చైత్యం యొక్క శిథిలాలు కనిపిస్తున్నాయి. ఇచట ఇంకా మరికొన్ని కట్టడాల చిహ్నాలు కనిపిస్తున్నాయి.

ఇతర ప్రాంతాల్లో బౌద్ధ క్షేత్రాలకు వలెనే ఇచటి కట్టడాలకు పెద్ద ఇటుకలు వాడినారు. ఈ ఇటుకలు సుమారు 3 అడుగుల పొడవు, 2 అడుగుల వెడల్పు, 3 అంగుళాల మందాన్ని కలిగి ఉన్నాయి.

ఆంధ్ర దేశంలోని ఇతర బౌద్ధ క్షేత్రాలలో బయల్పడ్డ భాండ సామాగ్రికీ, ఇచట బయల్పడ్డ భాండ సామాగ్రికీ ఏ మాత్రం భేదం కనిపించదు. ఆ నాడు వారు బాగా పదును చేసిన మెత్తని మట్టితో భాండాలను తయారుచేసి ఆవములో వాటిని కాల్చినప్పుడు వాటికి పల్చని నల్లరంగుకాని లేదా సాదా గులాబీరంగుగాని వచ్చేది. కుండలమీద చిత్రించడానికి సర్వసాధారణంగా వారు వాటికి ముదురు రక్త వర్ణాన్ని తీసుకవచ్చి వాటిపై మీగడ రంగుతో చిత్రించెడివారు. ఇచట లభించిన భాండాలపై చిత్రించిన విధానం పైవిధానాన్నిపోలి ఉన్నది. కొన్నిచోట్ల పలుచగాను మరికొన్నిచోట్ల వొత్తుగాను చిత్రీకరించబడింది. భాండాలకు లోపలివైపున నలుపురంగు పూసినట్లు కనబడుతున్నది.

## ప్రతిభావంతమైన కళాఖండాలు

కుండలమీద రంగులతో చిత్రింపబడ్డ పూలు, లతలు, తాంత్రిక చిహ్నాలు వివిధాలుగా ఉన్నాయి. ఇంకా ఇచట అత్యంత ప్రతిభావంతములైన కళాఖండాలు భూగర్భంలో దొరికాయి. వీటిలో గచ్చుతో నిర్మింపబడ్డ మానవ శిరస్సు ముఖ్యంగా పేర్కొనదగినది. ఇది ఆ నాటి కళాకారుల సాటిలేని కళానైపుణ్యాన్నీ, ప్రతిభనూ చాటుతున్నది. ఈ శిరస్సు దక్షిణాపథంలోని ఆదిమవాసుల ముఖవైఖరుల్ని పోలి ఉన్నది. ఒత్తు పెదవులు, వెడల్పైన నాసిక ప్రస్ఫుటంగా కనబడుతున్నాయి.

గాజుల బండ బౌద్ధ క్షేత్రం పరిశోధన ఇంకా కొనసాగవలసి ఉన్నది. ఇచట ఇంకా పరిశోధన జరిపితే బౌద్ధాంధ్ర యుగాలనాటి పరిణామదశా వైవిధ్యాన్ని నిర్ణయించడానికి తగిన విలువైన సామాగ్రి లభిస్తుంది. ప్రాచీన ఆంధ్రదేశ చరిత్రను, ఆంధ్రదేశంలో బౌద్ధమత సంస్కృతి ఇతిహాసాన్ని కొంగ్రొత్తదారికి మళ్లిస్తుంది.

ఫణిగిరి, గాజులబండ గ్రామాలకు సమీపంలోనే ఉన్న వర్ధమానుకోట, సింగారం, నాగారం మొదలైన ప్రదేశాల్లోని గుట్టల మీద బౌద్ధ స్తూపాల అవశేషాలు బాగా కనిపిస్తాయి. ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పురాతత్వశాఖ వారు ఈ ప్రాంతాల్లో కూడా త్రవ్వకాలను జరిపించి పరిశోధన చేయించ వలసిన అవసరం ఎంతైనా కలదు.

# కళాపిపాసి అడివి బాపిరాజు

ప్రఖ్యాత చిత్రకారుడు రచయిత అయిన కీ.శే. అడివి బాపిరాజు పేరు వినని వారు ఆంధ్రదేశములో అరుదు. ఆయన పశ్చిమ గోదావరి జిల్లలో 8-10-1895 నాడు జన్మించారు. ఆయన హైస్కూల్ చదువు నర్సాపురంలో జరిగింది. తర్వాత 1913 లో ఆయన కాలేజి విద్యాభ్యాసం కోసం రాజమండ్రి వెళ్ళారు. అక్కడ ఆయనకి రాజమండ్రి ఆర్ట్సుకాలేజి ప్రిన్సిపాల్‌గానున్న ఆస్వాల్డ్ కూల్డ్రె దొరతో సన్నిహిత పరిచిత భాగ్యంకలిగింది. తన విద్యార్థిగా నున్న బాపిరాజులో అంతర్గతంగా నున్న కళాతృష్ణను అచిరకాలం లోనే పసిగట్టగల్గాడు కూల్డ్రెదొర. నిజానికి బాపిరాజు కూల్డ్రెల సంబంధం శిష్యగురు సంబంధమైనా వారిద్దరి మధ్య పుత్ర పితృల మధ్యనుండే ఆత్మీయత పెంపొందింది. యదార్థ సంఘటనలను, కథలను ఎంతో ఆసక్తివంతంగా చెప్పడంలో బాపిరాజు ప్రవీణుడు. కూల్డ్రె దొరకి, భారతీయుల ఆచార వ్యవహారాలలోనూ, జీవిత విధానాలలోనూ గల విశేషాలను తెలుసుకోవాలనే అభినివేశంఉండేది. అందుచేత సహజంగానే విషయములను, ఆకర్షణీయంగా చెప్పగల బాపిరాజు అంతే ఆయనకి అభిమానం ఏర్పడింది. అచిరకాలములోనే వారి సన్నిహితత్వం ఎంతగా బలపడిందంటే, అది కూల్డ్రె దొర స్వయంగా వ్యక్తంచేసినట్టు "ఒకే రకపు అభిరుచులుకల మే మిద్దరమూ, భవభూతికవి పేర్కొన్నట్టి 'సమాన ధర్మం' కల వారము" అన్న వాక్యములో వ్యక్తమయింది.

## మెరికలాంటి శిష్యుడు

ఆయనకి భారతీయులంటే చిన్నచూపు లేదు. ఆయనకి మెరికలవంటి శిష్యులు ముగ్గురు. వారే బాపిరాజు, దామెర్ల రామారావు. ఆయన వారికి భారతీయుల కళలోని ముఖ్యంగా అజంతా, ఎల్లోరాలలోని కళాఖండాల యుక్క గొప్పతనాన్ని అర్థంచేసుకొని ఆనందించగల అభినివేశాన్ని కలుగచేశాడు. నిజానికి కూల్డ్రె తనకంటే గొప్పచిత్రకారుడు. రాజమండ్రిలోని దామెర్ల రామారావు స్మారక కళా కేంద్రంలోని, కూల్డ్రెదొరవీ, దామెర్ల వారివీ అనేక కళాఖండాలు భద్రపరచబడి వున్నాయి. వాటిని చూస్తే కూల్డ్రెదొర భారతీయులు వారి పద్ధతులనూ ఎంత నిశితంగా పరిశీలించాడో అవగతమవుతుంది.

1916 లో కూల్డ్రెదొర, తన ప్రియ శిష్యులు ముగ్గురి లోనూ అజంతా, ఎల్లోరాలకి కళాయాత్ర జరిపారు. అజంతా కుడ్య చిత్రాలలోని రమ్యత్వం, వికసిస్తున్న బాపిరాజు మేధస్సుపై ఎంతటి గాఢమైన ముద్రని వేసిందంటే, ఆయన తన రేఖా చిత్రాలన్నింటిలోనూ, ఇంచుమించు ఆ పోకడలను అనుసరించాడు. అంతేకాక ఈ యాత్ర, ఆయన గొప్పగొప్ప చరిత్రాత్మక రచనలు చేయడానికి దోహద పడింది.

కూల్డ్రెదొరకి, బాపిరాజు కళకొరకే పుట్టాడనీ, అతడు మహోన్నత చిత్రకారుడు కాగలడనీ విశ్వాసం బలపడింది. ఫలితంగా ఆయన బాపిరాజుని ప్రోత్సహించి, చిత్రకళలో ప్రత్యేక శిక్షణకోసం, బొంబాయి నగరం పంపించాడు. అయితే ఆయన బొంబాయి నగరంలో నేర్వగల్గింది కేవలం పాశ్చాత్యకళ మాత్రమే అయితే పాశ్చాత్యులు అవలంబించే సహేతుక, సక్రమ పద్ధతులు

శ్రీ కె. ఆర్. కె. మోహన్

ఆయన తెలుసుకొనగలగడంలో, వాటిని, భారతీయ చిత్రకళా పరిశోధనలో వినియోగించాలనే దృఢమైన సంకల్పం ఆయనకి కలిగింది. ఆ రోజుల్లో భారతదేశం జాతీయోద్యమ ప్రభావంలో చైతన్యవంతంగా ఉంది. అందువల్ల సహజంగా బాపిరాజు కూడా జాతీయ చిత్రకళ వైపే మొగ్గు చూపాడు.

## జీవితం-జాతికి అంకితం

అంతలో మహాత్మగాంధీ, భారతీయులకు, విదేశ వస్తు బహిష్కరణ కొరకు పిలుపు నిచ్చాడు. ఆ సందేశం ఆసేతు హిమాచలం వరకూ ప్రతిధ్వనించింది. అది రాజకీయ రంగమైనా, కళారంగమైనా, మరే రంగమైనా, దాని ప్రభావం అంతటా పడింది. సంస్కార బలంగల బాపిరాజు సహజంగానే ఈ ప్రభావానికి లోనయ్యాడు. బిపిన్ చంద్రపాల్ వంటి మహావక్తల ఉపన్యాసాలు విని, మంత్రముగ్ధుడివలె, బాపిరాజు, తన జీవితాన్ని జాతికి

అంకితం చేయాలని నిర్ణయం తీసుకుని, జాతీయోద్యమానికి దూకాడు. 1921 సత్యాగ్రహంలో ప్రముఖ పాత్ర వహించి జైలుకి వెళ్ళాడు. తర్వాత బాపిరాజు తన బి. యల్. డిగ్రీని మద్రాసులో గ్రహించి, స్వల్పకాలం లాయర్ ప్రాక్టీసును కూడా నడిపాడు. అయితే ఆ వృత్తి ఆయన జాతీయ భావాలకి అనువుగా లేదు.

1906 కలకత్తాలో జరిగిన కాంగ్రెసు మహాసభలో దేశంలో జాతీయ విద్యాలయాలు స్థాపించాలనే తీర్మానం ఆమోదింపబడింది. దానిననుసరించి 1910 లో, ఆంధ్రదేశపు సాంస్కృతిక కేంద్రమైన మచిలీపట్నంలో, ఆంధ్రజాతీయ కళాశాల స్థాపింపబడింది. అచిర కాలంలోనే ఆ కళాశాల విశేషమైన ప్రగతిని సాధించింది. 1922 నాటికి అది సర్వాంగ సౌష్ఠవం చెందింది. ప్రముఖ వంగచిత్ర కారుడైన శ్రీ ప్రమోదకుమార్ ఛటర్జీ, ఈ కళాశాలకి ప్రిన్సిపాల్‌గా నియమితులయ్యారు. లాయరు వృత్తిలో రాజీపడలేని బాపిరాజుకి, ఈ కళాశాల క్రొత్త ఆశలను కల్పించింది. వెంటనే ఆయన తన వృత్తికి తిలోదకాలు ఇచ్చి, ఈ కళాశాలలో చిత్రకళా విద్యార్థిగా జేరాడు. అచిరకాలంలోనే శ్రీ ప్రమోదకుమార్ ఛటర్జీ, బాపిరాజు లోని ప్రతిభని గుర్తించాడు. స్వల్పకాలంలోనే బాపిరాజు అత్యుత్తమ విద్యార్థిగా పేరొందాడు. ప్రమోదకుమార్ శిక్షణలో, సహజంగానే, బాపిరాజు వంగ చిత్రకళా ప్రభావానికి లోనయ్యాడు.

ఆంధ్ర జాతీయ కళాశాలలో బాపిరాజుకి అనేక మందికి ప్రఖ్యాత చిత్రకారులు, సహాధ్యాయులుగా ఉండేవారు. అట్టి వారిలో కొందరు–గుర్రం మల్లయ్య, వై. రమా. సూరి, సి. వి. చలపతిరావు, ఎ. బసవయ్య, ధాసరి వీరయ్య, టి. వి. యస్. శర్మ, యన్. వి. యస్. రామారావు, కె. నాగేశ్వరరావు, యం. జి. కె. గోఖలే, తోట వెంకటేశ్వరరావు, వాలి సుబ్బారావు, వెంపటి సత్యం మొదలైనవారు. ఇందులో చివరి ఏడుగు మద్రాసులో చిత్రసీమలో పనిచేసి రాణించారు.

## కారణ జన్ముడు

ప్రమోదకుమార్ శిక్షణలో, బాపిరాజు పరిపూర్ణత చెందిన చిత్రకారుడుగా మలచబడ్డాడు. ఆయన దృష్టిలో కళారాధన తపస్సు వంటిది. నిజానికి ఆయన కారణజన్ముడు. ఈ విషయాన్ని ధృవపరిచే, అనేకమైన ఆసక్తిపూర్వకమైన సంఘటనలు, బాపిరాజు జీవితంలో ఉన్నాయి. ఒకసారి ఆయనకి మృత్యుదేవత దర్శనం అయిందట. వెంటనే ఆయన ఆ మూర్తిని చిత్రీకరించాడు! ఆ చిత్రాన్ని ఆయన ప్రమోదకుమార్‌కి చూపించగా, ఆయన అటువంటి తెలివితక్కువ పని చేసినందుకు బాపిరాజుని మందలించాడుట. "పరిపూర్ణత చెందిన చిత్రకారుడు గీచిన చిత్రాలలో అగోచరశక్తి దాగివుంటుం"దని చెప్తూ ఆయన ఆ చిత్రంపై సిరాను ఒలక పోశారట. కొద్ది రోజుల్లోనే బాపిరాజుకి తీవ్రమైన వ్యాధి సోకి, జీవించే ఆశలు వదలుకున్నారట. ఆయన నిరంతరంగా మృత్యుంజయ జపం చేయగా, ఆ వ్యాధి తగ్గిందట! జపంచేసే సమయంలో ఒకసారి ఆయనకి మృత్యుంజయ దర్శనం అయిందట. ఆ మూర్తిని ఆయన చిత్రీకరించారు. అది ఎంతో ప్రసిద్ధి చెందింది.

## "సూర్యదేవ" చిత్రీకరణ

ఇల్లాగే మరొక విచిత్ర సంఘటన ఉంది. బాపిరాజు కొన్ని నెలలపాటు, 'ఆదిత్య హృదయం' జపించారుట. ఒకనాడు ఆయన ఆంధ్ర జాతీయ కళాశాల ముఖద్వారం దగ్గరికి రాగానే, ఆయనకి సూర్యదేవ దర్శనమయి, ఆ ఆనందసమాధిలో అచేతనంగా పడి పోయారుట. స్పృహ వచ్చిన తర్వాత ఆయన తన ప్రఖ్యాత చిత్రం 'సూర్యదేవ'ను చిత్రించారుట. ఇల్లాగే ఎన్నో సంఘటనలు ఆయనని గురించి చెప్పబడుతుంటాయి.

బాపిరాజు హైందవ పురాణాలను సమగ్రంగా పరిశోధనా దృష్టితో అధ్యయనం చేసి, పురాణ పురుషుల లక్షణాలను, రూపాలను బాగా అవగతం చేసుకున్నాడు. అందుకే ఆయన చిత్రించిన పురాణ పురుషుల రూపాలు అంత సహజంగా ఉంటాయి.

బాపిరాజు రచించిన చిత్రాలు ఎంతటి మహోత్కృష్టమైన వంటే, అవి ప్రపంచంలోని ఎన్నో ప్రముఖ ప్రదర్శనశాలల నలంకరించాయి. ఆయన చిత్రం 'శబ్దబ్రహ్మ'ని డెన్మార్కు ఆర్ట్ మ్యూజియం వారు కొన్నారు. 'భాగవత పురుషుడు' అనే చిత్రం తిరువాన్కూరు మహారాజావారి భవనాన్ని అలంకరించింది. ఇంతకు ముందే పేర్కొన్న 'సూర్యదేవ' చిత్రం కచ్ రాజావారి ఆస్థానంలో ఉంది. 'సముద్రగుప్తుడు' చిత్రం, ప్రఖ్యాత న్యాయవాది సర్ అల్లాడి కృష్ణస్వామిగారి సొత్తు అయింది. 'తిక్కన' 'మృత్యుంజయ' వంటి చిత్రాలు ఆయన సన్నిహిత మిత్రుల గృహాల నలంకరించాయి. విచారకరమైన విచిత్రమేమంటే, ఆయన ఎన్ని చిత్రాలు నలుమూలలా అలంకరించబడినా, ఆయన స్వంతకుటుంబంలో నిలిచి పోయినవి మాత్రం బహుతక్కువ ఆయన దృష్టిలో ప్రపంచ మంతా ఒకటే కుటుంబం. అందులో స్వపరభేదాలు లేవు. స్వీయ కుటుంబానికి ప్రత్యేక సాధనమేమీ లేదు. 'వసుధైక కుటుంబం' అనే ఆర్య సూక్తిని ఆయన త్రికరణశుద్ధిగా అవలంబించాడు.

## సినీరంగంలో ప్రవేశం

ఆంధ్ర జాతీయ కళాశాలలో విద్యార్థిగా ప్రవేశించిన బాపిరాజు 1935లో అదే కళాశాలకి ప్రిన్సిపాల్ అయ్యాడు ఆ పదవిలో ఆయన 1939 వరకూ ఉన్నాడు. అంతలో కళాశాలకి దుర్దినాలు సంభవించసాగాయి. ఫలితంగా బాపిరాజు తన పదవికి రాజీనామా ఇచ్చాడు. ప్రముఖ చిత్రకారుడైన ఆయనను సినిమారంగం మద్రాసుకి ఆహ్వానించింది. ఆయన కొన్ని చిత్రాలకు చిత్ర దర్శకుడుగా పనిచేశాడు.

అనేకమంది ప్రసిద్ధ పురుషుల జీవితాలలో మాదిరిగానే బాపిరాజు జీవితంలో కూడా, అదృష్టానికి చోటు తక్కువ. రెండవ ప్రపంచయుద్ధ ప్రభావంలో అనేక రంగాలతో పాటు చిత్ర రంగంలో పరిస్థితులుకూడా తారుమారయ్యాయి. ఫలితంగా ఆయన సినిమారంగానికి వీడ్కోలు చెప్పవలసివచ్చింది.

బాపిరాజుకి చిత్రకళ అంటే ఎంతటి అభిమానమంటే, ఆ కళయందు ఆసక్తి వున్న ప్రతివ్యక్తికీ తగిన శిక్షణ ఇయ్యాలని

భావించాడు. ఆ సంకల్పంతోనే ఆయన మద్రాసునుంచి రాగానే, గుంటూరులో ఒక కళాపీఠాన్ని నెలకొల్పి దానికి ప్రిన్సిపాల్‌గా వ్యవహరించారు. అప్పటినుంచే ఆయనకి 'కులపతి' అనే గౌరవ పదం లభించింది. అనేక ఉత్తమ సంస్థల లాగానే, ఈ కళాపీఠం కూడా, పరిస్థితుల ప్రభావంవలన మూతపడింది. తర్వాత ఆయన హైదరాబాదు నగరం చేరుకుని అక్కడ 'మిజాన్' అనే తెలుగు దిన పత్రికకు సంపాదకుడుగా పనిచేయసాగారు. అయితే ఇందులో కూడా ఆయన ఎక్కువకాలం ఉండలేకపోయారు.

ఆనాటి మద్రాసు ప్రభుత్వం, సింహళంలోని సైగీరియా కుడ్య చిత్రాలకు నకలును చిత్రింపించ నిశ్చయించింది. ఈ పనికి గాను బాపిరాజు, రాంభట్ల కృష్ణమూర్తి, పిలకా నర్సింహమూర్తి, కోడూరు రామమూర్తి, యం. శ్రీనివాసులు, దాసరి వీరయ్యల వంటి ప్రముఖ చిత్రకారులను ఎన్నిక చేసి సింహళం పంపింది.

బాపిరాజు ఉత్తమ చిత్రకారుడేకాక మంచి వక్త కూడా! సాధారణంగా, చాలా మంది ఉత్తమ చిత్రకారులు కూడా, కళ అంటే ఏమిటో, తాము అనుసరించే కళలోని భావన ఏమిటో సరిగా వ్యక్తీకరించలేరు. కాని బాపిరాజు కళని గూర్చి కరతలామలకంగా వివరించగలిగేవాడు. ఫలితంగా ఎంతోమంది కళఅంటే అభినివేశం పెంచుకునేవారు. ప్రముఖ చిత్రకారులెందరో, కళపై ఆయన చేసే ఉపన్యాసాలు విని లబ్ధి పొందినట్లుగా తృప్తి చెందేవారు.

కొన్ని కొన్ని కార్యాలు నిర్వహించడానికి కొందరు కొందరు మహాపురుషులు జన్మిస్తుంటారు. అట్టివారు కారణ జన్ములు. ఆ కోవకి చెందినవాడు బాపిరాజు. నిజం చెప్పాలంటే లలితకళలే బాపిరాజుగా మూర్తిచెందాయనవచ్చు. ఎందుకంటే ఆయన కేవలం చిత్రకారుడేకాదు—కవి, గాయకుడు, నృత్యకారుడు, వక్త, నవలా రచయిత, కథకుడూ—అన్నీను. అంతటి బహుముఖ ప్రజ్ఞా విశేషాలుగల వ్యక్తులు అరుదుగా సంభవిస్తుంటారు. ఈ విషయంలో ఆయనను రవీంద్రనాథటాగోర్‌తో పోల్చవచ్చు.

బాపిరాజు 'హిమబిందు', 'గోన గన్నారెడ్డి', వంటి చక్కని చరిత్రాత్మక నవలలను వ్రాశాడు. ఎన్నో గేయాలు వ్రాశాడు. అందులో చాలా వాటిల్లో తన ఊహాసుందరి 'శశికళ'ను చిత్రించాడు. ఎన్నో గేయాలు జానపద శైలిలో వ్రాశాడు. నవలా రచనలో విశ్వనాథవారిని తప్పిస్తే, బాపిరాజు వ్రాసినట్లుగా పెద్ద నవలలు వ్రాసినవారు లేరనే చెప్పవచ్చు. నిజానికి ఆయన వ్రాసిన నవలలు వచన కావ్యాలు. బాపిరాజుయొక్క హిమవన్నగపుటౌన్నత్యాన్ని, విశ్వనాథవారు చక్కగా రెండు వాక్యాలలో పేర్కొన్నారు —"అతడు గీసిన గీత బొమ్మై, అతడు పలికిన పలుకు పాటై" అని కవిసామ్రాట్ చెప్పినదానికంటే ఇంకెవరు చక్కగా చెప్పగలరు! విశ్వనాథవారు బాపిరాజును ఆప్యాయంగా 'బాపిబావా' అని పిలిచేవారు, తన 'కిన్నెరసాని పాటలు'ను ఆయనకే అంకితమిచ్చారు.

బాపిరాజు ఎన్నో చక్కని 'నారాయణరావు', 'కోనంగి', 'తుఫాను', 'నరుడు' వంటి సాంఘిక నవలలను వ్రాశారు. అందులో నారాయణరావు ఆంధ్రా యూనివర్సిటీవారి బహుమతి పొంది కళాశాల విద్యార్థులకు పాఠ్యగ్రంథంగా పెట్టబడింది. బాపిరాజు రచనలలోని విశేషమేమంటే, వాటిల్లో చరిత్రాత్మక స్థలాల వివరణ, ఆయన స్వీయానుభవాలు మొదలైనవాటిని నవలా సౌందర్యం చెడకుండా, సన్నివేశాలలో జొప్పించడం, అందువల్ల ఆయన రచనలలో ఎంతో విజ్ఞానం ఇమిడి ఉంటుంది,

## కళకి అంకితం

అయితే చాలా మంది ప్రముఖ కవుల వలెనే, బాపిరాజు చివరి దినాలు కూడా, చాలా దైన్యమైనట్టివి. ఆయన ఏమీ ఆస్తి లేని మధ్యతరగతి కుటుంబానికి చెందినవాడు. ఆయన కళాదీక్ష, దాతృత్వము ఆయనకి ధనాన్ని ఆర్జించి పెట్టలేదు. దీనికితోడు రోగిష్టి భార్య, వికలాంగమైన పిల్ల, వీటితో నిత్యమూ అన్నిటికీ వెతుక్కోవలసివచ్చేది. ఇన్ని విచారాలలోనున్నా, అంతటి ఉత్తమ చిత్రకారుడుగా మనగలిగాడంటే, బహుశా ఆయన తన విచారాలని మరచిపోడానికే. తన జీవితాన్ని కళకి అంకితం చేశాడా అని అనిపిస్తుంది, దయనీయమైన పరిస్థితులలో ఈ మహా చిత్రకారుడు 1952లో, మద్రాసులో పరమపదించాడు, ఆయన ఆత్మకి శాంతి కలిగి కళాభిమానులను ఆశీర్వదించు గాక!

---

తెలుగునాడు కళలకు కాణాచి. లలిత కళల నభ్యసించి ప్రావీణ్యం గడించటం తెలుగు కళామతల్లి కంఠహారానికి మరో ఆణిముత్యం పొదిగించటమే!

---

## రామభక్తి సామ్రాజ్యంలో రాగసుధా ధారల వర్షించిన వాగ్గేయకారుడు

# త్యాగరాజు



'జో అచ్యుతానంద జోజో ముకుంద
లాలి పరమానంద రామ గోవింద

అని అమ్మ కమ్మగా పాడుతూ ఉంటే బిడ్డ ఏడుపు మాని ఇట్టే నిద్ర పోతుంది. గొల్ల పిల్లడు పిల్లనగ్రోవి ఊదుతూ ఉంటే మోర లెత్తి పశువులు పరవశత్వం పొందుతాయి. పాములవాడు నాగస్వరం వాయిస్తూ ఉంటే చుట్ట చుట్టుకొనిఉన్న పాము చటుక్కున నిలువునా లేచి పడగ విప్పి ఆడుతుంది. శిశువు, పశువు, పాము కూడా గానరసాన్ని ఆస్వాదించగలుగుతాయి. పశు పక్ష్యాదులను పరవశత్వం పొందించగల శక్తి నాదానికి ఉంది. నాదానుభూతి పొందిన వానికి ఈశ్వరానుభూతి కలుగుతుంది.

నాహం వసామి వైకుంఠే న యోగి హృదయే రవౌ
మద్భక్తా యత్ర గాయంతి తత్ర తిష్ఠామి నారద.

"నానివాసం వైకుంఠంలో కాదు. యోగి హృదయంలోనూ కాదు. సూర్య మండలంలోనూ కాదు. నా భక్తులు ఎక్కడ గానం చేస్తూ ఉంటారో అక్కడే నేను ఉంటాను" అంటాడు నారాయణుడు.

మంత్రాలకు మూలాధారమూ, పరమాత్మ స్వరూపమూ అయిన ఓంకారంనుంచి వెలువడిన సప్త స్వరాలతో ఏర్పడిన బహు విధ రాగాలతో భగవంతుని అనంత కల్యాణ గుణాలను పాడుకొంటూ మోక్షం సాధించినవారు వాగ్గేయకారులు.

శోభిల్లు సప్త స్వర సుందరుల
భజింపవే మనసా

దక్షిణ భారతంలో సంగీత త్రిమూర్తులని ప్రసిద్ధిపొందిన త్యాగరాజు, శ్యామశాస్త్రి, ముత్తుస్వామి దీక్షితులు సమకాలికులు కావడం ఒక విశేషం. వారు తంజావూరుకు సమీపంలో ఉన్న తిరువాన్నూరుకు చెందినవారు కావడం మరొక విశేషం.

చరిత్ర మీద శీతకన్నువేసింది మనదేశం. ప్రసిద్ధ పురుషుల జీవిత విశేషాలు తెలుసుకోడానికి చారిత్రిక ఆధారాలు లభించవు. ఆధ్యాత్మికంగా మహానుభావు లైనవారి విషయంలో అయితే అద్భుత సంఘటనలను కల్పించి వారి మహత్తును దశగుణంగా, శతగుణంగా దీపింపజేసే ప్రయత్నం జరుగుతుంది. త్యాగరాజు విషయంలో కూడా అలాగే అని అనుకోవాలి.

### గాన బ్రహ్మ జననం

త్యాగరాజు జన్మ సంవత్సర విషయంలోనే వివాదం లేక పోలేదు. ఆయన 1767 లో జన్మించాడనే మనం ప్రస్తుతానికి అనుకో

శ్రీ కల్యాణసింగ్

వలసి ఉంది. వారియింటి పేరు కాకర్లవారు. తండ్రి పేరు రామ బ్రహ్మం. తల్లి సీతమ్మ. "సీతమ్మ మాయమ్మ శ్రీరాముడు మా తండ్రి" అనే ఆయన కీర్తనలో సీతారాముల పేర్లతో పాటు

ఆయన తల్లిదండ్రుల పేర్లు కూడా ధ్వనిస్తున్నాయని అంటారు. త్యాగరాజు తిరువారూరులో జన్మించాడు. అది ప్రసిద్ధ క్షేత్రం. కొన్నాళ్లకు రామబ్రహ్మం తన కాపురం తిరువైయారుకు మార్చాడు. తిరువైయారు పంచనదీక్షేత్రం. అక్కడే త్యాగయ్య పెరిగి పెద్దవాడయ్యాడు.

త్యాగయ్యకు చిన్ననాటినుంచీ శాస్త్రాలూ, కావ్యాలు మొదలైన వాటి మీద కంటే సంగీతం మీదనే ఎక్కువ ఆసక్తి ఉన్నట్టు కనిపిస్తుంది. తిరువైయారులో ప్రసిద్ధ వైణికుడు శొంఠి వెంకటరమణయ్య దగ్గర సంగీతం అభ్యసించాడు త్యాగరాజు. తన మాతామహుని ఇంట ఉన్న సంగీత శాస్త్ర గ్రంథాలను చదివాడు; అనేక సందేహాలు కలిగాయి. వాటిని గురించి యోచిస్తూ ఉండేవాడు. శ్రీరామకృష్ణానంద స్వామి అనే యతి నారదోపాస్తి మంత్రం ఉపదేశించాడు. నారదుడు ప్రత్యక్షమై "స్వరార్ణవం" అనే గ్రంథాన్ని ఇచ్చాడనీ, త్యాగయ్యకు సందేహాలన్నీ నివృత్తి అయ్యాయనీ అంటారు

## శ్రీరామ సాక్షాత్కారం

త్యాగయ్య తారక మంత్రం తొంభై ఆరుకోట్లు జపంచేశాడనీ, శ్రీరాముడు సాక్షాత్కరించాడనీ ప్రతీతి. త్యాగరాజు ఎన్నో కష్టాలు పడినట్లు కనబడుతుంది. ఆయన తన పెద్ద అన్న జప్యేశుని పోషణలోనే ఉంటూ ఉండేవాడు. త్యాగయ్య మొదటి భార్య పార్వతమ్మ గతించింది. తరువాత ఆమె చెల్లెలు కమలమ్మను వివాహం చేసుకొన్నాడు.

తంజావూరు ప్రభువు శరభాజీ మహారాజా త్యాగరాజు ప్రతిభను గురించి విని ఆయనను తన సంస్థానానికి ఆహ్వానించాడు

నిధి చాల సుఖమా? రాముని స
న్నిధి చాల సుఖమా? నిజముగ బలుకు మనసా
దధి నవనీత క్షీరములు రుచియో? దాశ
రథి ధ్యాన భజన సుధా రసము రుచియో?
దమ శమ మను గంగాస్నానము సుఖమా? క
ర్దమ దుర్విషయ కూపస్నానము సుఖమా?
మమత బంధన యుత నరస్తుతి సుఖమా?
సుమతి త్యాగరాజ నుతుని కీర్తన సుఖమా?

అని త్యాగయ్య నిరాకరించుకొని రాజు పిలుపును మన్నించలేదు. సహృదయుడైన మహారాజు బంగారు నాణాలతో బియ్యం కలిపి అక్షయ పాత్రలో వేయించాడు. బంగారంతో చేరిన బియ్యం అపవిత్రమై పోయాయని వాటిని వీధిలో పారబోయించాడు.

## నిజంగా త్యాగరాజే

బహు భాషా విశారదుడూ, కళా పోషకుడూ, స్వయంగా వాగ్గేయకారుడూ అయిన తిరువాన్కూరు మహారాజా స్వాతి తిరునాళ్ కూడా త్యాగయ్యకు తన సంస్థానంలో పదవి ఇవ్వడానికి ఉత్సహించాడు. ఆ మహారాజు ఆశకూడా నిరాశచేశాడు. ఆశారహితుడైన త్యాగరాజు.

పదవి నీ సద్భక్తి కలుగుటే
చదివి వేద శాస్త్రోపనిషత్తుల
సత్తు తెలియలేనిది పదవియా?
ధన దాన సుతాగార సంపదలు
ధరణీశుల చెలిమి యొక పదవియా?

అని రాజాదరణను తిరస్కరించిన త్యాగరాజు నిజంగా త్యాగరాజే.

ప్రతిభావంతుడై ఉండి తన ప్రతిభకు తగిన ఐశ్వర్యం వస్తే కాలదన్ని కూటికీ గుడ్డకూరాని రామభజన చేసుకొంటూ తనకు భారంగా తమ్ముడుండడంటే ప్రాపంచికుడైన అన్నకు కష్టంగానే ఉంటుంది మరి. వేరు కాపురం పెట్టించి త్యాగయ్యవంతుకు వచ్చిన రామ సహాయన్న విగ్రహాన్ని కావేరీ నదిలో పారవేయించాడట అన్నయ్య. అప్పుడు త్యాగయ్య

ఎందు దాగినాడో ఈడకు రా
నెన్నడు దయ వచ్చునో! ఓ మనస
తొలి జన్మముల నాడు చేసిన
దుష్కర్మముల నణగను జేయ నాదు
శత్రులను బట్టి పొడి చేయ నదియును గాక
ఇలను చంచల విరహిత నిజభక్త
జనులను త్యాగరాజును రక్షింప ॥ఎందు॥

అని వేదన పడుతూ ఉండగా ఒకనాడు రాముడే కలలో కనబడి విగ్రహాలు కావేరీ తీరంలో ఫలానా చోట దొరుకుతాయని చెప్పాడట. ఆ విగ్రహాలు దొరికినప్పుడు

ఎట్లా దొరికితివో! రామ తన
మట్లార గడియ దోవకు నాదు
పట్ల బిమానము లేకుండగా
సాధన మహిమో, పెద్ద లాశీర్వాద బలమో! సు స్వరపు
నాద ఫలమో, త్యాగరాజ ఖేదహర శ్రీనాథ

అనీ

కనుగొంటిని శ్రీరాముని నేడు

అనీ ధన్యతను ప్రకటించుకొంటూ

రారా మాయింటిదాక రఘు
వీరా సుకుమారా మ్రొక్కెద రా

అని పాడుకొన్నాడు, ఆనందం పట్టలేక.

చల్లరె రామచంద్రుని పైన పూలు చల్లరె
సొంపైన మనసుతో ఇంపైన బంగారు
గంపలతో మంచి చంపకములను చల్లరె

అని పాడుంటాడు.

త్యాగయ్య అనేక పుణ్యక్షేత్రాలు సేవించినట్లు తెలుస్తుంది. తిరుపతిలో స్వామి దర్శనం కాకుండా తెర అడ్డువేసి ఉంటే

తెర తీయగ రాద ? లోని ॥తెర॥
తిరుపతి వెంకట రమణ మత్సర మనుతెర

అని పాడేటప్పటికి తెర విడిపోయి భగవద్దర్శనం అయిందట.

కోవూరులో సుందరేశ ముదలియార్ అనే సజ్జనుడు త్యాగరాజ స్వామిని తన పల్లకిలో కూర్చోండబెట్టి అయ్యగారికి తెలియకుండా అందులో వెయ్యి నాణాలు పెట్టించాడు. దారిలో దొంగలు దాపురించారు. పల్లకిలో సొమ్ము ఉందనీ అది రాముని కైంకర్యం కోసం ముదలియార్ ఇచ్చాడనీ శిష్యులు తెలియజేశారు. "ఐతే రాముడు తన ధనాన్ని తానే కాపాడుకొంటా" డంటూ

ముందు వెనుక ఇరుప్రక్కల తోడై
మురఖర హర రారా
చండ భాస్కర కులాబ్ధి చంద్ర కో
దండపాణి యై రార
అండ గొలుచు సౌమిత్రి సహాయుడై
అమిత పరాక్రమ రార

అని ప్రార్థించగా రామలక్ష్మణులు కోదండపాణులై దొంగలను పారద్రోలారట.

## నిర్యాణం

వాగ్గేయకారునిగా, పరమ భక్తునిగా త్యాగరాజు కీర్తి విస్తరించింది. భుక్తినీ, ముక్తినీ ప్రసాదించే గానకళను అసంఖ్యాక శిష్యులచేత అభ్యసింపజేసి ఎనభై సంవత్సరాల పండువయస్సు వరకు జీవించాడు త్యాగరాజు. ఇక పదిరోజులకు నిర్యాణం కలుగుతుందనగా రాముడు కలలో కనబడ్డాడు. ఈ విషయం ఈ క్రింది కృతిలో చెప్పుకొన్నాడు త్యాగయ్య.

గిరిపై నెలకొన్న రాముని గురి తప్పక కంటి
పరివారులు వివిసురటులచే నిల
బడి విసరుచు గొసరుచు సేవింపగ ॥గిరిపై॥
పులకాంకితుడై ఆనందాశ్రు
వుల నింపుచు మాటలాడవలె నని
కలవరించ గని పదిపూటలపై
గాచెద నను త్యాగరాజ వినుతాని ॥గిరిపై॥

ఆ రోజు వచ్చింది. ఆనాడు పుష్య బహుళ పంచమి.

పరమాత్ముడు జీవాత్ముడు ముచ్చట
బాగా తెలుసుకోరే
హరి యట హరు డట సురు లట నరులట
అఖిలాండ కోటు లట అందరిలో

అనే కీర్తననూ

పరితాపము గని యాడిన పలుకుల మరచితివో
సరిలేని సీతతో సరయు మధ్యంబున నా
వరమగు బంగారు ఓడను మెరయుచు పదిపూటలపై
కరుణించెద ననుచు క్రేగనులను త్యాగరాజుని

అనే కీర్తననూ రచించి పాడి యోగ సమాధిలో కూర్చొని త్యాగరాజు పరమాత్మలో లీనమయ్యాడు.

## ఉదార చరిత్రుడు

సంగీత విద్యాపారంగతుడైన త్యాగరాజు మహనీయుడు. ఇతరుల విద్వత్తును హర్షించి ప్రశంసింపగల ఉదార చరిత్రుడు. షట్కాలమూ పల్లవి పాడగల గోవింద మారార్ అనే తిరువాన్కూర్ విద్వాంసుని పాటవిని త్యాగరాజు చెప్పిన కీర్తన ఇది.

ఎందరో మహానుభావు లందరికీ వందనము
చంద్ర వదనుని అందచందమును హృదయార
విందమున జూచి బ్రహ్మానంద మనుభవించు వా రెందరో
సామ గాన లోల మనసిజ లావణ్య
ధన్యమూర్ధన్యు ॥లెందరో॥

త్యాగయ్య కొంచెం ముంగోపి అట. ఒకనాడు తన శిష్యులలో కొందరు వేశ్య పాడిన జావళీలను విని వాటిని గురువుగారి యింట్లో పాడారట. అయ్యగారికి ఆ సంగతి తెలిసి వారిని వెడల గొట్టారట. కోపం కూడదనీ దయచూపి శిష్యులను మంచిమార్గంలో నడిపించడానికి ప్రయత్నించాలనీ ఆయన శ్రీమతి ఉద్బోధింపగా ఆ హిత వాక్యాన్ని పాటించి త్యాగయ్య శాంతయ్య అయ్యాడట. ఈ క్రింది కీర్తన ఆ సందర్భంలో చెప్పినదే అంటారు.

శాంతములేక సౌఖ్యములేదు సారస దళనయన
దాంతుని కైన వేదాంతుని కైన
దార సుతులు ధన ధాన్యము లుండిన
సారెకు జప తప సంపద కల్గిన ॥శాంతము॥

త్యాగయ్య 24,000 కీర్తనలు రచించినట్లు ప్రతీతి. మనకు లభ్యమైనవి దాదాపు 800 మాత్రమే. వాటిలో ప్రధాన విషయం రామభక్తి.

రామభక్తి సామ్రాజ్య మే మానవుల కబ్బెనో మనసా
ఆ మానవుల సందర్శన మత్యంత బ్రహ్మానందమే.

రామభక్తి స్థిరపడడానికి నాదోపాసన సాధనం అని త్యాగరాజు విశ్వాసం.

రాగ సుధారస పానము చేసి రాజిల్లవే మనసా
యాగ యోగ త్యాగ భోగ ఫల మొసగే ॥ రాగ ॥
సదాశివ మయమగు నాదోంకార స్వర
విదులు జీవన్ముక్తులని త్యాగరాజు తెలియు ॥ రాగ ॥

రాముడంటే కేవలం పరాత్పరుడనీ శివకేశవులకు భేదం లేదనీ త్యాగయ్య విశ్వాసం. ఐనా వ్యవహారం కోసం ఒక నామం ఉండాలి కదా. ఆయనకు అభిమానపాత్రమైనది రామనామం.

ఎవరని నిర్ణయించిరి రా నిన్నెటు లారాధించిరి రా నరవర
శివుడనో ! మాధవుడనో ! కమల భవుడనో
పరబ్రహ్మనో ॥ నిన్నెవరని ॥
శివ మంత్రమునకు 'మా' జీవము, మా
ధవ మంత్రమునకు 'రా' జీవము, ఈ
వివరము తెలిసిన ఘనులకు మ్రొక్కెద
వితరణ గుణ త్యాగరాజ నుత.

సంగీతాన్నీ, భక్తినీ సమన్వయించుకొన్నాడు త్యాగరాజు.

సంగీత జ్ఞానము భక్తి వినా సన్మార్గము గలదే మనసా.

ఆ భక్తిరసంలో కొంత హాస్యరసం కూడా చిలికించాడు త్యాగరాజు.

మీవల్ల గుణదోషమేమి ? శ్రీరామ
నావల్లనే కాని నళిన దళ నయన
తన తనయ ప్రసవ వేదన కోర్వలేకుంటె
అనయ యల్లునిపై అహంకార పడనేల !

త్యాగయ్య అపహాస్యం కూడా గట్టిగానే ఉంటుంది.

మనసు విషయ నట విటుల కొసంగితే
మా రాముని కృప కలగునో ? మనసా
తన తలు పొరింటికి దీసి పెట్టి
తా కుక్కలు తోలరీతి గాదో !

ఇంకా కఠినమైన ఎగతాళి కూడా చేయగలడు ఆయన.

మనసు నిల్ప శక్తి లేకపోతే
మధుర ఘంట విరుల పూజ ఏమి చేయును ?
సోమిదమ్మ సొగసుగాండ్ర గోరితే
సోమయాజి స్వర్గార్హుడౌనో.

ఆమెతో కలిసి చేసిన సోమయాగం ద్వారా—అని భావం.

వేదాలలో, ఉపనిషత్తులలో, శాస్త్రాలలో వివరించిన అనేక ధర్మాలనూ, నీతులనూ లలితమైన శబ్దాలలో రమణీయమైన సంగీతంతో మనకు అందించాడు త్యాగయ్య. ఆ నీతులూ, ధర్మాలూ అలా ఉంచి మనకు సులభ తరణోపాయం రామనామ సంకీర్తనం.

భజరే రఘువీరం శర భరిత దశరథ కుమారమ్.

అని కల్యాణి రాగంలో పాడుతూఉంటే ఎవరి హృదయంలో ఆధ్యాత్మిక స్పందనం కలగదు !

శ్రీరామ రూపంలో ఉన్న పరబ్రహ్మను నాదోపాసన ద్వారా సాధించి త్యాగరాజు తాను తరించి, మనం తరించే ఉపాయం చూపెట్టాడు.

ఉండేది రాముడొకడు ఊరక చెడిపోక మనసా
చండ మార్తాండ మధ్య మండలమునను చెలంగుచు ॥ఉండేది॥
తామ సాది గుణ రహితుడు సర్వ సముడు
క్షేమకరుడు త్యాగరాజ చిత్తహితుడు జగము నిండి ॥ఉండేది॥

ఇక మంగళం.

నీనామ రూపములకు నిత్య జయ మంగళం
పవమాన సుతుడు బట్టు పాదారవిందములకు
నవ ముక్తాహారములు నటియించు ఉరమునకు
నళినారి గేరు చిరునవ్వుగల మోమునకు
పంకజాక్షి నెలకొన్న అంగ ఉదయునకు
ప్రహ్లాద నారదాది భక్తులు పొగడుచుండ
రాజీవ నయన త్యాగరాజ వినుతమైన ॥ నీనామ ॥

# ఉత్తమ మార్గము

— శ్రీ వై. వి. వెంకటరత్నం

మన తాత ముత్తాతల హయాంలో సంపదయే సంతానము
సంతాన పరిమితికై కృషిచేస్తోంది నేటి మన ప్రభుత్వయంత్రాంగము
సంతానము కోసము తపస్సు చేసిరి ప్రాచీనకాలములో
సంతాన నిరోధానికై కృషి చేస్తున్నారు నవీన కాలములో

ప్రతి మనిషికి కూడు, గుడ్డ, నీడ కావాలంటే
సుఖ సంపదలతో తులతూగాలంటే
మానవతను పెంపొందించాలంటే
పరిమిత కుటుంబమొక్కటే మార్గము
అదే మనందరి ప్రధాన ధ్యేయము
అదే నేటి జాతికి శరణ్యము

ఇద్దరు లేక ముగ్గురు-అదే నేటి నినాదము
భరతజాతి ప్రగతి కది సోపానము
నవనాగరికత కది తార్కాణము
సుఖమయ జీవితాని కది ఉత్తమ మార్గము

వేస్తున్నారెన్నో ప్రణాళికలు
ప్రగతి పథంలో నిల్చిన గీటురాళ్ళు
నిర్మిస్తున్నారెన్నో ప్రాజక్టులు
జాతి పురోభివృద్ధికి నిదర్శనాలు
చేసి చూపిస్తున్నారు ఎన్నెన్నో ప్రయోగాలు
దేశపురోభివృద్ధికి చిహ్నాలు

ప్రణాళికలెన్ని వేసినా
ప్రయత్నాలెన్ని చేసినా
పెరుగుతోంది జనాభా
పెరిగి పోతున్న ధరలు మరింత వేగంగా
చేస్తున్నది చీకటి బజారు నిలయతాండవము
చేరుతున్నది కొందరి జేబుల్లో నల్లధనము

అందుకే తోడ్పడాలి ప్రభుత్వానికనుక్షణము
అవలంబించాలి కుటుంబనియంత్రణము
అరికట్టాలి ద్రవ్యోల్బణము
అప్పుడే వస్తుంది గాంధీజీ కలలుకన్న రామరాజ్యము
ఆనాడే వస్తుంది నెహ్రూజీ ఆశించిన శ్రేయోరాజ్యము ⊗

# ఇది మన తెలుగు సా



ఈ సంవత్సరాన్ని మన తెలుగు ప్రజల
పరిగణించుకొంటూ ఉప్పొంగే ఉత్సాహంత
జరుపు కొంటున్నారు. ఈ సందర్భంగా
శ్రీ జలగం వెంగళరావు, విద్యామంత్రి శ్రీ
ఆర్థిక శాఖ మంత్రి శ్రీ పిడతల రంగా
ప్రచురిస్తున్నాం.

## సమైక్యంగా కృషి చేద్దాం

తెలుగు జాతి చరిత్రలో ఒక మహత్తరమైన సంఘటనగా యీ సంవత్సరాన్ని పేర్కొనవచ్చు. తెలుగుజాతి, ప్రపంచం నలు మూలల నుండి వచ్చి, ప్రపంచ తెలుగు మహా సభల్లో పాల్గొన బోతోంది. ఈ సంవత్సరాన్ని సాంస్కృతిక సంవత్సరంగా ప్రకటించడం జరిగింది. సంస్కృతీ సంవత్సరం అని యీ సంవత్సరాన్నే ఎందుకు పేర్కొనాలి? అంతకు ముందు మనకు సంస్కృతి లేదా ? అన్న సందేహాన్ని కొంత మంది ప్రకటిస్తున్నారు. వన మహోత్సవం, అంటే అంతకు ముందు చెట్లు లేవనికాదుగా! ఉన్న చెట్ల ప్రాముఖ్యాన్ని పెంచాలనీ, క్రొత్తవి పెంచాలనీ, ఆనాటి నించీ దీక్ష వహించాం. అలాగే యీ సాంస్కృతిక సంవత్సరం కూడా.

సందేహాలు మానేసి సమైక్య కృషి చేసినప్పుడే భవిష్యత్తు ఉజ్వలంగా ఉంటుంది. మనం గర్వించదగినంత పూర్వకాలం నించీ తెలుగు సంస్కృతి ఉన్నది. దాని ప్రత్యేకతని పెంచే అవకాశాన్ని యిప్పుడు పెంచుకుందాం. తెలుగు నేల నలుమూలలా యీ ఉత్సవాలు జరగాలి. మన గత చరిత్రలో స్మరించదగిన మహనీయులను, ఘట్టాలను మనం స్మరించుకోవాలి. తెలుగు నేల కళలకు కాణాచి. కళలన్నింటినీ ప్రోత్సహించే దీక్ష పూనుదాం. తెలుగు భాషని ప్రభుత్వ భాషగా అన్ని స్థాయిల్లోను తేవటానికి పూర్తి ప్రయత్నం జరుగుతున్నది.

1975 సంస్కృతీ సంవత్సరం. తెలుగు జాతికన్న కలల సంక్రాంతి సంవత్సరం. ప్రపంచ తెలుగు మహాసభలను దిగ్విజయం చేయండి.

శ్రీ జలగం వెంగళరావు

## జాతి పునరుజ్జ

తెలుగు జాతి గర్వించ తగిన భవిష్యత్తుకు రూపుదిద్దుకునే అవకాశం ప్రపంచ తెలుగు మహాసభలు కల్పిస్తున్నాయి. సంస్కృతికి బంగారు బాటలు పరచు కొందామన్న దీక్షను మనం వహించుదాం. అందుకే యీ సంవత్సరాన్ని సంస్కృతీ సంవత్సరంగా ప్రకటించటం జరిగింది.

గతాన్ని చూసి గర్వపడితే చాలదు. వర్తమానాన్ని ఊరికే పోనిస్తే భవిష్యత్తు భయం భయంగా అవుతుంది. అందుకే వర్తమానంతో గత గౌరవాన్నీ, భవిష్యత్తు ఆశనీ ముడివేసి యీ సంస్కృతీవత్సర ప్రారంభాన్ని చేసుకుందాం. చరిత్ర



శ్రీ మండలి వెం

# ంస్కృతిక సంవత్సరం

**********************************************

ంతా తెలుగు సాంస్కృతిక సంవత్సరంగా
ో, ఉరకలువేసే ఆనందంతో ఉత్సవాలను
ా తెనుగుజాతి నుద్దేశించి ముఖ్యమంత్రి
మండలి వెంకటకృష్ణారావు, సమాచార,
ారెడ్డి ఇచ్చిన సందేశాలను యీ దిగువ

—ప్ర. సం.

**********************************************



## వనానికి నాంది

క్రొత్త మలుపు తిరిగిన గుర్తుగా యీ సంవత్సరం నిలిచిపోగలదని నమ్మకం.

జాతి పునరుజ్జీవనానికి నాంది యీ సన్నివేశం. తెలుగు జాతి ముక్తకంఠముతో పాడే సమైక్య గీతానికి పల్లవి కాబోతున్నది యీ సంస్కృతీ సంవత్సరం. ఇది మనందరి ఉత్సవం. ఉప్పొంగే ఉత్సాహంతో, ఉరకలు వేసే నవచైతన్యంతో కదలి రండి.

మహాసభలు మనందరివి. రాష్ట్ర వ్యాప్తంగా సంస్కృతీ ప్రాముఖ్యాన్ని ఇనుమడించే రీతిగా ఉత్సవాన్ని జరుపు కుందాం.



ంకట కృష్ణారావు

## ఒకే మాట—ఒకే బాట

సంస్కృతీ సంవత్సరంగా—యీ 1975 వత్సరాన్ని మనమంతా ఒక చరిత్రాత్మక సంవత్సరంగా చూడబోతున్నాం. రాబోయే ఉగాది నాడు జరుగబోయే ప్రపంచ తెలుగు మహాసభలు మన జాతి చరిత్రలో మరపురాని ఘట్టంగా ముందు తరాల వారికి ఆదర్శ ప్రాయంగా అవతరించ బోతున్న శుభ సమయాన నా హృదయ పూర్వక శుభా కాంక్షలు.

''తెలుగు తేట. కన్నడ కస్తూరి.'' అన్న సామెత ఉంది కన్నడంలో. ఇతర భాషీయులే పొగడే అంత స్వచ్ఛత మన భాషలో ఉండగా—మన భాషని మనం ఆదరించుకోవాలని వేరే చెప్ప నక్కరలేదు. అలాగే సర్వ కళల్నీ పోషించే దీక్షని మనం వహించుదాం.

సమస్యలెన్ని ఉన్నా, సందేహాలెన్ని వచ్చినా గడచి పోయేది చరిత్ర. ఆ చరిత్రని ఒక మరపురాని మహోజ్జ్వల ఘట్టంగా చేయాలన్న తలంపే యీ ప్రపంచ తెలుగు మహాసభలు.

సంస్కృతీ సంవత్సరానికి స్వాగతాన్ని పలుకుదాం.

భవిష్యత్తుకి— బాటలు వేసుకుందాం. తెలుగు జాతి మహోత్కృష్టతను చేతల్లో నిరూపించుదాం. కలసిరండి. కదలి రండి. చేయి చేయి కలిసిరండి—ఒకేమాట, ఒకేపాట, ఒకేబాటగా అందరూ.

శ్రీ పిడతల రంగారెడ్డి

# ధైర్యశాలి పటేల్



శ్రీ ఉలకలాపు లక్ష్మణదాసు

భారతరాజకీయరంగంలో వల్లభాయిపటేల్ అవతరించకుండా ఉంటే దేశం ఈ నాడు సామాన్యుల దేశంగానూ. రాజుల దేశం గానూ రెండు రూపాలతో కూడి ఉండేదని ఒక ప్రముఖ రాజకీయ వేత్త అన్నారు. ఈ అభిప్రాయం సర్దార్ పటేల్ మహోన్నత వ్యక్తిత్వాన్ని తెలియజేస్తుంది. 544 సంస్థానాలను స్వతంత్ర భారతంలో విలీనం చేసి దేశానికి సమగ్రత చేకూర్చి సర్దార్ పటేల్ 'ఉక్కుమనిషి' గా దేశచరిత్రలో శాశ్వత స్థానాన్ని సముపార్జించు కున్నారు. ఆయన దీక్ష, ధైర్యం అసామాన్య మైనట్టివి. కార్య వాదిగా ఆయన ఆచరణకే ప్రాధాన్యత ఇచ్చారు. ఏపని చేసినా స్థిరసంకల్పంతో చేసేవారు. స్వతంత్ర భారతదేశం శక్తివంత మైనదిగా, సమగ్రమైనదిగా, సమైక్యమై ఉండాలని ఆకాంక్షించి అందుకు అనుగుణంగా అకుంఠిత దీక్షతో కృషిచేశారు.

పటేల్ పూర్వీకులు పంజాబ్‌నుంచి తరలివచ్చి మాహి. తపతి నదుల మధ్యగల ప్రాంతంలో స్థిరపడ్డారు. క్షాత్ర ధర్మంగల వీరికుటుంబం కృషీవలురుగా మారినప్పటికీ ధైర్యస్థైర్యాలు మాత్రం విడనాడలేదు. పటేల్ తండ్రి ఝవేరిబాయి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంలో రాణీ ఝూన్సీలక్ష్మీబాయి దళంలో చేరి పోరాడిన యోధుడు. సంగ్రామానంతరం ఝవేరిబాయి గుజరాతులోని 'కరంసాద్' లో వ్యవసాయం చేసుకుంటూ కాలం గడిపారు. ఆయన కుటుంబానికి 10 ఎకరాల భూమి మాత్రమే మిగిలింది. ఝవేరిబాయి, లాడ్బాయి దంపతులకు ఐదుగురు కుమారులు. ఒక కుమార్తె సంతానం. వారిలో మూడవ కుమారుడు విఠల్‌భాయి. నాల్గవ కుమారుడు వల్లభాయి దేశచరిత్రలో ఈ సోదరులిరువురు ప్రముఖస్థానం వహించారు.

## కష్ట జీవి

వల్లభాయి జన్మదినం 1875 అక్టోబరు 31 అని మెట్రిక్యులేషన్ సర్టిఫికెట్‌ను బట్టి నిర్ణయించారు. తల్లిగారి స్వస్థలమైన నడియాద్‌లో ఆయన జన్మించారు. బాల్యంనుంచి వల్లభాయి కష్టజీవిగానే పెరిగారు. తండ్రి వైష్ణవ భక్తి సంప్రదాయంలో స్వామి సహజానంద బోధనలకు ప్రభావితులై ఎక్కువగా దైవచింతనలోనే గడిపేవారు. అన్నలు వల్లభాయిపై పెత్తనం చేసేందుకు ప్రయత్నించేవారు. కాని చిన్నతనంనుంచి స్వతంత్రభావాలు నాటుకుపోయిన పటేల్ దానికి సమ్మతించేవారు కాదు. చిన్నప్పుడు తండ్రి పొలంలో నాగలి దున్నుతూ వల్లభాయికి ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామంనాటి అనుభవాలు చెప్పేవారు. దేశాన్ని పరిపాలన నుంచి విముక్తి చేయాలనే దీక్ష బాల్యంలోనే పటేల్ మనసులో గాఢంగా నాటుకున్నది.

పటేల్ కరంసాద్, పెట్లాద్. నడియాద్‌లలో చదివి ఇంగ్లీషులో మెట్రికులేషన్ పాసయ్యారు. అప్పటికే ఆయనకు వివాహం ఐంది. విద్యార్థిగా ఉండగానే వల్లభాయి ధైర్యానికి మారుపేరుగా నిలిచారు. నిష్కారణంగా ఒక ఉపాధ్యాయుడు ఒక విద్యార్థిని కొట్టినందుకు పటేల్ నాయకత్వం క్రింద పిల్లలందరూ సమ్మెచేసి, యికముందు ఆవిధంగా జరగకుండా చూస్తానని హెడ్మాష్టరు వద్దనుంచి హామీ పొందారు.

నడియాద్ మునిసిపాలిటీకి వల్లభాయి ప్రోత్సాహంపై ఒక ఉపధ్యాయుడు పోటీ చేశాడు. వల్లభాయి తమ విద్యార్థి బృందంతో ప్రచారకార్యక్రమం ముమ్మరంగా సాగించారు. ఉపాధ్యాయునితో ఒక ధనికుడు ప్రత్యర్థిగా పోటీకి నిలబడ్డాడు. తాను ఓడిపోతే మీసం తీయించుకుంటానని ఆయన ప్రగల్భాలు పలికాడు. దానితో పటేల్ పట్టుదల యింకా యినుమడించింది. ఉపాధ్యాయుణ్ణి గెలిపించారు. విద్యార్థులంతా ఊరేగింపుగా ఆ ధనికుడి యింటికి వెళ్లారు. మీసం వెంటనే తీయించుకోమని పటేల్ ఆ ధనికుణ్ణి నిలదీసి అడిగారు.

వల్లభాయి చిన్నతనం నుంచి స్వతంత్ర జీవి. మెట్రిక్యులేషన్ ప్యాసయిన తర్వాత ప్రభుత్వ ఉద్యోగం లభించినప్పటికీ ఆయన అంగీకరించలేదు. విఠల్‌భాయి న్యాయశాస్త్రం చదివి గోద్రాలో ప్రాక్టీసు పెట్టారు. వల్లభాయికి న్యాయవాద వృత్తి వచ్చింది. చదవటానికి తగిన ఆర్థిక స్తోమత లేదు. ముందు జిల్లా ప్లీడరీకి అర్హత సంపాదించ దలచారు. రోజూ కోర్టుకు వెళ్లి అక్కడ వాద ప్రతివాదాలను శ్రద్ధగా వినేవారు. పరీక్షకు

హాజరై ఉత్తీర్ణత పొంది 1900లో గోధ్రాలో ప్లీడరుగా స్వతంత్ర వృత్తి ప్రారంభించారు. ఒకసారి అక్కడ ప్లేగు వ్యాధి ప్రబలినప్పుడు వల్లభాయి వెనుక దీయకుండా ప్రజలకు శుశ్రూష చేశారు. చివరకు తాము కూడా వ్యాధికి లోనయ్యారు.

తర్వాత 1902లో బోర్సాద్ తరలి వెళ్లారు. అక్కడ అనతి కాలంలోనే మంచి న్యాయవాదిగా పేరు తెచ్చుకున్నారు. ముఖ్యంగా పోలీసు కేసులలో ఆయన వాదించి అమాయకులను రక్షించేతీరు అందరిని ఆశ్చర్య పరచేది. అడ్డుప్రశ్నలతో పోలీసులను కలవర పరచి వారిచేత నిజం పలికించేవారు. ఒకసారి పోలీసు వుద్యోగి వల్లభాయి వేసిన అడ్డుప్రశ్నలకు ఉబ్బిబ్బులయి దొంగకేసు బనాయించానని నిజం ఒప్పుకోక తప్పలేదు.

## విశాల హృదయం

వల్లభాయి పటేల్‌కు ఒక కుమార్తె — మణిబెన్, ఒక కుమారుడు దయాభాయి కలిగారు. న్యాయవాదిగా తాము ఆర్జించి కూడబెట్టిన పైకంతో అన్నను యింగ్లండు పంపి బారిస్టరు చదువు పూర్తి చేసేందుకు తోడ్పడిన విశాల హృదయుడు పటేల్.

తానుకూడా బారిస్టరు కావాలనే కోరిక పటేల్‌లో ప్రబలంగా ఉండేది. సంపాదన కూడబెట్ట సాగారు. న్యాయవాద వృత్తిలో ఆయన చూపిన ప్రతిభ, సామార్థ్యం, దీక్ష అందరి ప్రశంసలందుకున్నవి. వృత్తిధర్మాన్ని నిర్వహించటంలో ఆయన చూపిన దీక్ష అనన్యసామాన్యమైనట్టిది.

ఒకసారి వల్లభాయి కోర్టులో ఒక హత్యానేరంలో వాదన సాగిస్తున్నారు. ఇంతలో కోర్టు బంట్రోతు ఆయనకు ఒక టెలిగ్రాం అందించాడు. ఒక క్షణంపాటు దాన్ని చదువుకుని వెంటనే కోటు జేబులో మడిచి పెట్టుకొని వాదన కొనసాగించారు. ఆ కేసులో నిందితుడు హత్యానేరంనుంచి బయట పడ్డాడు. కోర్టు ముగిసాక పటేల్‌కు వచ్చిన టెలిగ్రాం గురించి తెలుసుకొని అందరూ ఆశ్చర్య చకితులయ్యారు. జలరాశినంతటినీ తన గర్భంలో దాచుకున్న మేఘశకలాలవంటి ఆ గంభీరమూర్తి కన్నులలో దాగిన విషాదాన్ని చూసి వారి గుండెలు ద్రవించి పోయాయి. వల్లభాయి పటేల్ భార్య మరణించిందన్న విషాదవార్తను ఆ టెలిగ్రాం మోసుకొచ్చింది. కర్తవ్య పరాయణతకు పటేల్ ఎంత విలువ నిచ్చేవారో, ఆయన ఎటువంటి విషమపరిస్థితులలోనైనా మేరు నగధీరులుగా ఏలావుండగలిగెవారో ఈ సంఘటన సాటిచెబుతుంది.

అప్పటికి పటేల్ వయస్సు 33 సంవత్సరాలు మాత్రమే. పునర్వివాహ ప్రసక్తి పటేల్ దగ్గరకు రానిచ్చేవారుకాదు. తమ ఇరువురు బిడ్డలను బొంబాయిలోని పాఠశాలలో చేర్పించి 1910 ఆగస్టులో బారిస్టరు చదువుకు ఇగ్లండుకెళ్లారు.

పటేల్ చదువుతోపాటు, బ్రిటీషు ప్రజలు అంత సామ్రాజ్యాన్ని పాలించడానికి తోడ్పడిన గుణాలేవిటో శ్రద్ధగా పరిశీలించారు.

1913లో బారిస్టరు పూర్తిచేసి స్వదేశం చేరుకున్నారు. అప్పటిలో బొంబాయి ప్రధాన న్యాయమూర్తి సర్ బాసిల్ స్కాట్ పటేల్‌కు న్యాయమూర్తి పదవి ఇస్తామని చెప్పినా సమ్మతించక అహమదాబాదిలో న్యాయవాదిగా ప్రాక్టీసు పెట్టారు.

బెంగాల్ విభజన, ప్రథమ ప్రపంచయుద్ధం దేశంలో అనేక పరిణామాలు తెచ్చినాయి. లోకమాన్యతిలక్ 'స్వాతంత్ర్యం నా జన్మహక్కు' అనే నినాదం దశదిశలా మారుమ్రోగింది. డాక్టర్ అనిబిసెంటు 'ఆలిండియా హోమ్ రూల్ లీగ్' బలం సంపాదించుకో సాగింది. 1917లో గాంధీజీ చంపారణ్ సత్యాగ్రహం ఘన విజయం సాధించింది.

వల్లభాయిపటేల్‌పై యివన్నీ అమృత ప్రభావం చూపాయి. ఆయన గుజరాత్ సభకు కార్యదర్శి అయ్యారు. ఆ సభ అనతి కాలంలోనే జాతీయోద్యమానికి ఉత్తమ వేదికగా రూపుదాల్చింది.

వల్లభాయి 'కైరా' జిల్లాలో అక్రమమైన పన్నుల విషయంలో గాంధీజీ జరిపిన సత్యాగ్రహానికి బాసటగా నిలిచి కృషి చేశారు. పటేల్ సహాయం లేకపోయినట్లయితే ఈ ఉద్యమం యింత విజయం సాధించిఉండేది కాదు అని గాంధీజీ అన్నారు.

## కార్యదీక్ష

పటేల్ అహమదాబాదు మునిసిపాలిటీకి కౌన్సిలరుగా ఎన్నిక అయి మునిసిపల్ కమీషనరు పిలిడీ సాగిస్తున్న నిరంకుశ పాలనను ప్రతిఘటించారు. తర్వాత పటేల్ మునిసిపాలిటీకి అధ్యక్షులుగా కూడా ఎన్నికయ్యారు. ఆ నగరాన్ని ఎన్నో విధాల అభివృద్ధి పరిచారు. 1927 జూలై 23న అహమదాబాదులో కుంభవృష్టిగా వర్షం పడింది. రోడ్లు జలమయమయ్యాయి. డ్రైనేజీ కాలువలు సరిగా పనిచేయడంలేదు. వర్షం తగ్గలేదు 2 రోజులలో 53 అంగుళాల వర్షం పడింది. వల్లభాయి నిద్రపోలేదు. అర్థరాత్రి లేచి నీళ్లలో నడుచుకుంటూ వెళ్లి సిటీ ఇంజనీరును లేపి మునిసిపల్ ఆఫీసుకు తీసుకువెళ్లారు. అంతేకాదు మునిసిపల్ పనివారికి ఫోనుచేసి పిలిపించారు. పటేల్ దగ్గరుండి నీరు సరిగా పోయేందుకు డ్రయినేజు బాగుచేయించారు. ఆయన కార్యదీక్ష అట్టిది.

రౌలత్ చట్టం వ్యతిరేకంగా సాగిన ఉద్యమంలో వల్లభాయి ప్రముఖపాత్ర వహించారు. 'సత్యాగ్రహ' అనే దినపత్రికను తమ ఇంటిలోనే సయిక్లోస్టయిలు చేయించి పంచేవారు.

పటేల్ ఎక్కువగా ప్రసంగాలు యిచ్చేవారుకాదు ఆయన కార్యశూరుడు. గయ కాంగ్రెసు సభ సందర్భంలో పటేల్ ఇలా అన్నారు. "నేను నాయకుణ్ణికాదు, నేను ఒక సైనికుణ్ణి మాత్రమే. ఒక రైతుబిడను, కేవలం ఉపన్యాసాలవల్ల మనకు స్వరాజ్యం లభిస్తుందని నేను నమ్మటంలేదు".

(ఆకాశవాణి సౌజన్యంతో)

ప్రకాశం జిల్లాలో
ఆదర్శవంతంగా నడుస్తోన్న

# చంద్రశేఖరపురం ఉన్నత పాఠశాల

శ్రీ రావిపాటి మహానంద

ప్రకాశం జిల్లా చంద్రశేఖరపురంలో పూర్వపు నెల్లూరు జిల్లా పరిషత్ వారిచే మాధ్యమిక పాఠశాల 1958 ఆగస్టులో ప్రజల కోరికపై ప్రారంభింపబడి ఉన్నత పాఠశాలగా 1965లో 132 మంది విద్యార్థులతో ప్రారంభించబడింది. ఈ పాఠశాలకు స్వంత బిల్డింగు లేదు. కొన్నాళ్లు అద్దెయిండ్లలోను, కొన్నాళ్లు వదాన్యులు కీ॥ శే॥ కొల్లి వెంకటాద్రి నాయుడుగారి స్వంత యింట్లోనూ ఉచితంగా నడుపబడి, గ్రామస్థులలో ఐక్యత లేక కులతత్వ, గ్రూపు తత్వ తగాదాలతో సతమత మగుచూ, స్కూలు అభివృద్ధిని బిల్డింగు పరపతిని పట్టించు కొనకపోతిరి. ఒంగోలు జిల్లా పరిషత్ వారు శాశ్వత బిల్డింగు ఏర్పరచనిచో స్కూలుఎత్తి వేస్తామని 9-9-1971 నోటీసు యిచ్చారు.

అప్పుడున్న హెడ్‌మాష్టరు శ్రీ మల్లాది చినవెంకటేశ్వర్లు తీవ్ర కృషి సాగించి ఉపాధ్యాయుల, విద్యార్థులను తేజపరచి, గ్రామంలోని వివిధ గ్రూపులకు, కులాలకు సంబంధించిన పెద్దల, యువకుల సమ్మేళనం చేసి, విద్యార్థుల ద్వారా ప్రతి కుటుంబంలో భవన నిర్మాణ కాంక్షను కలిగించారు. విద్యార్థుల, ఉపాధ్యాయుల బృందాలను పరిసర గ్రామాలకు కాలినడకన దండు సాగించి విరాళములు వసూలుచేశారు. గ్రామస్థు లందరూ వంతుల ప్రకారము పుచితంగా రాళ్లను, యిసుక, గచ్చు తోలించుతూ పుపాధ్యాయులు, విద్యార్థులు తీరిక వేళలందు, శలవులందు నిత్యశ్రమదానం చేయుటద్వారా ప్రభుత్వపు ఎస్టిమేట్ల ప్రకారము రు. 20,000/- ఖరీదు గల బిల్డింగు నిర్మించిరి. ఆగ్రామమున శ్రీ కొల్లి వెంకటాద్రినాయడుగారి కుమారుడు శ్రీ అంకబాబు (అడ్వకేటు) గారు తన తండ్రి జ్ఞాపకార్థము ఒక విశాలమైన గది నిర్మించిదానము చేసిరి. శ్రీమతి సింగరాజు కృష్ణవేణమ్మగారు, శ్రీమతి మతుకుమల్లి నరసమ్మగారి జ్ఞాపకార్థము రు. 13,000/- విరాళ మిచ్చిరి. శ్రీ గ్రంథి అంజయ్య, ఎల్చూరి సుబ్బారావుగారలు తలుపులు చేయించి యిచ్చిరి.



విద్యార్థులు-ఉపాధ్యాయులు శ్రమతో నిర్మించిన పాఠశాల భవనం

## శ్రమదానం

ఈ విధంగా యీ స్కూలు భవనం కీ॥ శే॥ కొల్లి వెంకటాద్రి గాయుడుగారు ధర్మము చేసిన ఐదు ఎకరముల స్థలములో కన్నుల పండువుగా విలసిల్లు చున్నది. విద్యార్థులు, ఉపాధ్యాయులు కృషి శ్రమదానము ద్వారా పెద్ద బావిని త్రవ్వారు. ఆ బావి నీటి ద్వారా విశాలమైన తోటను పెంచుతున్నారు.

నిత్యం కరువు వాతపడు ప్రాంతమైనా సాంఘిక సేవాను రక్తిగల హెడ్ మాష్టరు శ్రీ మల్లాది చిన వెంకటేశ్వర్లు కృషి, ఉపాధ్యాయులు, ముఖ్యంగా విద్యార్థులు చేసిన కృషి అనన్య సామాన్యం. ముఖ్యంగా గ్రామస్థులను వక్కత్రాటి క్రింద తెచ్చి, శ్రమ దానం విలువను సంపూర్ణముగా తెలుసుకొన్న విద్యార్థులు గణనీయులు. ఎండనకా, వాననకా కాలినడకన ఉపాధ్యాయులు విద్యార్థులు గడప గడప, గ్రామం గ్రామం జోలె పట్టుకొని బీదవాని మొదలు కలిగిన వారివరకు భిక్షమడిగి వేలకొలది రూపాయలు దినపస్థులుండే చంద్రశేఖరపురం లాంటి ప్రాంతంలో వసూలు చేయుట సామాన్య విషయం కాదు. గ్రామాభివృద్ధి కార్యక్రమాలలో విద్యార్థులను యీ విధంగా సరియైన మార్గంలో ఉత్సాహపరచి, అటు విద్య కుంటుపడకుండా నడిపితే ప్రతి దానికి ప్రభుత్వంపై ఆధారపడు మన స్తత్వం పోతుంది. ప్రక్కనున్న మొగళ్లూరు, వెలిదండ్ల హైస్కూలు భవనాలకు జిల్లా పరిషత్ వేలకొలది పూర్తి గ్రాంట్లు మంజూరు చేస్తే ప్రభుత్వం నుండి నయా పైసా అడుగకుండా యింతటి బిల్డింగు నిర్మించుకొన్న విద్యార్థులు ఉపాధ్యాయులు ఆదర్శ ప్రాయులు. ఈ స్కూలుకు దాపున వందలాది ఎకరాల ప్రభుత్వ బంజరున్నది. ఇదొక ఆదర్శ వ్యవసాయ క్షేత్రముగా చేయవచ్చు. విద్యార్థులు ఆదర్శప్రాయులైన, స్వయం పోషక కృషీవలులను చేయుట ద్వారా, నవీన వ్యవసాయ పద్ధతులు హైబ్రిడ్ విత్తనాల వాడుట, రసాయనిక ఎరువుల శాస్త్రీయ పద్ధతుల వాడుటను అమలు జరుపుట ద్వారా యిదొక ప్రదర్శన క్షేత్రంగా తీర్చి దిద్దవచ్చు.



# మహాభారతము

తెంపుగంతుల లక్ష్మణశాస్త్రి

## 83

'అశ్వపతి : రాజర్షీ ! సావిత్రియని నాకూతురు ఉన్నది. ఆమె నిక్కడికి తోడ్కొని వచ్చినాను. సౌందర్యవతియైన యీ కన్యను నీవు కోడలుగా గ్రహింపుము.

ద్యుమత్సేనుడు : మహారాజా ! మేము రాజ్య భ్రష్టులమై అడవి యందు నియమ నిష్ఠలతో పాటు తాపవృత్తిలో ధర్మానుష్ఠానమును చేయుచున్నాము. మీ కూతురు ఈ కష్టములను ఎట్లు సహించగలదు.

అశ్వ : రాజా ! సుఖ దుఃఖములు పుట్టుచుండును; పోవుచుండును, శాశ్వతములు కావు. ఈ విషయమును నేను,నా కూతురున్ను బాగుగా ఎరుగుదుము. నావంటి వానికి నీవు ఇట్టి మాటలు చెప్పనక్కర లేదు నేను అన్నివిధములా నిశ్చయించుకొనియే నీవద్దకు వచ్చినాను. స్నేహ భావముతో శరణు జొచ్చినాను. నా ఆశను భంగపరచవద్దు. ప్రేమతో నీ వద్దకు వచ్చి ప్రార్థించుచున్న నన్ను నిరాశ పరచి తిరిగి పంపకుము. మనమిద్దరము అన్నివిధములా గూడా పరస్పరము సంబంధము చేసికొనుటకు తగిన వారము. నీవు ఈ నా కన్యకను, శ్రేష్ఠుడైన నీ పుత్రుడు సత్యవంతునికి పత్నిగాను, నీకు కోడలిగాను స్వీకరింపుము.

ద్యుమ : రాజా ! నేను తొలుతనుండియే నీతో సంబంధము చేయదలచు చుంటిని. కాని యిప్పుడు రాజ్య భ్రష్టుడనైనాను కనుక యీ సంబంధము కాజాలదని తలచితిని. మొదటినుండియే నాకు అభీష్టమైన యీ సంబంధము ఇప్పుడు నిశ్చయింప బడుచున్నదనగా నాకును సంతోషమే. అవశ్యముగా కానిమ్ము. నేడు నీవు, నేను కాంక్షించి అతీథి వైతితివి."

"ఇట్లు వారిద్దరూ మాట్లాడు కొనిన తరువాత, ఆశ్రమములో నున్న బ్రాహ్మణులందరినీ పిలిచి, ఆ రాజు లిద్దరు, సావిత్రి సత్యవంతులకు యథాశాస్త్రముగా వివాహమును జరిపించిరి. అశ్వపతి మహారాజు, అనేకములుగా కానుకలను, కన్యతో బాటు సత్యవంతునకు ఇచ్చి సంతోషముతో తిరిగి స్వనగరమునకు పోయెను.

"సత్యవంతుడు గూడ సర్వ సద్గుణ సంశోభితురాలైన భార్యను పొంది ఆనందించెను సావిత్రిగూడా తాను కోరిన పతి లభించినందుకు సంతోషించెను. తండ్రి వెడలిపోయిన తరువాత సావిత్రి ఆభరణము లన్నియు తీసి, నార చీరను, కాషాయ వస్త్రములను ధరించెను. ఆమె తన వినయాది సద్గుణముల చేతను, పరిచర్యల చేతను. ఇంటిలో అందరి మనస్సులకు అనుగుణముగా నడుచుకొనుట చేతను, అందరి ప్రీతిపాత్రురాలయ్యెను అనేక సేవలు చేసి ప్రియముగా మాట్లాడి ఆమె అత్త మామలను సంతోషపరచెను. ఆ విధముగానే ప్రియసంభాషణముచేతను, కార్యకౌశలముచేతను, శాంతిచేతను, ఏకాంత సేవచేతను భర్తను గూడ సంతోషపరచెను.

"ఇట్లు వారందరు ఆయాశ్రమమునందు ఉండి తపస్సు చేయుచుండగా కొంతకాలము గడచెను. సావిత్రి నిరంతరము చింతచేత కృశించుచుండెను. రాత్రింబవళ్లు ఆమె మనస్సునందు నారదుడు చెప్పిన మాటలే మెదలుచుండెను. వాటిని ఆమె ఒక్క క్షణము కూడ మరవకుండెను.

"ఇట్లు చాలకాలము గడచిన తరువాత, సత్యవంతుని మరణకాలము సంప్రాప్తమయ్యెను. అంతవరకు సావిత్రి ఒక్కొక్క దినము లెక్కపెట్టుచునేయుండెను. ఆ నాటికి నాల్గవదినమున తన పతికి మరణము కలుగనున్నదని నిశ్చయించుకున్నప్పుడు సావిత్రి మూడు దినములు వ్రతమును బూనెను. ఆ మూడు పగళ్లురాత్రులు నిర్లిప్తయై యుండెను. సావిత్రి యొక్క యీ కఠిన నియమమును విని ద్యుమత్సేనుడు మిక్కిలి దుఃఖించి సావిత్రిని ఓదార్చెను. అప్పుడు వారిద్దరికిని ఇట్లు సంభాషణము జరిగెను.

"ద్యుమ : కుమారీ! నీవు అతి కఠోరవ్రతమును ఆరంభించితివి మూడు దినముల వరకు నిరాహారవై యుండుట చాల దుష్కరమైన కార్యము.

"సావి : తండ్రీ! మీరు చింతించకుడు, నేనీవ్రతమును సంపూర్ణము చేసికొనెదను. వ్రతమును నిర్వహించుటకు దృఢ నిశ్చయమే కారణమగును. కనుక నేను గూడ దృఢనిశ్చయముతోనే దీనిని ఆరంభించితిని.

"ద్యుమ : 'బిడ్డా! నీవు వ్రతమును చాలించుమని నేను ఏ విధముగా గూడ నీకు చెప్పజాలను. నావంటి మనుష్యుడు 'నీవు వ్రతమును నిర్విఘ్నముగా సంపూర్ణము చేయుము' అనియే చెప్పగలడు".

"ఈ విధముగా చెప్పి ద్యుమత్సేనుడు సావిత్రిని ఆ వ్రతము నుడి ఆపక ఊరకుండెను సావిత్రి ఒకచోటనే కట్టెవలె కదలకుండ నిలిచియుండెను. 'రేపే తన పతిదేవుని మృత్యువు జరుగనున్నది' అని తెలిసిన సావిత్రి దుఃఖములో మునిగి అలాగే నిలిచి ఆ రాత్రి గడపెను. తెల్లవారిన తరువాత 'అదియే పతి మరణదిన' మని తలచి, సావిత్రి ప్రాతఃకాలమునందే అన్ని కాలకృత్యములను, ఆహ్నికములను ముగించుకొనెను. అందరు బ్రాహ్మణులకు వృద్ధులకు, అత్తమామలకు యధాతథముగా నమస్కరించి అంజలి బద్ధురాలై నియమపూర్వకముగా వారి యెదుట నిలిచియుండెను. వారందరు సావిత్రి యొక్క సౌమాంగల్యము కొరకు శుభాశీర్వాదములను చేసిరి. వారిచ్చిన సౌమాంగల్యాశీర్వాదమును విని సావిత్రి మనస్సునందు అట్లే యగుగాక అని అనుకొని ఆ యాశీస్సులను శిరసావహించెను. నారదుడు చెప్పిన కాలమును, ముహూర్తమును ఎదిరిచూచుచు, చింతించుచు, దుఃఖితురాలై యుండెను. అప్పుడు ఓంటరిగానున్న యామెతో అత్తమామలు ఇట్లనిరి.

"బిడ్డా! నీవు శాస్త్రోక్తముగా వ్రతమును సంపూర్ణము చేసి కొంటివి. ఇప్పుడు పారణ చేయుటకు సమయమైనది, కనుక, విధిపూర్వకముగా ఆహారమును తీసికొనుము." ఆ మాటకు సావిత్రి "నేడు సూర్యాస్తమానమైన పిదప నా కోరిక సంపూర్ణమగును. అప్పుడే నేను భోజనము చేసెదను. ఇది నా సంకల్పము. అట్లే నేను ప్రతిజ్ఞ చేసితిని." అని అత్తమామలతో ననెను.

"ఇట్లు సావిత్రి మాట్లాడుచుండగానే సత్యవంతుడు గొడ్డలి భుజముపైన బెట్టుకొని అడవికి బయలుదేరెను. అప్పుడు సావిత్రి భర్తతో, "నీవొక్కడవు పోవుటకు వీలులేదు. నేను గూడా నీ వెంటవచ్చెదను. నన్ను నేడు ఒంటరిగా విడిచి యుండుటకు ఇష్టపడను." అని యనెను. ఆ మాటకు సత్యవంతుడు సావిత్రితో "నీ వింతకు పూర్వమెప్పుడుగూడ అడవికి పోలేదు. అడవి మార్గము అతి కఠినము, దుఃఖకరముగా నుండును. మూడుదినములుగా వ్రతోపవాసాదులుచేసి కృశించియున్నావు. కనుక నడవజాలవు" అనియనెను. ఆమాటవిని సావిత్రి "ఉపవాసము వలన నాకు ఏలాటి గాని, కష్టముగాని కలుగలేదు. నీతో అడవికి అలసట పోవుటకు పూర్తిగా ఉత్సాహము నాకుగలదు అందుచేత నన్ను ఆపవద్దు" అని సత్యవంతునితో ననెను. అప్పుడు సత్యవంతుడు "అడవికి పోవుటకు నీకు ఉత్సాహము ఉన్నయెడల నీ ప్రియముగనే చేసెదను. కానినీవు నా తలిదండ్రుల యాజ్ఞను తీసికొని నా వెంటవచ్చిన యెడల, నా పైన దోషము ఉండదు. కనుక అట్లుచేయుము." అని సావిత్రితో ననెను.

"అప్పుడామె, అత్త మామలకు నమస్కరించి వారితో "నా భర్త ఫలములను తెచ్చుటకు అడవికి పోవుచున్నాడు. ఆయనతో పోవుటకు నాకు ఇచ్ఛయున్నది. మీరు అనుజ్ఞ ఈయగలరు. నేడు పతిని విడచి ఒకక్షణమైన నుండజాలను. ఆయన నేడు గురుజనము కొలకు, అగ్ని దేవుని కొరకు పువ్వులు-పండ్లు-సమిధలు మొదలగునవి తెచ్చుటకై అడవికి పోవుచున్నాడు, కనుక ఆయనను ఆపుట తగదు. ఒకవేళ, ఆయన యితర కార్యముల కొరకు అడవికి నేడు పోవుచుండిన యెడల ఆపవచ్చును. నేను ఈ యాశ్రమమునకు వచ్చి కొంచెము తక్కువగా ఒక సంవత్సరమైనది. ఆశ్రమము బయటకు ఎపుడుగూడ పోలేదు. పుష్ప దళ భరితమైన వనమును చూడవలెనని నాకు మిక్కిలి కుతూహలము కలదు." అని యనెను.

అది విని ద్యుమత్సేనుడు మనస్సునందు "సావిత్రి యీ యాశ్రమమునకు వచ్చినప్పటి నుండి అనుచితమైన కోరిక నేటిదాక ఎప్పుడుగూడ కోరి యున్నట్లు నేనెరుగను. కనుక ఈమె కోరిక నేడు నేరవేరుగాక" అని తలచి యామెతో "పుత్రీ! పొమ్ము మార్గమునందు సత్యవంతుని కనిపెట్టుచు జాగ్రత్తతో నుండుము." అనిచెప్పెను.

## రెండు హృదయములు

"అట్లు అత్త మామల చేత అనుజ్ఞవడసి సావిత్రి, మనస్సునందు దుఃఖ పడుచున్నప్పటికి పైకి నవ్వుచున్నట్లు కనపడుచు భర్తతో అడవికి పోయెను. ఆమె విచిత్రములు, రమణీయములు, అంతటా నెమిళ్ల నృత్యముగలవియునగు వనములను చూచి సంతోషించెను. 'నిండు ప్రవాహము గల పుణ్యనదులను. పూచిన వృక్షములను చూడు'మని సత్యవంతుడు సావిత్రితో మధురముగా ననెను. పతివ్రతయైన సావిత్రి భర్తను అన్ని పరిస్థితుల యందును, కనిపెట్టుచుండెను. నారదుని మాటలను తలచు కొనుచు సమయము రాగానే పతికి మరణము అవశ్యముగా కలుగునని నిశ్చయించుకొని యుండెను. మందగ మనముతో నడచుచున్న సావిత్రి తన హృదయమును రెండుగాచేసికొని, ఒక భాగముచేత పతిని అనుసరించుచు, రెండవ భాగముచేత అతని మృత్యు కాలమును ప్రతిక్షణము ఎదురుచూచు చుండెను." ఇట్లుచెప్పి మార్కండేయ మహాముని తరువాతి కథను యుధిష్ఠిర మహారాజునకు ఇట్లు చెప్పసాగెను.

---

దేశభాషలందు తెలుగు లెస్స. మాతృభాషను గౌరవించడం తన్ను తాను గౌరవించుకోవడమే!

---

## మహబూబ్ నగర్ జిల్లాకు వరప్రసాది

# జూరాల ప్రాజెక్టు

మహబూబునగరం జిల్లాలో గద్వాల పట్టణానికి 5 మైళ్ళ దూరంలో కృష్ణానదిపైన జూరాల ప్రాజెక్టును నిర్మిస్తున్నారు. ఈ జిల్లాలో అనావృష్టికి గురిఅవుతున్న గద్వాల, అలంపురం, ఆత్మకూరు, వనపర్తి, కొల్లాపూరు తాలుకాలకు ఈ ప్రాజెక్టు వరప్రసాదం వంటిది. ఈ ప్రాజెక్టువల్ల 17.84 శ. కో. ఘ. అడుగుల నీరు సేద్యానికి లభిస్తుంది. దీనితో 1.05 లక్షల ఎకరాల భూమికి నీటిపారుదల సౌకర్యం లభిస్తుంది. ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు 1974 జూన్ నెలలో ఈ ప్రాజెక్టు పనులకు ప్రారంభోత్సవం జరిపారు.

పూర్వపు హైదరాబాదు ప్రభుత్వం మహబూబునగరం, రాయచూరు, గుల్బర్గా జిల్లాలోని అనావృష్టి ప్రాంతాలకు లాభసాటిగా వుండేందుకై 1930 లో భీమా ప్రాజెక్టు, ఎగువ కృష్ణా ప్రాజెక్టుల పరిశీలనను చేపట్టింది. 1951 లో జరిగిన సమావేశంలో అప్పటి హైదరాబాదు ప్రభుత్వం ఈ రెండు ప్రాజెక్టుల విషయమై పట్టు బట్టింది. అయితే అప్పుడు ఈ ప్రాజెక్టులు మంజూరు కాలేదు.

1956 లో రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణ ఫలితంగా ఈ ప్రాజెక్టుల హెడ్‌వర్కులు, కాలవల ముఖద్వారపు పనులు కర్నాటక రాష్ట్రానికి సంక్రమించాయి. రాయచూరు జిల్లాలో వుండిన గద్వాల అలంపురం తాలుకాలూ మహబూబ్‌నగరం ఆంధ్రప్రదేశ్‌లో చేర్చుకోబడ్డాయి.

### ప్రత్యామ్నాయ ప్రతిపాదన

కనుక ఈ ప్రాంతాల హక్కులను బలపరుస్తూ కృష్ణా జలాల వినియోగానికి సంబంధించి ఏర్పాటుచేయబడిన తీర్పు సంఘం సమక్షంలో ఈ ప్రాజెక్టు నివేదికలు సమర్పించడం జరిగింది. అయితే కర్ణాటక రాష్ట్రం ఈ ప్రాజెక్టుల విషయమై అభ్యంతరం తెలిపింది. ఈ రెండు ప్రాజెక్టులకు సంబంధించిన హెడ్‌వర్కులు, కాలవల ముఖద్వారాలకు సంబంధించిన పనులు కర్నాటక రాష్ట్రంలో నెలకొనివుండడం రాష్ట్రాల పునర్వ్యవస్థీకరణకు ముందుగా ఈ ప్రాజెక్టు పనులు మంజూరుకాకపోవడం, పనులు ఆరంభం కాకపోవడంవల్ల ఈ ప్రాజెక్టు లాభాలను ఆంధ్రప్రదేశ్‌కు విస్తరింపజేయడం కృష్ణా జలాల వివాద తీర్పు సంఘానికి దుస్తరమైంది. ఈ పరిస్థితులలో, గద్వాల అలంపురం తాలుకాలతోపాటు మహబూబునగరం జిల్లాలోని ప్రాంతాలకు నీటిపారుదల సౌకర్యాలు ఏర్పాటు చేయడానికి జూరాల గ్రామంవద్ద కృష్ణానదిపైన ఒక ప్రాజెక్టును నిర్మించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రత్యామ్నాయ ప్రతిపాదనచేసింది.

జూరాల ప్రాజెక్టు రెండు దశలలో ప్రతిపాదించబడింది. మొదటి దశలో 23 శతకోటి ఘనపు అడుగుల జలాలను వినియోగిస్తూ 7.05 లక్షల ఎకరాలకు రెండవ దశలో 27.70 శతకోటి ఘ. అ. జలాలను వినియోగిస్తూ 1.70 లక్షల యెకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించడానికి ప్రతిపాదనలు చేయడం జరిగింది. అయితే కృష్ణా జలాల తీర్పు సంఘం జలాల వినియోగాన్ని 18.74 శతకోటి ఘ. అ. లకు మాత్రమే పరిమితంచేస్తూ 1.05 లక్షల ఎకరాలకు నీటి పారుదల సౌకర్యాలు కల్పించటానికి ప్రాజెక్టు మొదటి దశను మాత్రమే అనుమతించింది.

డామ్‌స్థలం వద్ద 17.84 శతకోటి ఘ. అ. జలాలను వినియోగించు కోవడానికి అవకాశాలు వున్నాయి. అవి రిరూపేణా నష్టమయ్యే జలాలను కూడా కలుపుకొని ఈ అంచెనా వేయబడింది. గద్వాల అలంపురం తాలూకాలోని కుడికాలవ, వనపర్తి, కొల్లాపూరు తాలూకాలోని ఎడమకాలవ వల్ల మొత్తం 1,05,000 ఎకరాల ఆయకట్టు ప్రాంతానికి లాభం చేకూరుతుంది.

ఈ ప్రాజెక్టువల్ల లాభపడే ప్రాంతాలు చిరకాలంగా అనావృష్టికి గురిఅవుతున్న ప్రాంతాలు. ఈ ప్రాజెక్టువల్ల అదనంగా సాలీనా రు.7 కోట్లు విలువచేయు 70,000 టన్నుల ఆహార ధాన్యాలు ఉత్పత్తి అవుతాయి. ప్రాజెక్టు స్థలం వద్ద సంవత్సరంలో కొంత కాలం విద్యుచ్ఛక్తి ఉత్పత్తి చేయడానికి కూడా అవకాశాలు వున్నాయి.

### రెట్టింపు నీటిపారుదల

మన దేశానికి స్వాతంత్ర్యం లభించిన తరువాత మన అపార జలసంపదను సంపూర్ణంగా వినియోగించి నదీజలాలను, సక్రమంగా ఉపయోగంలోకి తీసుకొని వచ్చి మన ప్రజలకు సుఖతర జీవితానికి మార్గం వేయడానికి నీటిపారుదల పనులను సత్వరంగా అభివృద్ధి పరచడం ప్రధాన కర్తవ్యంగా భావించబడింది. కనుకనే పంచవర్ష ప్రణాళిక లన్నింటిలో కూడా నీటిపారుదల పనులకు అత్యంత ప్రాధాన్యత యివ్వడం జరుగుతున్నది. నాల్గవ ప్రణాళిక అంతంనాటికి అంటే 1974 మార్చి నాటికి ఆంధ్రప్రదేశ్‌లో నీటి పారుదల పనులకై రూ. 380 కోట్లు ఖర్చు పెట్టడం జరిగింది. ప్రణాళికకు ముందుకంటే ఇప్పుడు రెట్టింపు ప్రాంతానికి నీటిపారుదల సౌకర్యాలు కల్పించడం జరిగింది.

తుంగభద్ర దిగువ కాలువ, తుంగభద్ర ఎగువ కాలువ, కర్నూలు – కడప కాలవను అభివృద్ధి పరచడం, అనావృష్టి ప్రాంతాల అభివృద్ధికి అలవాలమైన పోచంపాడు ప్రాజెక్టు, నాగార్జున

(తరువాయి 42 వ పేజీలో)

# ప్రగతి పథంలో ఆదిలాబాద్

ఆదిలాబాదు జిల్లా మనరాష్ట్రపు ఉత్తర సరిహద్దులోని వెనుకబడిన జిల్లా. ఇది అటవీ ప్రాంతం. ఈ జిల్లాలో జొన్న, వరి, ప్రత్తి, మొక్కజొన్న, కంది, ప్రొద్దు తిరుగుడు పువ్వు, వేరు శనగ, ఆముదములు ప్రధానముగా పండించ బడుతున్నాయి. గత ఖరీఫ్ కాలములో హెచ్చు దిగుబడి నిచ్చు వంగడములు రసాయనిక ఎరువులు, సస్యరక్షణ మందులు మరియు స్వల్పకాలిక ఋణములు రైతులకు అందజేయబడినవి. ఈకాలములో సంకర రకము హైబ్రీడ్ 4 ప్రతి విశేషముగా వాడబడింది. 1975–76 ఖరీఫ్ కాలములో ఇది ఎక్కువ విస్తీర్ణములో వ్యాప్తి చేయబడు తుంది. జొన్న, కుసుమ, గోధుమ, విత్తనములు పంపిణీ చేయపడు తున్నాయి.

హెచ్చు దిగుబడి వంగడములలో తెల్లహంస, రత్న, I. E. T. 1991, 2913, 2914, 2923, జయ I R 20 ,కాకతీయ, కావేరీ,R P W 6-12, జగన్నాథ్ విత్తనములు 56.565 మెట్రిక్ టన్నులు పంపిణీ చేయబడినవి. 11,867 హెక్టార్లపై వంగడములతో సాగుచేయబడినవి.

రసాయనిక ఎరువులు, విత్తనాల, సస్యరక్షణమందులు వాటికి మొత్తము రు17.5 లక్షలు స్వల్పకాలిక రుణాలు మంజూరు చేశారు. మొత్తం 2130 టన్నుల రసాయనిక ఎరువులు పంపిణీ చేశారు.

## చిన్న తరహా రైతుల అభివృద్ధి ఏజన్సీ

5 వ ప్రణాళికా కాలములో ఆదిలాబాద్ జిల్లాలో చిన్న తరహా రైతుల అభివృద్ధి కొరకు ఒక ఏజన్సీని నియమించుటకు ప్రభుత్వమువారు తలపెట్టినారు. 6 తాలూకాలలో మొత్తము 51897 మంది చిన్నతరహారైతులు ఈ పతకం ద్వారా లాభము పొందె– టట్లు ప్రణాళిక తయారు చేయబడుచున్నది.

మొత్తము 5 సంవత్సరముల కాలములో ఈ పథకము క్రింద 150 లక్షల రూపాయల కేంద్ర సహాయముతో పైన పేర్కొన్న చిన్న తరహా రైతులు వ్యవసాయోత్పత్తి మరియు పాల వుత్పత్తి కార్యక్రమాల ద్వారా లాభము పొందెదరు. ఈ పథకము క్రింద 5 ఎకరాల మెట్ట లేక 2.5 ఎకరాల మాగాణీ కలిగియున్న రైతులు చిన్నతరహా రైతులుగాను మరియు 2.5 ఎకరాల మెట్ట లేక 1.25 ఎకరాల మాగాణి కలిగియున్నరైతులు ఉపాంత్య రైతులుగా నిర్వ– చింపబడినారు.

ఆదిలాబాదు జిల్లాయందు 5 భారీ పరిశ్రమలు కలవు ఇవి (1) సిర్పూర్ పేపర్ మిల్స్ : కాగజ్‌నగర్ (2) సిర్‌సిల్క్ మిల్స్ : కాగజ్ నగర్ (3) సింగరేణి బొగ్గు గనులు : బెల్లంపెల్లి (4) సిమెంటు ఫ్యాక్టరీ : మంచిర్యాల (5) నటరాజ్ స్పిన్నింగ్ మిల్స్ : నిర్మల్ ఇవి కాక ఆదిలాబాద్‌లో భారత సిమెంట్ కార్పొరేషన్ యాజమాన్యాన 18 కోట్ల ఖర్చుతో రోజుకు 1500 టన్నుల సిమెంటు ఉత్పత్తి చేయగల ఒక సిమెంటు ఫ్యాక్టరీని, మరియు సహకారం రంగములో ఒక స్పిన్నింగ్ మిల్లును నెల కొల్పుటకు ప్రయత్నము జరుగుచున్నది. ఈ భారీ పరిశ్రమలు కాక ఈ జిల్లాలో 35 జిన్నింగ్ ఫ్యాక్టరీలు, 20 సిమెంటు పరికరములు చేయు పరిశ్రమలు, గూనలు చేయు పరిశ్రమలు, 6 మిల్లులు, 5 సబ్బు పరిశ్రమలు, 4 ఖండసారి చక్కెర ఫ్యాక్టరీలు కూడ కలవు, పెన్‌గంగా ఆయిల్ మిల్స్ అను పేర ప్రత్తిగింజల నుండి నూనె తీయు ఫ్యాక్టరీ ఒకటి కలదు. స్వయం ఉపాధి పథకము క్రింద 88 మంది విద్యావంతులైన నిరుద్యోగులకు ఋణములివ్వ బడినవి. నిర్మల్ చేతి పనుల పరిశ్రమ ఈ జిల్లాకు ప్రత్యేక ఆకర్షణ.

ఇంతవరకు ఈ జిల్లాలో 452 గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయబడినది. క్రొత్తగా క్లస్టర్ స్కీములు ముధోల్, చెన్నూర్, సిర్పూర్, ఆసిఫాబాద్, ఉట్నూరు, వాంకిడి ముధోల్ మరియు లక్సెట్టిపేటలకు మంజూరు చేయబడినవి. దీని వలన ఎక్కువ గ్రామాలకు విద్యుచ్ఛక్తి లభించు అవకాశము కలిగినది.

ఆదిలాబాద్ జిల్లాలో ఇండ్లులేని పేద రైతులకు ఇండ్ల స్థలములను కేటాయించుటకు కేంద్ర ప్రభుత్వమువారు 90,37, 100/– రూపాయలు ఖర్చు కాగల బృహత్పథకమును సిద్ధము చేసినారు. ప్రతి కుటుంబమునకు 201 చదరపు గజముల చొప్పున లేక 21 కుటుంబములకు ఒక ఎకరము చొప్పున స్థలము కేటాయించ బడును. రోడ్లు, మురికి నీటి కాలువలు, వీలైతే మంచినీటి బావులు ప్రభుత్వము నిర్మించగా గృహములను వ్యక్తులు నిర్మించుకొన్న వలసియుండును. ఇందుకుగాను 1973–74లో 22, 59, 280/– రూపాయలు కేంద్ర ప్రభుత్వము విడుదల చేసినది ప్రస్తుతము ఈ కార్యక్రమము అదిలాబాద్, ఖానాపూరు మరియు చెన్నూరు బ్లాకులలో చేపట్టబడినది.

ఈ జిల్లాయందలి హరిజన అ ప్రకటిత గిరిజన జాతులవారికి ఇండ్ల స్థలాల కేటాయింపునకై 1974-75 లో వరుసగా 1,50,000/– 75,000/– 26,1006/– రూపాయలు రాష్ట్ర ప్రభుత్వము మంజూరు చేసినది. ఇంతవరకు 330 మంది హరిజనులకు 35 మంది ప్రకటిత గిరిజన జాతులవారికి ఇండ్ల స్థలములు కేటాయించబడినవి. ఇవికాక మురికినీటి కాలువలు, మరుగు దొడ్లకు 15,5600/– రూపాయలు మరియు రహదారులు స్మశానవాటికలకు 2,860/– రూపాయలు కేటాయింపబడినవి. వీటిలో మురికినీటి కాలువలు, మరుగుదొడ్ల నిర్మాణముకొరకు 5,210/– రూపాయలు 11 సమితు లకు ఖర్చుచేయు నిమిత్తము పంపిణీ చేయడమైనది. మంచినీటిబావుల కొరకు కేటాయించబడిన డబ్బులో నుండి 11,500/– రూపాయలు



ఆదిలాబాదు జిల్లా కలెక్టర్ శ్రీ ఆర్. కె. గోనెల్ల అటవీశాఖ అధికారుల అత్యుత్తమకృషికి నగదు బహుమతులు అంద జేశారు.

ఆదిలాబాద్, చెన్నూరు మరియు ఖానాపూరు సమితులకు ఖర్చుచేయు నిమిత్తము పంపిణీ చేయడమైనది. జిల్లా పరిషత్తు తీర్మానము ప్రకారము బిగ్గులు పోజాలని గ్రామములలో ప్రతి రెవిన్యూ డివిజన్ నుండి ఒక గ్రామము ఎన్నుకొనబడినది.

## హరిజన, గిరిజన గృహనిర్మాణ సహకారసంఘం

ఈ సహకార సంఘముద్వారా 2652 గృహముల నిర్మాణము (11) బ్లాకులలోని 85 కాలనీలలో చేపట్టబడినది. ఒక్కొక్క గృహమునకు 1800/- రూపాయలు ఖర్చుఅగును. ఇంతవరకు 2277 ఇండ్ల నిర్మాణము పూర్తియైనది. 1217 గృహములు ఆక్రమింపబడినవి.

## విద్యా సౌకర్యములు

ఈ జిల్లాలోని 18 హరిజన విద్యార్థి వసతి గృహములలో 600 సీట్లు ఉండెను. ఈ సంవత్సరము మరి 324 సీట్లు మంజూరు చేయబడినవి. ప్రస్తుతము మొత్తము 924 మందికి వసతి కలదు. వెనుకబడిన తరగతులవారికి 5 వసతి గృహములు నిర్వహింపబడు చున్నవి. వాటిలో 231 సీట్లు కలవు.

30 సీట్లుగల హరిజన కాలేజి విద్యార్థినుల వసతి గృహము ఆదిలాబాద్ జిల్లాకు మంజూరు అయినది ఈ వసతిగృహ నిర్మాణమునకు ఒక లక్ష రూపాయలు సాంఘిక సంక్షేమ శాఖ డైరెక్టర్ సమకూర్చినారు. ఆదిలాబాద్, మన్నూర్, ఇచ్చోడ, ఆసిఫాబాద్ చెన్నూరు, లక్సెట్టిపేట, ఉట్నూరు, ముథోల్ మరియు భైంసాలలో హాస్టళ్ళకు భవనములు కలవు. ఆదిలాబాద్ (కాలేజీ హాస్టల్), బాసర్ మరియు నర్సాపూర్ హాస్టళ్ళ భవన నిర్మాణము చురుకుగా సాగుచున్నది. తుబీర్, ఖానాపూర్, తపాల్పూర్, ఇందరవెల్లి మరియు కాగజ్‌నగర్ హాస్టళ్ళ భవన నిర్మాణము త్వరలో ప్రారంభింపబడును. ఈ భవనముల కొరకు స్పెషల్ తెలంగాణా డెవలప్‌మెంట్ స్కీము నుండి మరియు జిల్లా పరిషత్తు, సమితుల నుండి నిధులు లభించినవి.

కళాశాల విద్యార్థి వేతనములకుగాను ఆర్థికముగా వెనుకబడిన వారికి 45,000/- రూపాయలు. వెనుకబడిన తరగతులవారికి 1,10,000/- రూపాయలు హరిజన క్రైస్తవులకు 11,500/- రూపాయలు కేటాయింపబడినవి. అందులోనుండి రూపాయలు 1318-93 193 వెనుకబడిన విద్యార్థులకు మరియు 1,951-00 రూపాయలు ఎనిమిది మంది క్రైస్తవ విద్యార్థులకు ఉపకార వేతనముల క్రింద ఇవ్వబడినవి. ఈ ఉపకార వేతనములు ఇంటర్ తరగతుల వారికి ఏడాదికి 80-50 రూ. ల చొప్పున, డిగ్రీ కోర్సుల వారికి ఏడాదికి రూపాయలు 121-50 పైసల చొప్పున ఇవ్వబడనున్నవి. ఇంతవరకు పాతవారికి మాత్రము ఇవ్వబడినవి. కొత్తగా దరఖాస్తులు పెట్టుకొనిన వారికి నవంబరులో ఇవ్వబడును.

## గిరిజన సంక్షేమము

గిరిజనుల కొరకు రూ. 32,334/- 18 వసతి గృహములు అప్రకటిత గిరిజన జాతుల కొరకు రూ. 5376/- ఖర్చుతో రెండు వసతి గృహములు నిర్వహింపబడుచున్నవి ఇవిగాక 35 ఆశ్రమ విద్యాలయములు రూ. 1278,419/- ఖర్చుతో నిర్వహింపబడు చున్నవి. ఇందు ఉచిత విద్యా వసతి భోజన సౌకర్యములు ఒక్కొక్కదానిలో 50 మందికి కలగజేయబడినవి. రూ. 93,495/- ఖర్చుతో మూడు ఆశ్రమ విద్యాలయాలు 180 మందికి సరిపడునట్లుగా నెలకొల్పబడనున్నవి. కొలది దినములలో ఈ ఆశ్రమ విద్యాలయాలలో వసతి సౌకర్యము ఇంకా వందమందికి కలుగజేయబడును.

## మహిళా శిశు సంక్షేమము

ఆదిలాబాద్ జిల్లాలో 2 బాల సదనములు, 3 మహిళా శిశు సంక్షేమ కేంద్రములు, ఒక దుస్తులు తయారుచేయు కేంద్రము 3 కృషి సెంటర్లు, ఒక బాలవిహార్ కేంద్రము నిర్వహింపబడు చున్నవి.

## సహకార రంగము

ఈ జిల్లాలో వ్యవసాయమునకు వ్యవసాయాభివృద్ధికి కావలసిన పరపతిని ఆదిలాబాదుజిల్లా కేంద్ర సహకార బ్యాంకు వారు రూ. 217 లక్షలు, భూమి తనఖా బ్యాంకువారు రూ. 186 లక్షలు పంపిణీ జేసినారు. ప్రజల సౌకర్యము కొరకై ఆదిలాబాదు జిల్లా మార్కెటింగు సొసైటీ వారు 2 రైస్ మిల్లులను లక్సెట్టిపేట మార్కెటింగ్ సొసైటి వారు ఒక రైసు మిల్లును స్థాపించినారు. గృహ నిర్మాణములకు దీర్ఘకాలపు అప్పులు మంజూరు చేయుటకై 17 సంఘములను స్థాపించి రూ. 499 లక్షలు పంపిణీ జేయడమైనది.

బలహీన వర్గములవారికి ఇతోధిక ఉపాధి కల్పించుటకై జిల్లాలో 10 సహకార సమిష్టి వ్యవసాయ సంఘములు స్థాపించి రూ. 4 92 లక్షల రూపాయలు మంజూరు చేయబడినవి.

జిల్లా స్థాయిలో హరిజన సేవా సహకార సంఘమును స్థాపించి రాష్ట్రస్థాయి సంఘముద్వారా వాటా ధనము రు. 13200/- సమకూర్చుటకే స్టేటుబ్యాంకు ఆఫ్ హైద్రాబాదు ఆదిలాబాదు బ్రాంచి ద్వారా రూ. 52,800/- లు అప్పు మంజూరు చేసినారు. యీ మొత్తము గొఱ్ఱెల పెంపకమునకు హరిజనులకు పంపిణీ చేయబడును.

## ఆరుసూత్రాల పథకం : ఆదిలాబాద్ జిల్లా

షట్సూత్ర పథకం క్రింద వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి 78.16 లక్షల రూపాయల కేంద్ర సహాయం ఆదిలాబాద్ జిల్లాకు లభించింది. ఈ నిధులతో దిగువ చూపబడిన పథకాలను చేపట్టుటకు ప్రభుత్వము వారికి నివేదించబడినది.

| పథకము పేరు | రూపాయలు (లక్షలలో) |
|---|---|
| (1) చిన్న నీటిపారుదల | 31 88 |
| (2) గ్రామీణ విద్యుద్దీకరణ | 20.40 |
| (3) పరిశ్రమలు | 9.10 |
| (4) గ్రామీణ నీటి సరఫరా | 5.00 |
| (5) పశు సంరక్షణ-వైద్యము | 1.78 |
| (6) పాల ఉత్పత్తి కేంద్రము | 3 00 |
| (7) సహకార పథకాలు | 2.50 |
| (8) మత్స్య వృత్తుల వికాసము | 1.40 |
| (9) వ్యవసాయము | 1 35 |
| (10) ఆర్థిక సహాయ కార్యక్రమములు (వెనుకబడిన జాతులకు) | 1.25 |
| (11) అటవీ పెంపకము | 0.50 |
| మొత్తము | 78.16 |

## జూరాల ప్రాజెక్టు

( 39 వ పేజీ నుండి )

సాగరు ప్రాజెక్టు, వెనుకబడిన ప్రాంతాలు, గిరిజన ప్రాంతాల అభివృద్ధికి దోహదం కలిగించే వంశధార ప్రాజెక్టు అతో ప్రధానమైన ప్రాజెక్టులు.

ఇప్పుడు మన రాష్ట్రంలో మొత్తం 33 లక్షల హెక్టార్ల భూమికి నీటిపారుదల సౌకర్యాలు వున్నాయి. అంతే కాకుండా తుంగభద్ర ప్రాజెక్టు, నాగార్జున సాగరు డాము, మాచ్‌ఖండ్ రిజర్వాయరు, పూర్తికావడం వల్ల తుంగభద్ర దిగువ కాలువ కర్నూలు-కడప కాల్వ, కృష్ణా, గోదావరి డెల్టా ప్రాంతాలలో రెండవ పంటకు సౌకర్యాలు కల్పించటం వల్ల ఆదనంగా 4 లక్షల హెక్టార్ల భూమికి నీటిపారుదల ఏర్పాట్లు చేయడం జరిగింది. ఇవన్నీ మనం గర్వించదగిన ఘన విజయాలు. అయితే ఆంధ్ర ప్రదేశ్‌లో లభ్యమవుతున్న ఉపరితల జలాలను పరిపూర్ణంగా వినియోగించడానికి ఇంకా ఎంతో కృషి జరుగ వలసివుంది.

# చిరంజీవి

— తిరునగరి

నిన్ను పొడుచుకున్న
కనుపించని కారుచీకటిలో
కాంతి కిరణ మొక్కటిచాలు
కళ్ళల్లో ఆశా జ్యోతులు వెల్గించటానికి
కర్తవ్య పథాన్ని నిర్దేశించటానికి

పాలమూరు మండలాన
ఇటికాలపాడు కుగ్రామాన
ప్రభవించిన మార్తాండం
ప్రతాపరెడ్డి సురవరం

ఆనాటి నిజాం పాలనాంధకారంలో
ఆంధ్రత్వాన్నే గుర్తించని తెలుగు జన లో
సంస్కృతీ బీజాలు నాటినవాడు
జాతినంతా మేల్కొల్ప సమకట్టినవాడు
మా ప్రతాపరెడ్డి సురవరం
అతని సేవకు నోచుకోబట్టే నగరం భాగ్యనగరం

అయ్యా రెడ్డిగారూ!
ప్రథమాంధ్ర మహాసభ
జోగిపేటలో జరిగిననాడు
ఆసభాధ్యక్షులై తెలంగాణంలో
ఆంధ్ర భాషా సంస్కృతీ వికాసం కావాలని
అనర్గళంగా మీరుపన్యసించిన నాడు
ఎంత చైతన్యం జాలువారిందని!!
ఎంతటి ఉద్వేగం జాతిలో పొంగులెత్తిందని!!

గోలకొండ పత్రికను స్థాపించి
కొండంత బాధ్యతను శిరసావహించి
తెలంగాణాన్ని మీ సాహితీహలంతో దున్ని
తెలుగుదనాన్ని పండించారు
సాహితీ నందనాలంతటా నాటి
శతకోటి కవికోకిలల నాహ్వానించారు

ఇవన్నీ మీరు వెలిగించిన కవితా దీపాలు
ఇవన్నీ మీరు నీరు పోసిన సాహితీ నందనాలు
భాగ్యనగరం నిండా మీ స్మృత్యంకాలే
తెలంగాణంనిండా మీ అడుగుజాడలే

ఆంధ్ర భాషానిలయాలు
గ్రంథ భాండాగారాలు
శాసనసభా భవనాలు
ఆకాశవాణి కేంద్రాలు

అందుకే ప్రతాపరెడ్డిగారూ!
అంతటా మీరు కనిపిస్తున్నారు
ఆంధ్రుల సాంఘికచరిత్ర, పథాలలో
హిందువుల పండుగల, సంరంభాలలో
హైందవ ధర్మవీరుల, ప్రసంగాలలో
వెంకట్రామారెడ్డి, స్తూపంలోపలి జ్ఞాపకాలలో

ప్రతాపరెడ్డిగారూ! మీరున్నారు
ప్రతినిత్యం మమ్మల్ని పలుకరిస్తూనే ఉన్నారు
చరిత్రకారులు, మనీషులకు మరణం లేదంటారు
అందుకే ధరిత్రి ఉన్నంతకాలం మీరుంటారు.

(కీ. శే. సురవరం ప్రతాపరెడ్డి స్మృత్యర్థం)

---

చైతన్యమూర్తుల అడుగుజాడలు భావిభాగ్యోదయానికి దగ్గర దారులు.

---

# న్యాయపతి నారాయణమూర్తి



పట్టు ఏడేళ్ల కుర్రవాడు. అక్షరాలు వ్రాయడం అప్పుడే నేర్చుకొన్నాడు. బయలుదేరటం బడికి వెళ్లాలనే! కాని ఊళ్లో ఎక్కడవిన్నా 'వందేమాతరం' నినాదాలు, చెవులు గింగురుమంటున్నాయి. హృదయాలు ఆవేశంతో పొంగిపోతున్నాయి. ఈ కుర్రవాని మనస్సు అలాగే ఉద్రిక్తమైంది బడికి వెళ్లడం మాని సరాసరి యింటికివచ్చాడు జేబులో సీమసున్నం ముక్కవుంది. దానితో గోడమీద 'వందేమాతరం' అని వ్రాశాడు. పదిమార్లు 'వందేమాతరం' అని కేకలు పెట్టాడు. మనస్సు కొంచెం శాంతించింది.

కాని వీధి వెంటపోయే పోలీసులు ఆ దృశ్యం చూశారు. ఇంట్లో చొరబడ్డారు. సోదా చేశారు అక్కడితో వూరుకోలేదు. పదిహేనురోజులు ఆ ఇంటి చుట్టూ పోలీసుల కాపలా. ఏడేళ్ల కుర్రవాని ఉత్సాహానికి పోలీసులు అంత ఇబ్బందిపడవలసి వచ్చింది. ఆ సంఘటన జరిగింది బరంపురంలో ఆ కుర్రవాడు ప్రఖ్యాత పత్రికా సంపాదకులుగా, ప్రముఖ కాంగ్రెసు నాయకులుగా పేరుపొందిన స్వర్గీయ న్యాయపతి నారాయణమూర్తిగారు

## అందుగల డింభు లేదను...

మూర్తిగారు 1897లో బరంపురంలో జన్మించారు తండ్రి రామానుజస్వామిగారు పేరుపొందిన వకీలు. అయిదవ జార్జి పట్టాభిషేక సందర్భంగా లండన్ వెళ్లారీయన ఆ ప్రాంతం నుంచి సీమ ప్రయాణంచేసిన ప్రథమాంధ్రుడు రామానుజస్వామిగారు ఈయనగారు చిన్నప్పటినుంచీ సిసింద్రీ అని వేరే చెప్పనక్కరలేదు గదా!

స్కూల్లో వక్తృత్వపు బహుమానాలన్నీ ఆయనవే! విద్యార్థినాయకత్వం ఆయనదే! రాజకీయాలలో జోక్యం కల్పించుకొనేవాం పేరు చెప్పాలంటే ముందుపేరు ఆయనదే! మళ్లీ కళారంగంలోకి తొంగిచూస్తే నాటకాలలో ప్రముఖపాత్ర ఆయనదే! కాలేజీ గిరీశంగా పేరుమోగిన ఖ్యాతి ఆయనదే! మాగజైనులో రాజకీయాలమీద నిప్పులవ్వలు చెరిగిపోసే కలం ఆయనదే అన్ని రంగాలలోనూ మూర్తిగారు విద్యార్థి దశలోనే నాంది గీతాలు వినిపించారు.

ఇన్నిరకాల ఆలోచనలుండటం వల్ల పట్టుమని చదువనూ లేదు పట్టాకోసం శ్రమపడనూలేదు. బి.ఎ చదువు పూర్తి అయినా పట్టభద్రుడు కావడం ఇష్టంలేక—మహాత్ముని సహాయనిరాకరణోద్యమాన్ని పురస్కరించుకొని—దాన్ని తిరస్కరించారు. 1921 సహాయ నిరాకరణోద్యమంలో చేరారు. అదే వారి రాజకీయ జీవితానికి ప్రారంభదశ. మూర్తిగారి కానాడు, శ్రీ వరాహగిరి జోగయ్య పంతులు, వారి కుమారులు శ్రీ వేంకటగిరి సహచరులు.

## ఆంధ్రవాణి నుంచి జైభారత్ వరకూ

రాజకీయాలలో వేడిని వ్రాతలో వెలిగ్రక్కడంవల్ల కొంత శాంతీ, తృప్తీ వుంటాయి. ఎంతగా తెగించి ముందడుగు వేసినా, ఎన్ని గంభీరోపన్యాసాలు చేసినా, మిన్ను ముట్టేట్లు ఎన్ని నినాదాలు చేసినా—అణగని క్రోధాన్ని అక్షర రూపంలో చిత్రించి ప్రజానీకానికి అందించడంలో ఎంతో త్యాగం, దేశసేవా దాగివుంటాయి. ఆ ఆశయంతోనే నారాయణమూర్తిగారు తొలితగా "ఆంధ్రవాణి" పత్రిక స్థాపించి సంపాదకత్వం వహించారు. ఆ కలం ఎలా పరుగులు వేసిందో, దేశభక్తినెలా నూరిపోసిందో, దమననీతి

శ్రీ రావూరు వెంకట సత్యనారాయణరావు

పాల్పడిన బ్రిటిష్ ప్రభుత్వంపైన ఎలా కత్తులు నూరిందో—చెప్పనక్కర లేదుగదా! అప్పటి నుంచీ ఆంధ్రప్రభ ప్రప్రథమ సంపాదకత్వం వహించేంత వరకూ ఆయన గారి కలం అలా పరుగులు తీస్తూనేవుంది దివంగతులయ్యే ముందు జైభారత్ పత్రికా సంపాదకత్వంలో వున్నారాయన. సంపాదకత్వ హోదాలోనే మూర్తిగారు స్వర్గమలంకరించారు.

ఆ నాటి సంపాదకత్వ హోదాకు వెంటనే సన్మానాలు జరిగేవి. పట్టుమని పది సంపాదకీయాలు వ్రాశారోలేదో ప్రభుత్వం వారు శ్రీకృష్ణ జన్మస్థానానికి ఆహ్వానించి అఖండ సన్మానం చేశారు. మళ్లీ మరునాటి 'సన్మానం' దానితో మూర్తిగారిపేరు వాడవాడలా ప్రాకిపోయింది అటు పత్రికా రచయితగా, ఇటు ప్రముఖ రాజకీయ నాయకులుగా నారాయణమూర్తిగారు ఆంధ్రదేశంలో అందరికీ

పరిచయమయ్యారు. బ్రిటిషువారి అతిథుల జాబితాలో పెద్ద అక్షరాలలో వ్రాసుకోబడ్డారు. ఆయనపేరు మహాత్ముని వరకూ ప్రాకింది. ఆయన ఆశీస్సులు అందజేశారు.

## కళింగకు ఏకైక నాయకుడు

1931లో మళ్ళా అరెస్టు. మళ్ళీ అఖండ సన్మానం! ఆయన సందేశంకోసం ప్రజలు ఉత్సాహంతో, ఉద్రేకంతో ఎదురుచూశారు. ఆయన అంతేవాసులుగా చేరేవారు. మా 'రాజకీయ గురువు' అని ఎంతమందో చెప్పుకొని గర్వపడేవారు. మూర్తిగారు మరణించినప్పుడు సంతాప ప్రకటనచేస్తూ ప్రఖ్యాత నాయకులు శ్రీ గౌతు లచ్చన్నగారిలా వ్రాశారు "నన్ను రాజకీయాలలో ప్రవేశపెట్టి, నన్నింతవానిగా చేసిన నా గురువైన శ్రీ నారాయణమూర్తిగారి నిర్యాణం నేనెలా భరించగలను! ఇలాటి అనుయాయులెందరో అలనాడు తలఎత్తారు. 'కళింగకు ఏకైక' నాయకుడనిపించు 'జై భారత్' పత్రిక పేర్కొంది.

నారాయణమూర్తిగారు ప్రాంతీయ నాయకత్వం నుంచి రాష్ట్రీ నాయకత్వంలోకి, అక్కడ నుంచి దేశ నాయకత్వంలోకి ప్రవేశించారు. 1924 నుంచి 1935 వరకూ మూర్తిగారు అ. భా. కాం. కమిటీ సభ్యులుగా వున్నారు. ఇందులో నాలుగు సంవత్సరాలు ఈ కమిటీ కార్యదర్శిగా వున్నారు. పదవీ నిర్వహణ కోసం మూర్తిగారు మకాం మద్రాసు మార్చారు. మరి వారి కలం నిద్ర పోతుందా!...వుంటనే 'వాహిని' పత్రిక సంపాదకులయ్యారు. మరి రెండు సంవత్సరాల తర్వాత "ప్రభాతం" అనేవార పత్రిక స్థాపించారు. ఆ పత్రిక కొద్దిరోజులు నడిపిన తర్వాత "ఆంధ్రప్రభ" దిన పత్రిక స్థాపించడం మూర్తిగారిని సంపాదకులుగా ఆహ్వానించడం జరిగింది. నారాయణమూర్తిగారి ప్రతిభ ఆంధ్ర దేశం నాలుగు దిక్కులా వ్యాపించింది. నిర్భయంగా వ్రాసిన సంపాదకీయాలు—అఖండ కీర్తిని అందించాయి. ఆంధ్రప్రభలో వారు నడిపిన "పాన్ సుపారీ" శీర్షిక ఎంతగానో ప్రజల నాకర్షించింది. ఆంధ్రప్రభ సంపాదకత్వం నుంచి విరమించుకొన్న తర్వాత "విజయప్రభ"కు అటుపిమ్మట "జై భారత్"కు సంపాదకత్వం వహించారు. న్యాయపతివారు దేశానికి న్యాయాన్ని సంపాదించి అందించిన సంపాదకులుగా పేర్కొనబడ్డారు.

పత్రికా ప్రపంచంలో జేరి కాంగ్రెసు సేవను ఎంతమాత్రం విస్మరించని దేశభక్తుడు మూర్తిగారు.

మూర్తిగారు 1945లో సెంట్రల్ అసెంబ్లీ సభ్యులయ్యారు. ఈ విజయం వర్ణించదగింది. నారాయణమూర్తిగారి పలుకుబడి తెలిసినాకూడా స్వార్థంతో మరియిద్దరు—పట్టాభిరెడ్డి, కృష్ణచౌదరి అనేవారు కాంగ్రెసు టిక్కెట్టుమీదనే పోటీచేశారు. డిపాజిట్లు పోగొట్టుకొన్నారు. ఇలాటి పోటీ ఎన్నడూ జరగలేదని కాంగ్రెసు బులెటిన్ ప్రకటించింది. అంతకన్నా గౌరవం ఏం కావాలి? కాంగ్రెసు సభ్యుడుగా భారత వ్యాప్తంగా నారాయణమూర్తిగారి పేరు ప్రాకింది. 1947 వరకూ వారాపదవినలంకరించారు. దేశానికి తగినంత సేవచేశారు.

నారాయణమూర్తిగారు ఫిలిం లోకంలో కూడా అడుగు పెట్టారు. 1939 నుంచి రెండు సంవత్సరాలు ఫిలిం సెన్సారు బోర్డు మెంబరుగా వున్నారు. వారికి ఫిలిం వ్యాపారంలో పెద్దలకు చాలామందికి పరిచయమైంది. చిత్తూరు నాగయ్యగారు నారాయణమూర్తిగారిని ప్రోత్సహించి, వారి నిగ్రహాన్నీ, తీవినీ పురస్కరించుకొని త్యాగయ్య చిత్రంలో రాజు పాత్ర ధరించమని కోరారు. మూర్తిగారు అంగీకరించారు. కాని మనస్సంతా రాజకీయాలమీదనే వుండడంవల్ల బయటకువచ్చి మళ్ళీ పత్రికా సంపాదకత్వం వహించారు.

మూర్తిగారు 1917లో బరంపురంలో న్యాయవాదులుగావున్న శ్రీ గాదె రాఘవరావుగారి కుమార్తె శ్రీమతి సీతమ్మగారిని వివాహ మాడారు. వీరికి ఆరుగురు సంతానం. ముగ్గురు పుత్రికలు—ముగ్గురు పుత్రులు...దోసపాదువంటి సంసారం. నారాయణమూర్తిగారు—ఆదర్శ దేశ సేవకుడుగానేకాక, ఆదర్శ గృహస్తుడుగా కూడా పేరు సంపాదించారు. కలిమిలేముల్ని ఒకేరీతిగా పాటించగలిగిన ప్రతిభావంతుడాయన. ఈ విషయాన్ని గురించి "ఆంధ్రప్రభ" సంపాదకులు శ్రీ నార్ల వెంకటేశ్వరరావుగారిలా వ్రాశారు.

నారాయణమూర్తిగారి వ్యక్తిత్వంలో నన్ను ఎక్కువగా సమ్మోహితుని చేసినట్టిది ఆయన నిత్యానందం. ఎంత పెద్ద చిక్కువచ్చినా—ఎన్నెన్ని చిక్కులు చుట్టుకొన్నా — ఒక్క క్షణం కంటె ఆయన వదనం మ్లానమయ్యేది కాదు...ఆయన ఆస్పత్రికి వెడుతూ ఆప్యాయంగా నన్ను పలకరించి క్షణంలోకూడా ఆయన ముఖంలో సంతోషం తాండవిస్తూనేవుంది. ఆయన "ఆప్టిమిజం" లో నూరోవంతైనా నాకువుంటే నేను మరింత పటిమతో జీవిత సమస్యలను ఎదుర్కొ గలుగుతాను.

నారాయణమూర్తిగారిని గురించి కళా వెంకటరావుగారు వ్రాసిన వాక్యాలు "1945లో నారాయణమూర్తి కేంద్ర శాసన సభకు నిలిచినప్పుడు అతని ఎన్నికకు ఆస్తి "జోలిసంచియే"! ధనవంతుల కుటుంబంలో జన్మించిన అతడు ఏనాడూ "ఉన్నదని, లేనిదని" విచారించలేదు. వందలాది నియోజక వర్గాలతోపాటు ఆ నియోజక వర్గంగూర్చి ఏర్పాట్లమాట అడిగితే ఫక్కున నవ్వేవాడు. ఆ త్యాగమూర్తిని వోటర్లే అన్ని బాధ్యతలు వహించి ఎన్నుకొన్నారు. నారాయణమూర్తికి ప్రియతమమైనవి రెండు—ఆంధ్రరాష్ట్రం, మసాలా కిల్లీ. వీరులకుద్వేగము కల్పించు వ్రాతగాడు. ఉత్తమ శ్రేణికి చెందిన దేశభక్తుడు."

నారాయణమూర్తిగారు గొంతులో కాన్సర్ వ్యాధివల్ల 1954లో పరమపదించారు. వ్యాధితోకూడా పత్రిక నడిపిన ప్రతిభాశాలి. తెలుగు పత్రిక ప్రపంచ చరిత్రలో నారాయణమూర్తిగారి పేరు చిరస్థాయిగా నిలుస్తుంది. శ్రీమతి పి. మల్లేశ్వరి వ్రాసినట్లు

"పాత్రికేయ గగనములో
ప్రభవించిన ప్రగతి తార
మందాకిని మలుపులోన
మరు లేరింది"




# ఆంధ్రప్రదేశ్ యాత్ర

[రచయిత్రి :– కమలవాసిని బి.యస్.సి.,డి.ఐ.యస్.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య ఎకాడమీ బహుమతి పొందిన పుస్తకము

వెల : రెండు రూపాయలు; పేజీలు : 64.

ప్రతులకు : ఆంద్ర శేషగిరిరావు,

ముక్కామల

వయా తణుకు,

పశ్చిమగోదావరి జిల్లా,

ఆంధ్రప్రదేశ్.]

ప్రతీ సంవత్సరము బాలబాలికలు తమతమ పాఠశాలలనుంచి ఏదో ఒక రకమైన విజ్ఞానయాత్ర చేస్తూంటారు. విజ్ఞాన యాత్రకు ఎన్నుకునే స్థలాలు చాలా కొద్దిమాత్రమే ఉన్నట్లు అనిపిస్తుంది. కాని రచయిత్రి కమలవాసినిగారు వ్రాసిన "ఆంధ్ర ప్రదేశ్ యాత్ర" చదివిన తరువాత అబ్బా! మన ఆంధ్రప్రదేశంలో ప్రతి ఊరు ఏదో ఒక రకంగా ప్రాశస్త్యాన్ని పొందినదే! తప్పక ఇక్కడికి వెళాలి!......అక్కడికి వెళ్లాలి! అంటూ అనిపిస్తుంది. రచయిత్రి కేవలం యీ పుస్తకం ఒక యాత్రల సమీక్ష క్రింద కాకుండా ఒక పరిశోధనావ్యాసంలా వ్రాశారు. ఇందులో రచయిత్రి ఆంధ్రప్రదేశ్‌లోని ఇరవైఒక్క జిల్లాల్లోని ముఖ్యమైన ప్రదేశాల వైశిష్ట్యాన్ని, ప్రాశస్త్యాన్ని స్థల పురాణాలతో...పిల్లలకు అర్థమయ్యే కథలు, వింత వింత సామెతలు, నానుడులతో చక్కగా వివరించారు. పుస్తకం చదువుతుంటే మనం నిజంగా ప్రయాణం చేస్తూ ఆ ప్రదేశాలన్నీ చూస్తూన్నట్లే అనుభవిస్తాం. ప్రయాణం బస్సు, రైలు, పడవా, బండి, కాలినడకలతో సాగుతుంది.

రచయిత్రి బాలబాలికల విజ్ఞానయాత్ర శ్రీకాకుళం జిల్లా బారువాతో ప్రారంభించి ఆంధ్రప్రదేశ్ రాజధాని అయిన హైదరాబాద్‌తో ముగించి "కథ కంచికి, మనం యింటికి" అన్నట్లు ఎవర్ని వాళ్ల యింటికి పంపిస్తారు. ఈ పుస్తకం చదివిన తరువాత "సీ నేపిల్స్ అండ్ డై!" అన్నట్లు "సీ ఆంధ్ర ప్రదేశ్ అండ్ డై!" అని పిస్తుంది.

రచయిత్రి ఆ ప్రదేశాల్లోని దేవాలయాలు, దేవుళ్ల కథలే కాకుండా రాజకీయ, సాంఘిక, భౌగోళిక, సాంస్కృతిక వివరాలన్నీ చక్కగా వివరించారు. ఉదాహరణకి కొన్నింటిని చూడండి.

శ్రీకాకుళం జిల్లా శ్రీకూర్మం, కూర్మావతారానికి పూజలందించే గుడి. గోడలనిండా శిల్పచిత్రాలే నట! దానినిబట్టి శ్రీకూర్మం అనే సామెత ఏర్పడిందట. శ్రీ కూర్మం సముద్రానికి ఒకమైలు దూరంలోవుంది.

విశాఖపట్నం విమానయాన సౌకర్యాలుగల ఆంధ్రప్రదేశ్‌లోని మూడు పట్టణాల్లో ఒకటి. విశాఖపట్టణంలో భాగమయిన వాల్తేరు, బ్రిటిషువారి కాలం నుంచీ ఆరోగ్య దృష్ట్యా "బ్రిటన్ ఆఫ్ ది ఈస్ట్" అనే ఖ్యాతి పొందింది. ఈ ఊరికి పేరుతెచ్చిన పరిశ్రమ దంతపు పరిశ్రమ.

తూర్పుగోదావరిజిల్లా సామర్లకోట మన పంచారామల్లో ఒకటి. ఆ ఆలయంలోని ఉయ్యాల మంటపం రాతితో నిర్మించినా ఆ మంటపం ఉయ్యాలలా ఊగుతుంది. ఒక దొర ఇది ఏకశిలది అంటే నమ్మలేదట. తుపాకీతో చివర పేల్చి చూశాడట. ఒక పెల్ల రాలిందట. ఏక రాతిదే అని ఒప్పుకొని వెళ్లిపోయాడట!

పశ్చిమ గోదావరి జిల్లా నర్సాపురం మంచి రేవుగా ఉండేది. పూర్వకాలంలో వలందులు ఉపయోగించినరేవు అన్నమాట. ఇప్పుడు నర్సాపురం లేసు, అల్లికలకుప్రశస్తి చెందింది.

కృష్ణాజిల్లా విజయవాడ (బెజవాడ) రేడియో కేంద్రం. తెలుగువారి పెద్ద పత్రికలన్నీ యిక్కడే ఉన్నాయి. దుర్గకొండ పేరు ఇంద్ర కీలాద్రి, ప్రక్కది గాంధీ పర్వతం, ఉండవల్లి గుహలకు ప్రయాణం లాంచీలమీదే హాయిగా ఉంటుంది.

గుంటూరుజిల్లా మంగళగిరి పానకాలస్వామి ఇచ్చిన పానకంలో సగమే పుచ్చుకుంటాడట. అక్కడి బెల్లపు పానకానికి చీమలుపట్టవుట.

ప్రకాశంజిల్లా ఒంగోలు అన్నది వంగవోలు అపభ్రంశమై ఉంటుంది. కవిత్రయంలో ఎఱ్ఱాప్రగడ ఆశ్రయం పొందిన అద్దంకి యిక్కడికి సమీపం.

నెల్లూరు కవిత్రయంలోని తిక్కనఊరు పెన్నఒడ్డున వల్లెకొండ. రంగనాయకస్వామి గుడికి ప్రసిద్ధము. పెన్నదాటితే పెరుమాళ్ల సేవ. చిత్తూరులో దిగువ తిరుపతిలో ఉన్నత విద్యకు పతకం చూపే పలు శాఖల విశ్వవిద్యాలయం ఉంది. అన్న తెచ్చిన సారెలో కరివేపాకు లేనందున స్వామి పెళ్లాం పద్మావతిని వదిలేశాడట. అనంతపురంజిల్లా లేపాక్షి నాగేంద్ర విగ్రహం చూడతగ్గదే. రావణుని ఢీకొనిన జటాయువును అనునయిస్తూ ఇక్కడ రాముడు "లే! పక్షీ!" అన్నాడట. లే! పక్షీ! అన్నదే లేపాక్షి అయిందట.

కడప పసుపు వర్తకానికి ప్రసిద్ధిచెందినది. ఈ ఊరిని "నెక్‌నామా" అనే వారట. పాత కడప దేవుని కడపగా ప్రసిద్ధము.

కర్నూలుజిల్లా శ్రీశైలం శిఖరం చూచినవారికి పునర్జన్మ లేదట. ఆ మల్లికార్జునస్వామిని చేతితో స్పృశించి తలను లింగానికి తాకి అభివాదం చేయడం ఇక్కడి పద్ధతి.

మహబూబ్‌నగర్ జిల్లాలో మహబూబ్‌నగరం మన్నెంకొండకు పది పన్నెండు మైళ్లు. పూర్వం దీని పేరు పాదమూరు. ఇది సీతాఫలపు చెట్లకేకాదు మఱ్ఱిచెట్టుకు కూడ ప్రసిద్ధి. అల్లాఉద్దీన్ ఖిల్జీ దక్షిణదేశయాత్రలో అతని సైనికులు ఐదువేల మందికి ఇది ఆశ్రయమిచ్చిందట.

నాగార్జునసాగర్, ప్రాజెక్టువల్ల ఏర్పడిన సాగరానికి నాగార్జునునిపేరు పెట్టారు. ఈ సాగరానికి పేరిచ్చిన నాగార్జునుని విగ్రహాన్ని చీనీదేశపు కళాకారుడు మనకు బహూకరించాడు.

ఖమ్మంజిల్లా భద్రాద్రి భద్రాచలం రోడ్డులో బస్సు ఎక్కుతూంటే గోదావరి వంతెన దాటి చేరుకుంటాం. దేవతావిగ్రహాలు అరణ్యంలో ఉండగా పోకలదమ్మక్క అనే ఆమె కనుగొని తెప్పించి చిన్న దేవాలయం నిర్మించిందట. తాడిపండు నైవేద్యం పెట్టేదట.

వరంగల్‌జిల్లా వరంగల్ అనేది ఓరుగల్లు అపభ్రంశం. హనుమకొండ, ఓరుగల్లు, ఖాజీపేట ఒకే వూరు. ఓరుగల్లుకు దక్షిణంగా పదిమైళ్ళలో అయినవోలు మైలారుదేవుని విగ్రహం ఉగ్రంగా, భయంకరంగా ఉంటుంది.

కరీంనగర్‌జిల్లా వేములవాడ వెడితే యమలోకం లేదంటారు ధర్మకుండం కోనేటిమెట్లు రాజరాజనరేంద్రుడు కట్టించాడట.

ఆదిలాబాద్‌జిల్లా నిర్మల్ బొమ్మలు ప్రపంచ ప్రఖ్యాతములైనవి. పులికుంట వెమ్మలనాయుడు తన పేర స్థాపించిన ఊరు నిమ్మల. కాలక్రమాన నిర్మల అయింది.

నిజామాబాద్‌జిల్లా నిజామాబాద్ ప్రాచీనమైన పట్టణం. జైనుల క్షేత్రం. బీడీ ఆకుల పరిశ్రమ ఎక్కువ. ఇక్కడ నుండి వెంకటేశ్వర స్వామి జండా ఏటేటా తిరుపతికి తీసుకువెడతారు.

మెదక్ జిల్లా సంగారెడ్డి కేంద్ర కార్యస్థానము. రెండువందల సంవత్సరాలకు పూర్వం సదాశివరెడ్డి అనే ఆసామి ఈ సావరానికి చుట్టూ ఒకగోడ కట్టి జనావళికి రక్షణ కల్పించి ఆ గ్రామానికి తన కొడుకుపేరు ఉంచాడు.

హైదరాబాద్‌జిల్లా చార్‌మినార్, లాడ్‌బజార్, హుస్సేన్ సాగర్, అడిక్‌మెట్టు, చేకుహల్లా, ఫలక్‌నామా, ఉస్మాన్, హిమాయత్‌సాగర్, సాలార్‌జంగ్ మ్యూజియం, మీర్‌ఆలమ్ చెఱువు, రామచంద్రపురం, గోలుకొండ ప్రఖ్యాతి గాంచినవి.

ఈ విధంగా ఏంతో చక్కగా వివరంగా వ్రాసిన ఈపుస్తకం ప్రతిఒక్కరూ చదవటమే కాకుండా, ఒక్కొక్క ప్రతి కొని తమ దగ్గర ఉంచుకోతగది. పైగా యీ పుస్తకాన్ని యితర భాషల్లోకి అనువదించడం అవసరం

చివరగా ఈ పుస్తకం చివర అందర్నీ ఆకర్షించేది పాఠకుల గ్రహణ గుణపాటవ పరీక్ష.

రచయిత్రి ఎంతో శ్రమించి వ్రాసిన ఈ పుస్తకం ఎంతైనా విలువైనది.

- శ్రీ మద్దిపట్ల వెంకట్రావు

---

## ఈ సంచికలో రచయితలు

శ్రీయుతులు

యస్. ఓబుల్ రెడ్డి, గవర్నరు, ఆంధ్రప్రదేశ్

పిడతల రంగారెడ్డి, ఆర్థిక, సమాచార శాఖ మంత్రి

బుకలాపు లక్ష్మణదాసు, పంచాయతీరాజ్ శాఖ మంత్రి

భాట్టం శ్రీరామమూర్తి, సాంఘిక సంక్షేమ శాఖ మంత్రి

జె. బాపురెడ్డి, 8-3-224, యూసఫ్‌గూడా, హైదరాబాద్

రావూరు వెంకట సత్యనారాయణరావు, 3-4-813, బర్కత్‌పురా, హైదరాబాద్

తిరుమల రామచంద్ర, 69, ఆదర్శనగర్, హైదరాబాద్

కె. సభా, శారదాపీఠం, చిత్తూరు

తిరునగరి, కవితా సదనం, పోచమ్మవాడ, (వయా) ఆలేరు,

రావిపాటి మహానంద, చంద్రశేఖరపురం, కనిగిరి తాలూకా, ప్రకాశం జిల్లా

మునునూరు శివరామకృష్ణారావు, బి-23, ఎఫ్-1, విజయనగర్ కాలనీ, హైదరాబాద్

జి. కల్యాణసింగ్, మండీగల్లీ, పత్థర్ గట్టి, హైదరాబాద్

కేశిరాజు వెంకటరమణారావు, గవరవరం, కొవ్వూరు తాలూకా, ప. గో. జిల్లా

ఎ. పండరినాథ్, టీచర్, జిల్లా పరిషద్ ఉన్నత పాఠశాల, ఇబ్రహీంపట్నం

కప్పగంతుల లక్ష్మణశాస్త్రి, 69, ఆదర్శనగర్, హైదరాబాద్

వై. వి. వెంకటరత్నం, పి.ఆర్.ఓ., సమాచార కేంద్రం, విశాఖపట్నం

ఎస్. ఆర్. కోటేశ్వర శర్మ, డివిజనల్ ఆఫీసు, ఎల్. ఐ. సి. ఆఫ్ ఇండియా, హైదరాబాద్-4

డా. అక్కిరాజు రమాపతిరావు, తెలుగు అకాడమీ, హిమాయత్ నగర్, హైదరాబాద్

కె. ఆర్. కె. మోహన్, జూబిలీ పోస్టాఫీస్, హైదారాబాద్-2

మద్దిపట్ల వెంకటరావు, వైస్ ప్రిన్సిపాల్, 5-2-70, జాంబాగ్, హైదరాబాద్

# మరుగు పడిన తెలుగు వీరుడు

# పలనాటి హనుమంతు

"దేశ గర్వము దీప్తి చెందగ
దేశ చరితము తేజరిల్లగ
దేశ మరసిన ధీర పురుషుల
తెలిసి పాడర తమ్ముడా ! "

అనే ప్రఖ్యాత ఆధునిక ఆంధ్రకవి శ్రీ రాయప్రోలు వెంకట సుబ్బారావుగారి గానంలో యెంతో నిండుదనం నృత్యం చేస్తున్నది. ధీరత్వం, త్యాగశీలత, నిజత్వం, కార్యతత్పరతలు కదను త్రొక్కుతున్నాయి. ఈ కవి యిలా గానం చేయగలిగాడంటే మన దేశచరిత్ర పుటలే నిదర్శనాలవుతున్నాయి. అవే ఉత్తేజకారకాలై వీరత్వాన్ని నూరిపోస్తున్నాయి. గతాన్ని స్మృతికి తెస్తున్నాయి. మనల్ని మనల్నిగా గుర్తింపజేస్తున్నాయి.

మన తెలుగు జాతికి గతంలో గంభీరమైన చరిత్ర వుంది. స్వాతంత్ర్య సమరాంగణంలో, విదేశీయుల్ని పారద్రోలే పవిత్ర యజ్ఞంలో, లెక్కకుమించిన తెలుగు వీరులు అసువులు బాసారు. స్వాతంత్ర్యం ప్రతి ప్రాణికి జన్మహక్కు. ప్రాణంకన్నా స్వాతంత్ర్యం ప్రియమైంది. ఒక జాతి మరొక జాతిని హింసించి, వారి పద ఘట్టాలక్రింద నలిపి నాశనం చేయాలని తలిస్తే, ఆ జాతి సమరం చేయడం సహజం. స్వాతంత్ర్య పరిరక్షణం కోసం అనేక త్యాగాలు చేయడంకూడా అత్యవసరం. అటువంటి త్యాగమూర్తులు మన తెలుగుదేశంలో కోకొల్లలు. వారి పవిత్రాదర్శాల వల్ల మనం నేర్చుకోవాల్సింది చాలావుంది. తన దేశంకోసం, తన ప్రజల రక్షణకోసం ఆంగ్లేయులపై మహత్తర సహాయ నిరాకరణ మహోద్యమం జరిపి, ఆ పవిత్ర ఉద్యమంలో ప్రాణత్యాగం చేసిన పల్నాటి హనుమంతు చరిత్ర ప్రతి తెలుగువానికే గాక, స్వాతంత్ర్య ప్రియులందరకూ ఆదర్శప్రాయమైనదే.

పల్నాటి హనుమంతు కన్నెగంటి వంశానికి చెందినవాడు. ఈతడు ఆంధ్రప్రదేశ్‌లోని గుంటూరు జిల్లానందలి పశ్చిమ ప్రాంతమగు పల్నాడు తాలూకాలోని మించాలపాడు వాసి. పలనాడు అనగానే ప్రతి తెలుగువాని హృదయం వీరత్వంతో ఉప్పొంగిపోతుంది. బాలచంద్రుని సమర పటిమ గుర్తుకువచ్చి, దేహం గగుర్పాటు పొందుతుంది. రాజులు అస్తమించినా, రత్న సింహాసనాలు మటుమాయమైనా, పట్టణాలు కాలగర్భంలో కలిసి పోయినాకూడా, ఒకనాడు వీర రక్తంతో తడిసిన యుద్ధభూములు, సాహిత్యంలో నిలిచిపోయిన వీరగాథలు, కళలు విరిగిన శిథిల శిల్పాల మధుర గాథలను జ్ఞప్తికి తెచ్చేది పల్నాటి సీమ, మాంచాల త్యాగానికి గర్వించని తెలుగు పడుచుగాని, బాలచంద్రుని పరాక్రమం విని ఉప్పొంగని తెలుగు బిడ్డడుగాని తెలుగు గడ్డనే లేరనిచెప్పాలి. బాలచంద్రుని కత్తి కడిగిన గంగ పలనాడులో నేటికీ ప్రవహిస్తూనే వుంది. అటువంటి సీమలో పుట్టి, బాలచంద్రుని వీరత్వపు బడిలో పాఠాలు నేర్చినవాడు మన పలనాటి హనుమంతు.

## సహాయ నిరాకరణోద్యమం

ఈ శతాబ్దంలోని రెండవ దశాబ్దంలో మన దేశంలోని రాజకీయ పరిస్థితులు అతిక్లిష్ట రూపాన్ని పొందాయి. 1914లో ప్రారంభమైన ప్రథమ ప్రపంచ సంగ్రామంలో ఆంగ్ల ప్రభుత్వం యిరుక్కొంది. అటువంటి క్లిష్ట సమయంలో రక్షణ చట్టాన్ని పెట్టి ఆంగ్ల ప్రభుత్వం మన దేశంలోని మొదటి విప్లవోద్యమాల్ని, స్వాతంత్ర్య సమరాల్ని అణచివేస్తూవుంది. యుద్ధానంతరం దేశానికి స్వాతంత్ర్యమిస్తామని మభ్యపెడుతూకూడా వచ్చింది. యుద్ధంలో ఆంగ్ల ప్రభుత్వం విజయం పొందింది. సామ్రాజ్యవాదుల సహజలక్షణం ప్రకారం భారత దేశానికి స్వాతంత్ర్యం యివ్వకపోగా, భారత ప్రజలపై కబంధ హస్తాలుచింది. యుద్ధకాలంలో వేలకొలది భారతవీరులు అసువులు బాయటమేకాక, కరువు వాతకు, అంటు వ్యాధులకు, గురై ఆంగ్లేయుల ఆర్థిక దోపిడీ విధానానికి కోటిన్నర పైగా భారతీయులు మరణం చెందారు. పంజాబు నందు జలియన్ వాలాబాగ్‌లో 1919 ఏప్రిల్ 13న శాంతియుతంగా జరిగే సభపై జనరల్ డయ్యర్ దాడి చేసి 379 మంది భారతీయుల్ని తుపాకీలకు ఎరజేశాడు. గాయపడ్డ వారి సంఖ్య అనేకం. ఆనాడు తుపాకీకాల్పులు దేశంలో నిత్యకృత్యమైనవి. 1920 లో సెప్టెంబరు మాసంలో కలకత్తాలో సమావేశమై భారతనాయకులు సహాయ నిరాకరణోద్యమానికి పిలుపు యిచ్చారు. అదేసమయంలో బెంగాలు నందు పన్నుల నిరాకరణోద్యమం ప్రారంభమైంది. వేలకొలది దేశభక్తులు జైళ్పాలైనారు.

శ్రీ ఎస్. ఆర్. కోటేశ్వర శర్మ

ఆ మహత్తర మహోద్యమ శంఖారావం ఆంధ్రదేశం అన్ని ప్రాంతాలలోనూ మ్రోగింది. ఆనాడు తెలుగువారు చూపిన ఐక్యత, త్యాగం, పౌరుషం, చెప్పుకోదగ్గవి. తెలుగువారి ఉద్యమ శంఖారావాలు తెలుగు నాడేగాక ఆనాడు యావద్భారతంలో మారు మ్రోగాయి. తెలుగు ప్రజలత్యాగాల గాథలు దేశం నాలుగు చెరగులా వినిపించాయి. పలనాటివీరత్వానికి తగినట్టుగా, దేశంలో జరుగుతున్న పన్నుల నిరాకరణోద్యమంలో, సహాయనిరాకరణోద్యమంలో పలనాటి ప్రజలు ముందుకు వురికారు. వారి నాయకుడు పలనాటి హనుమంతు.

పలనాడు ప్రాంతం క్షేత్రానికి పెట్టింది పేరైనా, ఒకనాడు రతనాల సీమగా ఖ్యాతిగాంచినా, నైసర్గికంగా వెనుకబడ్డ ప్రాంతం. 1920 నాటి పరిస్థితి మరింత అధ్వాన్నమైనది. నీటి వనరులు చాలా తక్కువ, మెట్ట పంటలు ప్రకృతికరుణిస్తే పండుతాయి. లేకపోతే లేదు. బీదరైతాంగం, వ్యవసాయ కూలీలు! అధికంగా పండినా, పండక పోయినా ప్రజలు శిస్తులు కట్టకతప్పదు. గ్రామాధికారులకు బ్రిటీషు పోలీసు బలగం అండ వుంది. వారి దౌర్జన్యకాండకు అంతులేదు. పన్నులు చెల్లించడంకోసం పాడి, పంట, చివరకుకొంప, గోడు అమ్ముకోవాల్సి వచ్చేది ప్రజకు. బాగా బ్రతికిన రైతులు బిక్షువులయ్యారు. ఆంగ్లపాలనలో పన్నులుగాక ప్రభుత్వాధికారులకు మామూళ్ళు అనేకం యివ్వాల్సివస్తూ వుండేది. అధికార్లు బలవంతంగా తమ పశువుల మేతను కాజేసే వారు. పాలు, పెరుగు, నెయ్యి మొదలగునవి లంచంగా యివ్వడం జరుగుతూండేది. ఒకవిధంగా ఆనాటిరైతులు నిలువు దోపిడీ చేయబడేవారు. జనకీర్ణమైన ప్రాంతాల్ని బీడుప్రదేశాలు కావించారు. ఆనాడు బ్రిటీషు అధికార్ల దమనకాండకు అంతూ, పొంతూ, లేకుండా పోయింది.

## పరదేశానికి దళారులు

పరదేశీయులకు దళారులుగా దేశీయులకు రాబందుల్లా పని చేసే వారిలో మించాలపాడు సమీపగ్రామమైన కోరుకుట్ల గ్రామం కరణం ఒకడు. జిత్తులమారి తనంలో అతనికి అతడే సాటి. ఆ పరిసరప్రాంత గ్రామాల్ని దోచుకోవడం తన జన్మహక్కని విర్రవీగేవాడు. అతని దోపిడీ విధానానికి తిలోదకాలు పల్కిస్తానని హనుమంతు ప్రతినబూనాడు. ప్రజల దయనీయ పరిస్థితికి చలించిపోయాడు. చుట్టుప్రక్కల గ్రామాల ప్రజలతో సమావేశాలు జరిపాడు. వారందర్నీ సంఘటితం చేశాడు. ఆంగ్లేయులపై ఆందోళన జరపాలని ఆదేశమొసంగాడు. ఆంగ్లేయులకు గులాముల్లా పనిచేసే గ్రామాధికారుల ముఖాలు పట్టుకొని "పరదేశీయులగు బ్రిటిషు బేహార్లకు వూడిగంచేసి, దేశీయసోదరులను దోచుకొనే దానికంటే, భిక్షాపాత్రను చేతబూనడం చాలా పరువైన పని," అని హనుమంతు ఎగతాళిచేస్తూ వుండేవాడు.

అంతే! పలనాటి సీమలో సహాయ నిరాకరణోద్యమం ఆరంభమైంది. ప్రజలు అంతవరకు భయపడ్తూ అధికార్లకు యిచ్చేమామూళ్లు మానివేశారు. దేశీయులు ఆంగ్ల అధికార్ల యిండ్లలోపనిచేయడం ఆపుచేశారు. ఆనాటికే గుంటూరుజిల్లా నందలి పెదనంది పాడు శిస్తు నిరాకరణోద్యమం యావద్భారతదేశంలో అగ్గిలా, సుగంధంలా వ్యాపించింది. అటుతర్వాత పల్నాటి సీమలోని మంచాలపాడు ప్రాంతం. 1921 జనవరికల్లా పల్నాడంతా సహాయనిరాకరణోద్యమం తీవ్రరూపం దాల్చింది. హనుమంతు మంచాలపాడును ఉద్యమ కేంద్రంగా మార్చాడు.

ఉద్యమ స్వరూపంచూసి ఆంగ్లేయులకు, వారి క్రింద పని చేసే దేశీయాధికారులకు గంగ వెర్రులెత్తాయి. హనుమంతు నాయకత్వం క్రింద ప్రజలు పన్నులు కట్టడం మానేశారు. అధికార్లకు కనీసం మంచినీరు యిచ్చేవాళ్లు లేకుండాపోయారు. వారేస్వయంగా నీరు తోడుకుని తాగే గతి పట్టించారు దేశభక్తులు. రజకులు వారి దుస్తులు శుభ్రంచేయుట మానేశారు. నాయీబ్రాహ్మణులు క్షవరం చేయుట ఆపివేశారు. ప్రభుత్వాధికారికి ఒక వూరినుండి మరొక వూరికి దారిచెప్పమన్నా చెప్పేవారు కాదు ప్రజలు. ఆ ప్రజాఉద్యమం సంపూర్ణంగా, అవక తవకలులేక కొనసాగింది. మతులుపోయిన గ్రామాధికారుల విన్నపాలకు ప్రభుత్వం రూథర్ ఫర్డ్ అనే ప్రత్యేక కలెక్టరును సర్వాధికారాలతో పల్నాటి ప్రాంతానికి పంపింది.

నాగరికులమని చాటుకునే ఆంగ్లేయులు ఆ నాడు పల్నాటి సీమలో రూథర్ ఫర్ ఆధ్వర్యంలో అమాయక ప్రజలపై కావించిన హత్యాచారాలకు అవధులులేకుండా పోయాయి. శాంతియుతంగా, హక్కుల పరిరక్షణం కోసం సాగే అప్పటి ఉద్యమాన్ని అణచడానికి ఆంగేయులు పన్నిన కుటిలనీతి కర్థం లేకుండా పోయింది. అశ్వదళం తుపాకీలతో పలనాడునందు దిగుమతి చేయబడింది. కనపడిన ప్రజలను చావగొట్టారు. దొరికిన స్త్రీలను మిలటరీ చెరిచింది. అప్పుడు వారు కావించిన ఘోర కృత్యాలను ఈ ప్రాంత ప్రజలు నేటికీ విషాద గాథలుగా చెప్పుకుంటారు. గ్రామాలను తగులబెట్టింది. మధ్యయుగ కర్కశ దండయాంత్రికుల బృందాల్లా ఉన్నా బాధలు భరిస్తూ హనుమంతు నాయకత్వం క్రింద ప్రజలు నిలబడివున్నారు. హనుమంతు ధైర్యం సడలక ఉద్యమాన్ని కొనసాగిస్తూనే వున్నాడు. ఒక గ్రామం లొంగిపోయిందంటే, మరొక గ్రామంలొంగి పోయిందనే అసత్య ప్రచారాలు ఆంగ్ల ప్రభుత్వం కావించింది. కాని అవన్నీ తప్పుడు వార్తలని గ్రహించిన ప్రజాపటిమ చావలేదు. ఎన్ని పైశాచిక కృత్యాలకూ లొంగకపోతే, దోపిడీ విధానంతో వేలకొలది రూపాయలు గ్రామ గ్రామాన ప్రభుత్వం వసూలుచేయ ప్రారంభించింది. కాని విప్లవ శిబిరమగు మించాలపాడులో ఆంగ్ల సైన్యం అడుగుపెట్టలేక పోయింది. ప్రజల మనోబలంతోపాటు ప్రకృతిసిద్ధమైన రక్షణ ఈ గ్రామానికుంది. ఇది పర్వత ప్రరివృతమైన గ్రామం. దాదాపు 150 వేలగడ పదాకా వుంటాయి. ప్రజలు వూపిరి వున్నంత వరకు పోరాడదామనే మనోస్థైర్యంతో వున్నారు. హనుమంతు, మొదలుపెట్టిన ఉద్యమాన్ని వదిలేసి, నమ్ముకున్న ప్రజకు మోసంచేసి, భీరువులా ప్రవర్తించదల్చుకొనలేదు. "శిస్తుల నిరాకరణోద్యమం ప్రారంభించాం. ప్రభుత్వం పైశాచిక కృత్యాలకు భయపడి లొంగిపోయేది లేదు. మనం అనుకున్న కొంతమంది నాయకులు మనల్ని మోసం చేసినా, మనకాళ్లమీద మనం నిలబడి ఉద్యమం కొన

సాగిద్దాం." అని గంభీరంగా పల్కాడు హనుమంతు. ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని మించాలపాడు వాగులా వూరిలోకి వురకలు వేయించాడు.

క్రుట్రలకు ప్రతిరూపమైన రూథర్‌ఫర్డ్ ముదుకూరుపై సైనికచర్య జరిపి, ఆ గ్రామాన్ని లొంగదీయదల్చాడు. ఈ గ్రామం మించాలపాడుకు దగ్గరలోనే గలదు. కుయుక్తుల ప్రతిబింబమైన కోలుకుట్ల కరణం రూథర్‌ఫర్డు నిర్ణయాన్ని ఆపి, మించాలపాడుపై దాడిచేయడం అవసరమని సలహా నొసంగాడు. లేనిపోని వెన్నో హనుమంతుపై కల్పించి, కలెక్టరు మనస్సును విరిచివేశాడు. ఇతడు చిన్నతరహా జయచంద్రుడు అనడంలో అతిశయోక్తి లేదు. ఇంకేం, అగ్నికి వాయువు తోడైంది, మించాలపాడును దగ్ధం చేయడానికి. బ్రిటీషు కలెక్టరు ఎత్తుగడ వేసి, సంప్రదింపుల ద్వారా హనుమంతును లొంగదీసుకోవాలని, కరణాన్ని మొదటగా మించాలపాడు పంపాడు. "గ్రామప్రవేశంకు అనర్హుడవని" కరణాన్ని హనుమంతు హెచ్చరించాడు. గ్రామంలో అడుగుపెట్టే ధైర్యం లేని కరణం వూరివెలపల కలసిన నలుగురైదుగురు రైతులకు నక్కజిత్తుల వయనం వలకబోస్తూ హనుమంతుని కబురు పెట్టి, కల్సుకోమన్నాడు. కొద్దిపేపు గడచిన తదుపరి వూరి వెలపల కరణం హనుమంతులకు మధ్య చిన్న సంభాషణ జరిగింది. "ఈ చుట్టుప్రక్కల గల నాలుగైదు గ్రామాలను ఎస్టేటుగా చేసి, దాని అధికారం నీకు అప్పగించాలని ప్రభుత్వం నిర్ణయించింది. దీనికి మారుగా మీవద్ద వున్నంత ధనాన్ని, కొద్ది అయినా సరే శిస్తుక్రింద యివ్వండి. బ్రిటీషు అధికారులతో అనవసర ఘర్షణ ఎందుకు?" అని కరణం బోధించాడు హనుమంతుకు.

దాంతో హనుమంతు కోపం మేరలు మీరిపోయింది. అతని నేత్రాలు రక్తకాంతిని ధరించాయి. "శిస్తులు కట్టం. నేనెన్నటికీ లోబడను. పదవికోసం నేను పడుపువృత్తి చేయను. ప్రజలే నా ప్రాణం. వాళ్లను స్వార్థంకోసం నట్టేట ముంచను. ఈ ఉద్యమం కొనసాగుతుంది. స్వాతంత్ర్య సమర రథం ఆగదు. జాగ్రత్తా!" అని సింహంలా హనుమంతు గర్జించాడు. బ్రిటీషు అధికార్లు శిస్తు చెల్లించమని హనుమంతుని అడుగగా, గ్రామం తరపున పూర్తిగా నిరాకరించాడు. అతణ్ణి లొంగదీయడానికి అధికార్లు వేసిన ఎత్తులన్నీ విఫలమయ్యాయి. హనుమంతుని కీర్తించారు. దువ్వారు. భయపెట్టారు. కాని అవన్నీ నిష్ప్రయోజనమయ్యాయి ఆ త్యాగమూర్తి ముందు. హనుమంతు ఎవ్వరికీ లొంగలేదు.

అంతే_మరునాడు ఆదివారం. పైగా శివరాత్రి కూడా. పోలీసులు, మిలిటరీవారు శాంతియుత సహాయ నిరాకరణోద్యమం చేసే మించాలపాడు ప్రజపై తుపాకులు కాల్చడం మొదలుపెట్టారు. వూరిబయట బావినీరుకై వెళ్ళిన రైతులను నానా చిత్రహింసలకు గురి చేశారు. ప్రజల్లో సహనం చచ్చిపోయింది. గ్రామవాసులు కొండలు ఎక్కి మిలిటరీ వాళ్లపై రాళ్లవాన కురిపించసాగారు. అదొక ముమ్మరమైన పోరాటం. ఒకరిది దురాగతం, మరొకరిది ఆత్మరక్షణ. అది సమర రూపం దాల్చేలా వుంది. తీవ్రచర్య అవసరమని మిలిటరీ అధికారులు గగ్గోలు పెడుతున్నారు. ఊళ్లోకి మిలటరీ వెళ్తే ప్రజకూడా యుద్ధం చేసే స్థితిలో వుంది.

సబ్ ఇనస్పెక్టరు, కరణం కలసి మరొక ఎత్తుగడ వేశారు. మిలటరీ అధికారులకు నచ్చజెప్పి, వాళ్లిద్దరు పోలీసుల్ని రక్షగా తీసుకొని గ్రామంలోకి వెళ్లారు. వచ్చిన ఈ నక్కజిత్తుల వారిపై చేయి చేసుకొనబోతే హనుమంతు వారించాడు. మాట్లాడటం కోసం వచ్చినవారు శత్రువులైనా హాని చేయకూడదనే ధర్మపథం అనుసరించాడు హనుమంతు. "బ్రిటిషువాళ్లు దుర్మార్గాలు చేయబోతే నేనే ఆపాను. ప్రస్తుతం రాజీ ఉత్తమం. నీవు వచ్చి, ఒక్కసారి అధికార్లతో మాట్లాడితే చాలు. అనవసరమైన ప్రజానష్టం ఆపు చేయమని" శాంతి వచనాలు పఠిబోధించాడు కరణం హనుమంతుకు.

కరణం నైజం తెలిసివున్నా, ఆ పరిస్థితుల్లో అతని మాటల్ని రైతులుకూడా నమ్మారు. అధికార్లతో సంప్రదింపులకు హనుమంతు సిద్ధమయ్యాడు. వూరి ప్రక్కన వాగు, వాగు ఒడ్డున పోలీసులు, మిలిటరీ, ఆంగ్ల అధికారులు, వారిమధ్య కరణం వున్నాడు. గ్రామం నుండి హనుమంతు బయలుదేరాడు. కొంతమంది అనుచరులు వస్తామన్నా వారించాడు. అతనిది దిటువైన గుండె, నిండైన విగ్రహం. వూరి వెలుపలికి చేరాడు. మెరక ప్రదేశం మీదుగా వాగు ఒడ్డున వున్న మిలటరీ శిబిరంవైపు నడుస్తున్నాడు. అతని విగ్రహాన్ని చూచి చలించిపోయారు శత్రుపక్షం వారు. హనుమంతు ఆజానుబాహుడేకాదు, విశాలమైన వక్షస్థలంగల వ్యక్తి. పలనాటి చరిత్ర వీరుల రూపును స్మృతికితెచ్చే బెబ్బులి క్షాత్రం అతనిది. హనుమంతుకు కోరమీసం, తలపాగ మరింకానిండుదనాన్ని కూర్చాయి. దూరంగా అతని అనుచరులున్నారు. మెరక ప్రాంతం దిగి వాగులోకి చేరగానే, ఆంగ్ల శిబిరం దాపున పడుతున్నది. అతని రూపం చూసిన ఆంగ్లేయులు, హనుమంతు సంప్రదింపులకులొంగే వ్యక్తి కాదనో, మరేదుష్టబుద్ధితోనో కాల్చివేశారు. మొదటి తుపాకి గుండు హనుమంతు యొక్క డొక్క కుడి భాగాన్ని చీల్చివేసింది. "అరే ద్రోహం చేస్తారా! పిరికి పందల్లారా" అని హనుమంతు కేకవేసే సమయం కల్లా, మరో తుపాకి గుండు అతని భుజంలో దూసుకుపోయింది. కరీంద్రం కుప్పలా కూలిపోయింది, ఎండిపోయిన వాగులో. తమ నాయకునకు జరిగిన విపత్తును పసిగట్టిన అనుచరులు పోలీసులపై, మిలటరీవాళ్లపై శిలావర్షం కురిపించారు. పెద్ద పెద్ద బండలు శత్రుమూకలపై దొర్లాయి. ఆంగ్ల సైనికులు వెర్రెత్తిన వారిలా అన్నివైపులా తుపాకులు కాల్చారు. భౌగోళికంగా ఆ గ్రామ వాసులకు ఆ ప్రాంతం అనుకూలమైంది కావున, ఎవ్వరూ వారి తుపాకి గుళ్లకు చనిపోలేదు గురితప్పిన గుళ్ల దెబ్బలకు దాదాపు పన్నెండు మంది దాకా స్వాతంత్ర్య యోధులు గాయపడ్డారు. శత్రుపక్షపు సైనికులు పెక్కుమందికి బండల దెబ్బలతో తీవ్రమైన గాయాలు తగిలాయి. ఒక మిలటరీ వాడు అవి చచ్చాడు. విషమించిన పరిస్థితిని గ్రహించిన ప్రజలు కొండల్లోకి పారిపోయి రక్షణ పొందారు.

హనుమంతు ఆరాత్రంతా తగిలిన రెండు తుపాకి గుళ్లకు బాధపడి, అసువులు బాశాడు. అతని మరణానంతరం, పోలీసు దళంలోవున్న దేశాభిమానంగల కొంతమంది పోలీసులు కళ్లారా గాంచిన విషాదకర దృశ్యాల్ని ప్రజలకు చెప్పడం జరిగింది. రూథర్‌ఫర్డ్, అతని ముఖ్యానుచరులైన ఆంగ్ల అధికారులు

## హనుమంతు వాగు

వర్తించినతీరు మానవతకే తలవంపు కలగజేస్తుంది. "దాహం దాహం" అని రాత్రంతా బాధపడ్తూనే వున్నాడట హనుమంతు. పచ్చి మంచి నీళ్లు కూడా యివ్వద్దని ఆంగ్లేయుల శాసనము. చికిత్స సంగతి దేవుడెరుగు: దాహమడిగితే, మూత్రం పోస్తామన్నారు ఆంగ్లేయులు. దేశీ సైనికులకు స్వతంత్రం లేదు. ఏ పనిచేయడానికీ వారిది కూడ కేవలం బానిస బ్రతుకు. ప్రజలు కొందరు ప్రాణం తెగించి, హనుమంతునికి సేవచేద్దామని వస్తే, వారు తరిమికేయబడ్డారు. హనుమంతుకోసం తెచ్చిన పాలు, నీరు పోలీసులు సేవించారు. అది వారి పైశాచిక ప్రవృత్తికి నిదర్శనం. చివరకు కొన వూపిరితో వున్న హనుమంతుని రొమ్ముమీద పొడిచి చంపారు. హనుమంతు శవాన్ని కూడా ఫోటోలు తీసే అనుమతి యివ్వలేదు. రూథర్‌ఫోర్డ్. అతడు నీచత్వానికి మారుపేరని మరొక్కమాట చెప్పుకోనవసరంలేదు. అతని శవాన్ని వాగుప్రక్క పూడ్పించాడు. తర్వాత అతని అనుచరులే భక్తి శ్రద్ధలతో సమాధి కట్టించారు. నేటికీ ఈతని వీర కృత్యాలను ప్రజలు గానం చేసుకుంటారు. అప్పటి నుండి ఆ వాగుకు "హనుమంతు వాగు" అని పేరు వచ్చింది.

మించాలపాడు పర్వతాల్లో పుట్టి, కోలుకుల్ల గ్రామం ప్రక్కగా ప్రవహించి, ఆత్మకూరు చెరువు మీదుగా మాచర్ల చేరి చంద్రవంకలో కలసి ఎత్తిపోతల జలపాతంగా అంతమై హనుమంతువాగు జలం కృష్ణలో విలీనమై, సతతం తెలుగువారి జీవనంలో కలిసి వుంది. ఇటీవలి చరిత్ర కాలంలో యింతటి త్యాగం చేసిన హనుమంతు జీవిత చరిత్ర మరుగునపడి వుండటం బహుశోచనీయం. భారత స్వాతంత్ర్య సమరంలో ప్రముఖఘట్టమైన సహాయ నిరాకరణోద్యమంలో మొదటి ఆహుతిగా తెలుగు దేశాన హనుమంతు ఆదిపురుషుడైనాడు. స్వధర్మం కోసం, స్వరాజ్యం కోసం, శత్రువులపై ఉద్యమం జరిపి స్వేచ్ఛా పథం త్రొక్కి, ఆ పవిత్ర కార్యంలో అసువులు బాసిన హనుమంతు భారతీయులకు తరతరాల స్మరణీయుడు. నేటికీ మించాల వాగు ప్రక్క హనుమంతు సమాధి పలనాటి వీర పౌరుషాన్ని వెదజల్లుతూ సగర్వంగా తలెత్తి చూపరులకు కనిపిస్తూ వుంటుంది.

---

# ఆంధ్రప్రదేశ్ బడ్జెటు

( 8 వ పేజీ తరువాయి)

నుంచి పెంచబడినాయికదా. ప్రభుత్వ పింఛనుదార్లకు కూడా సహాయము సమకూర్చబడింది. రాజధాని నగరంలో అనుమతించదగిన సిటీ కంపెన్సేటరీ అలవెన్సు రేట్లు కేంద్ర ఉద్యోగులస్థాయికి పెంచాలనే అభ్యర్థన చాలా కాలంగా ఉంటూ వచ్చింది. ఈ కోర్కెనుకూడా ఒకానొక వేతన స్థాయివరకు అంగీకరించడమైంది. ఈ చర్యలన్నిటి మొత్తం ఫలితం — వచ్చే ఏడాది రెవిన్యూ ఖర్చులో సుమారు రూ. 24 కోట్లు పెరుగుదల. ఇదికాక, ప్రయాణాలు, ఆఫీసు ఖర్చుల మామూలు కేటాయింపులను కూడా ధరల పెరుగుదల దృష్ట్యా పెంచటం జరిగింది. వచ్చే ఏడాది రెవిన్యూ ఖాతాలో ఆశిస్తున్న మిగులు రూ. 13.49 కోట్లు ఉంటుందన్నమాట. వచ్చే ఏడాది పెట్టుబడి ఖాతాలో ఖర్చు రూ. 86.56 కోట్లు వుంటుంది. ఖర్చులో పెరుగుదలకు కారణం—నీటి సాగు, విద్యుచ్ఛక్తి, రవాణా, ఈ కీలక రంగాలకు చేసిన భారీ కేటాయింపులు. ఈ వ్యవహారాలన్నిటి నికర ఫలితం రూ. 20.34 కోట్లు మొత్తం తరుగుదల. ప్రభుత్వ రెవిన్యూలను మరింత పటిష్టంగా వసూలు చేయటం ద్వారా ఈ తరుగుదలను భర్తీ చేయగల మనుకుంటున్నాను.

### ముగింపు

రాష్ట్ర ఆర్థిక అభివృద్ధిని వేగపరచి, ప్రాంతీయ అసమానతలను తగ్గించి, న్యాయమైన సాంఘిక ఆర్థిక వ్యవస్థను నెలకొల్పటం మన నిరంతర లక్ష్యం అని చెప్ప దలచుకున్నాను. ఇందుకు విస్తారమైన, సుసంఘటితమైన అభివృద్ధి కృషి ఎంతో అవసరం.

---

**అవినీతి, లంచగొండితనం, అక్రమ వ్యాపారం మన ఆర్థిక వ్యవస్థను క్షీణింపజేసే దుష్టశక్తులు. వాటి నిర్మూలనకోసం ప్రయత్నించడం ప్రతి పౌరుని కర్తవ్యం.**

# తెలుగులో స్వీయ చరిత్రలు

– డా. అక్కిరాజు రమాపతిరావు

జాషువా 'నాకథ' పేరుతో స్వీయ చరిత్రాన్ని రచించారు. స్వస్థలమైన వినుకొండను సంబోధిస్తూ తమ గడచిన జీవితాన్నంతా సింహావలోకనం చేసుకొన్నారు. పద్యరచనలో జాషువా కవి శక్తి అనుపమేయం. ఆశక్తి, ఆతళుకుబెళుకులు, ఆశైలి అనితర సాధ్యాలు. నాకథ అన్న స్వీయ చరిత్రం, సంగ్రహంగా వున్నది. మోహనములైన చక్కని పద్యాలున్నాయి. యీస్వీయ చరిత్రలో. తుమ్మల సీతారామమూర్తి చౌదరిగారు ప్రసిద్ధులైన విద్వత్కవీశ్వరులు. నాకథలు అన్న పేరుతో వీరిస్వీయ చరిత 'స్రవంతి' సాహిత్య మాసపత్రికలో వెలువడుతున్నది. అచ్చమైన తెలుగు కవి శ్రీ చౌదరిగారు తమజీవితంలోని అపూర్వ సన్నివేశాలనన్నిటినీ కావ్యంగా రూపొందిస్తున్నారు. వేటూరి ప్రభాకర శాస్త్రిగారి చిన్ననాటి చేష్టలన్న ఖండ కృతికూడా స్వీయ చరిత్రాత్మక సాహిత్యంలోకే చేరుతుంది.

ఇక మహిళామణులలో కూడా స్వీయ చరిత్రలు రచించిన వాళ్ళు కొందరున్నారు.

## బసవరాజు అప్పారావు

భావ కవులలో అగ్రేసరుడు. మధుర సుకుమార హృదయుడు. బసవరాజు అప్పారావు గారు. ఆర్ద్రభావుకుడు లలితమైన గీతికలెన్నో రచించారు. చిన్న తనానే స్వర్గస్థులైనారు. బసవరాజు అప్పారావు గారి ధర్మపత్ని రాజ్యలక్ష్మమ్మ గారి "అప్పారావుగారు నేను" అన్న గ్రంథం చాలా అపూర్వమైన గ్రంథం ఇది. పూవూ తావీగా కవిగారి మనుగడలో, తమ జీవితాన్ని కలబోసుకున్నారు కనుక కవిగారి జీవితాన్ని తాదాత్మ్యభావంతో వ్రాశారు రాజ్యలక్ష్మమ్మగారు. అప్పారావు గారిని వెన్నంటి ఉండేవారెల్లప్పుడూ. ఆమె ఢిల్లీ, కాశీ, మద్రాసు అన్నిచోట్లా తిరిగారు. అక్కడి అప్పారావుగారి అనుభవాలు. తమ అనుభూతులు అన్నీ వ్రాశారు. ఆంధ్రమహాసభలు, అఖిల భారత కాంగ్రెస్ మహాసభలు. అన్నీ అప్పారావు గారి వెంట చూశారు. ఎంత అందమైన శైలి, సుకుమారమైన భావాలు! ఈ పుస్తకం తెలుగు సరస్వతికి చక్కని అలంకారం. 1965 లో అచ్చయింది. సుమారు రెండు వందల ఇరవైపుటల గ్రంథం. అప్పారావుగారి మిత్రులైన దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారిని గురించి చాలా వివరాలు వ్రాశారు రాజ్యలక్ష్మమ్మ గారీ గ్రంథంలో. బరంపురంలో ఆంధ్రమహాసభ జరిగింది. ఆ సభకు పెద్దపెద్ద నాయకులెందరో హాజరైనారు. రాజ్యలక్ష్మమ్మ గారు ఆసభల్లో జరిగిన ఒక సంఘటనను ఉటంకించారు.

ఒకరోజు బహిరంగ సభ జరుగుతున్నది. వేలాది సంఖ్యలో స్త్రీలూ పురుషులూ సభకు హాజరైనారు. ఆరోజు దుగ్గిరాల గోపాల కృష్ణయ్య గారి ఉపన్యాసం. ఆయన ఎంతో రసవంతంగా మాట్లాడుతున్న సమయంలో ఆకాశంచిల్లులు పడినట్లుగా వర్షం కురవడం మొదలుపెట్టింది. జనమంతా తడిసి ముద్దలయిపోయినారుకాని సభలో నుంచి ఒక్కరూ కదలలేదు. గోపాలకృష్ణయ్యగారి వాగ్ధార అలాంటిది ఆయన ఛలోక్తులు చెపుతూ ఎంతో చమత్కారంగా మాట్లాడుతుంటే వాన కురుస్తున్నా తడిసిముద్దలై పోతున్నా అందరూ మైమరచి ఎక్కడ వారక్కడే కదలకుండా కూర్చున్నారు. కొద్ది సేపటికి వాన వెలిసింది. సభ పూర్తి అయింది దిగుమర్తి వారు, పరాహరివారు, బరంపురంలో చాలపేరు ప్రఖ్యాతులు గలవారు ఇంత మంది పొరుగూరు జనానికి ఎక్కడి నుండి తెచ్చారోగాని టౌనుహాల్లోకి బట్టలు మూటలుగా సరఫరాచేసి అందరు తడి బట్టలు విడిచి పొడి బట్టలు కట్టుకోవాలని చాలా బలవంతంచేశారు. కాని అవన్నీ విదేశీ బట్టలవడం వల్ల మా నియమానికి విరుద్ధం, అందు వల్ల నేనూ అప్పారావుగారూ. కాశీశ్వరరావు దంపతులు గోపాల కృష్ణయ్య గారు ఉన్నవ లక్ష్మీ బాయమ్మగారు యాగంటి అన్నపూర్ణా దేవి మొదలైనవాళ్ళం ఆ బట్టలు కట్టుకోలేదు. సభముగిసే వరకు మేమందరం ఆతడి బట్టలతోనే వున్నామని వారెంతో నొచ్చుకున్నారు. ఇలాంటి సన్నివేశాలెన్నో వ్రాశారు రాజ్యలక్ష్మమ్మగారు.

సుప్రసిద్ధ సంఘసేవిక, ఆదర్శ విద్యాసంస్థ నిర్వాహకురాలు మాజీ పార్లమెంటు సభ్యురాలు, శ్రీమతి సంగం లక్ష్మీబాయమ్మగారు. "నా అనుభవములు" అన్న పేరుతో తమ జీవిత ఘట్టాలలో కొన్నిటిని వ్రాసుకొన్నారు. ఈ పుస్తకం 1956 లో వెలువడింది. ఈమె కొంతకాలం పూర్వ హైద్రాబాదు రాష్ట్రంలో విద్యాశాఖ ఉపమంత్రిణిగా కూడా పనిచేశారు. సుమారు 120 పేజీల చిన్న చిన్న గ్రంథం ఇది. వివిధ పత్రికలలో ఆయా సందర్భాలలో వారు వ్రాసుకొన్న వ్యాసాలన్నీ కలిపి యీ సంపుటంగా అచ్చువేశారు. పోలీసు చర్య జరగక పూర్వం నిరంకుశ నిజాంపరిపాలనలో రజాకార దురంతాల మధ్య ఇక్కడి ప్రజలనుభవించిన కష్టాలు నష్టాలు

హృదయ విదారకంగా చిత్రించారు లక్ష్మీబాయమ్మగారు. చాలా శక్తిమంతమైన శైలి. ఒక్కొక్క చోట కవిత్వమనిపించేట్లుగా వ్రాశారు. చాలా చక్కని రచన. మా చిన్నతనంలో పదిహేను ఆగస్టు నాటు, నైజాంలో స్త్రీల హాహాకారాలు మాయావతి, మొదలైన రచనలన్నీ చదవతగ్గవి. గుంటూర్లో ఉన్నవదంపతుల దగ్గర పిమ్మట మద్రాసులోను చదువుకొని ఆదర్శ సంఘసేవ చేశారు లక్ష్మీబాయమ్మగారు. ఇప్పుడు హైదరాబాదులో ఇందిరా సేవాసదన్ విద్యా సంస్థను నిర్వహిస్తున్నారు. ఈ అనుభవాలు చదవదగ్గవి.

సుప్రసిద్ధ సాంఘిక సేవాపరురాలు కథా రచయిత్రి సాహితీ పరురాలు, మాజీ శాసన సభ్యురాలు శ్రీమతి ఎల్లాప్రెగడ సీతాకుమారిగారు తమ స్వీయ చరిత్రలో కొన్ని ప్రకరణాలు రచించారు. త్వరలోనే అది సమగ్రంగా పుస్తకరూపంలో ప్రకటించబడుతుందని ఆశించవచ్చు. కరుణార్ద్ర హృదయ నిర్మాణకార్యకర్త. కనుక ఆమె జంటనగరాలలో మహిళల విద్యావిజ్ఞాన వికాసాదులకు సాగించిన చేసిన కృషి స్థాపించిన సంస్థలు జీవితంలోని వివిధ అనుభూతులు చాలా ఆకర్షణీయంగా వుండవచ్చు. ఆమె విద్వాంసురాలు కూడా కనుక యథార్థ పరిస్థితులను సాహిత్య సంపదతో జోడించి వ్రాయగలరు త్వరలోనే యీ పుస్తకం ప్రకటితమై అనేక విషయాలు ఆంధ్రులు తెలుసుకోగలరని ఆశించవచ్చు.

## కొన్ని స్వీయ చరిత్రల జాబితా

1. స్వీయచరిత్రము-కందుకూరి వీరేశలింగం
2. స్వీయచరిత్రము—రాంభొట్ల జగన్నాథ శాస్త్రి
3. స్వీయచరిత్ర (సూర్యనారాయణీయము) — వల్లూరి సూర్యనారాయణరావు
4. ఆత్మ చరిత్రము—రాయసం వెంకటశివుడు
5. స్వీయచరిత్రము-చిలకమర్తి లక్ష్మీనరసింహం
6. స్వీయచరిత్రము—కొండా వెంకటప్పయ్య
7. నా జీవితయాత్ర—టంగుటూరి ప్రకాశం
8. నా చిన్ననాటి ముచ్చట్లు—కె. యస్. కేసరి
9. తెలంగాణా ఆంధ్రోద్యమం (2 భాగాలు) మాడపాటి హనుమంతరావు
10. నా జీవిత కథ-నవ్యాంధ్రము-అయ్యదేవర కాళేశ్వరరావు
11. స్వీయచరిత్ర—పెద్దిభట్ల వీరయ్య
12. అనుభవాలూ : జ్ఞాపకాలూను—శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి
13. నేను : నా దేశం—దర్శి చెంచయ్య
14. స్వీయచరిత్ర—మాదిరాజు రామకోటీశ్వరరావు
15. స్వీయచరిత్ర-కొండా వెంకటరంగారెడ్డి
16. నా స్మృతి పథంలో, సాగుతున్న యాత్ర (2 భాగాలు) ఆచంట జానకిరామ్
17. శ్రీకృష్ణ స్వీయ చరిత్ర-శ్రీ పాద కృష్ణమూర్తి శాస్త్రి
18. నా జీవిత నౌక—గొట్టిపాటి బ్రహ్మయ్య
19. స్వీయచరిత్ర-బలభద్ర కోటయ్య
20. గడచిన రోజులు—డా. పి. తిరుమలరావు
21. ప్రజ్ఞా ప్రభాకరము— వేటూరి ప్రభాకరశాస్త్రి
22. స్వీయచరిత్ర—గిడుగు వెంకట సీతాపతి
23. సచారిత్రము—శృంగారకవి సర్వారాయుడు
24. అండమాన్ జీవితం-ప్రతివాది భయంకరాచార్యులు
25. జీవిత యాత్ర—దాసరి లక్ష్మణస్వామి
26. నా జీవితం-అనుభవాలు—పుట్టపర్తి నారాయణాచార్యులు
27. నటస్థానం—స్థానం నరసింహారావు
28. నా అంతరంగ కథనం—బుచ్చిబాబు
29. స్వీయ చరిత్ర-ఆజ్జాడ ఆదిభట్ల నారాయణదాసు
30. జీవితానుభవాలు—కోలవెన్ను రామకోటీశ్వరరావు
31. స్వీయచరిత్ర (వ్యాసం)-ఆచంట వెంకటరాయ సాంఖ్యాయనశర్మ
32. స్వీయచరిత్ర—వంగవోలు ముని సుబ్రహ్మణ్యం
33. స్మృతిబింబాలు—సంజీవదేవ్
34. నా జీవిత విశేషాలు—నెల్లూరి వెంకట్రామానాయుడు
35. స్వీయచరిత్ర-ఆచంట లక్ష్మీపతి
36. స్వీయచరిత్ర సంగ్రహం—వక్కళ చెంచలరావు (ఇంగ్లీషో తెలుగో తెలీదు)

పద్యకృతులు :

37. ఆత్మ పర్యాయచర్య లేదా హరిహరేశ్వర శతకము— మండపాక పార్వతీశ్వరకవి
38. బిల్వేశ్వర శతకం-కొక్కొండ వెంకటరత్నం పంతులు
39. జాతకచర్య, ఇటీవలిచర్య-తిరుపతి వెంకటకవులు
40. తెలుగు రాజు-పెన్మత్స సత్యనారాయణరాజు
41. నాకథ-జాషువా
42. నా కథలు-తుమ్మల సీతారామ మూర్తి చౌదరిగారు
43. చిన్ననాటి చేష్టలు - వేటూరి ప్రభాకరశాస్త్రి
44. అప్పారావుగారూ : నేను-బసవరాజు రాజ్యలక్ష్మమ్మ
45. నా అనుభవములు-సంగం లక్ష్మీబాయమ్మ
46. స్వీయచరిత్ర-ఎల్లాప్రెగడ సీతాకుమారి

వీరుకాక సంగ్రహంగా వ్రాసినవారు, ప్రణాళికను మాత్రము వ్రాసిపెట్టుకొన్నవారు చాలా మంది ఉన్నారు. వేదం వెంకట్రాయ శాస్త్రిగారు, శివశంకరస్వామిగారు, సంగ్రహంగా వ్రాసుకొన్నారు. వీరుకాక పానుగంటి లక్ష్మీనరసింహరావుగారు, నందిరాజు చలపతిరావుగారు, చిలుకూరి నారాయణరావుగారు, కూచి నరసింహంగారు, మొదలైనవారు స్వీయచరిత్రలు రచించారని పేకుమళ్ళ కామేశ్వరరావుగారు వ్రాశారు. పింగళి లక్ష్మీకాంతంగారు అభిమానుల కోరికను మన్నించి తమ స్వీయచరిత్రను సంగ్రహంగా నలభై పద్యాలలో రచించారుట (15-1-72 ఇండియన్ ఎక్స్‌ప్రెస్). ఇంకా చాలా మంది రచయితలు, స్వీయచరిత్రాత్మక సాహిత్యంలో చేర్చేందుకు వీలుగా తమ అనుభవాలను, జ్ఞాపకాలను, స్మృతులను ఆయా పత్రికలలో ప్రకటించారు.

(అయిపోయింది.)

<u>గాంధీజీ కలల పంట</u>

# సికిందర్ సేద్య విధానం

"ముప్పై యేళ్లనాడు దమ్మిడీకి ఐదు సూదులు. అంతే యిప్పటి నయాపైసకు పది సూదులు. నేడు పదిపైసల కొక సూది. వందరెట్లు రేటు పెరగడంతోపాటు సూదుల వాడకమే తగ్గిపోయింది. చిరిగిన బట్టల్నికూడా మిషన్లో కుట్టుకొంటారు. ఇక మేము అమ్మే పూసల్ని కొనేవారు బహు అరుదై పోయారు" అన్నారు సికిందరు.

ఆమఱ్ఱిచెట్టు నీడలో నున్న పెద్దబండపై కూచున్నాను, అప్పటి కక్కడున్న ఇరవై మందీ వచ్చికూచున్నారు. సికిందర్ తన సంభాషణను కొనసాగిస్తూ ఎక్కడో ఒక చోట స్థిరంగా ఉండి పోవడానికి గట్టిగా నిర్ణయించుకొన్నట్లు చెప్పాడు.

"పూర్వంలాగా ఇప్పుడు మీకు పిట్టలు, చేల ఎలుకలు, ఉడతలు పుష్కలంగా దొరుకుతున్నాయా?" అన్నాను.

"బొత్తిగా లేదనే చెప్పాలి. అసలు నీటి ఆధారం ఉండే బోలెడు చెరువు కోళ్లుండేవి. బెళవాయిలు, పూరేళ్లు, కౌజులు, చిట్టికోళ్లు, నెమళ్లు, జెముడుకాకులు, జీనువాయిలు ఇవన్నీ కంటికే కన్పించడం అరుదు. ఎలుకలు కన్పించినా అవెక్కడికి చాలుతాయి" అన్నాడు సికిందర్. సికిందర్ చిత్తూరులోని కొంగారెడ్డి పల్లెలో పుట్టాడు. చిన్నప్పుడే తండ్రి పోయాడు. అనంతపురం, కడప, కర్నూలు, గుంతకల్లు, మదనపల్లె తెలుగు దేశంలో అతడు సంచరించిన ప్రాంతాలు. తమిళ దేశంలో కోయంబుత్తూరు వరకూ చూచాడట. తెలుగు కంటే తమిళం బాగా మాట్లాడుతాడు.

## మాజాతి ఆ స్థితిలోవుంది

పొరబాటున నోరు జారి "ఈ పెండ్లిండ్లలో ఆకులేరే అలవాటు పోలేదెందుకు" అన్నాను. అతని కళ్లు బాగా చెమ్మగిల్లినవి. చెక్కిళ్లపై కన్నీటి చుక్కలు జారుతుండగా యిట్లా అన్నాడు.

"మాజాతి ఆ స్థితిలో వుంది. ఇప్పుడా ఎంగిలాకుల్లో అన్నం కూడా మిగల్చడంలేదు. అటు పిట్టలూ లేవు, తలదాచుకోడానికి కూడా చోటూలేదు. మీదేవూరు? అని ఎవరైనా ప్రశ్నిస్తే ఫలానా ఊరని చెప్పేయోగ్యతా లేదు"



రాళ్లలోనుండి రతనాలను సృష్టిస్తున్న రైతాంగంతో గోష్ఠి

అతని ఉద్వేగాన్ని చూచి ఆశ్చర్య పడ్డాను. మన దేశంలో హరిజనుల సమస్య లెన్నో పరిష్కరించబడ్డాయి. ఈ విధంగా ఊరూరా తిరుగుతూ వలసలతోనే సంచరిస్తున్న గిరిజనుల తెగలకు చెందినవారి సమస్యలు అపరిష్కృతంగానే ఉన్నవి

"నేనక్కడక్కడా చూచాను. ఒకసారి రమణాశ్రమంలో భగవాన్ జయంత్యుత్సవంలో విపరీతంగా అన్నదానం చేశారు. మీ జాతివారికి మనిషికో అంత కూడ పెట్టారు. వారా అన్నాన్ని

శ్రీ కె. సభా

పెద్దమూటలు కట్టారు. ఎడ్లబండ్లలో వేసి తీసుకపోయారు. అంత అన్నాన్ని ఒక్కసారిగా ఏంచేశారో తెలియదు" అన్నాను.

సికిందరు సాంతం విని అన్నాడు. "ఆ అన్నాన్ని బాగా బండ మీద పోసి ఎండపెడుతాము. ఎండిన తరువాత అలాగే ఉంచుకొంటాము. కడుపునకు తిండి దొరకని పూట చేరెడు వేన్నీళ్లలో పిడికెడు ఎండిన మెతుకులు వేస్తేదోసెడు అన్నం తయారవుతుంది"

ఎంతటి నికృష్టమైన బ్రతుకోయిది. నలభై ఏళ్ల నుండీ ఈ గువ్వలోళ్లతో నాకు మంచి పరిచయం ఉంది. చిన్నతనంలో చేలలో ఏటగిరి వాళ్లు ఆవునాటునే వెడుతూ వేటాడడం చూడటం ఒక మంచి వినోదంగా ఉండేది. ప్రాచీన సాహిత్యంలో కన్పించే రాజుల్లాగా పూసలు తల పాగాలు, యీకలు



ఆ ప్రక్కనే తిర్చిన భూమిలో పండిన సజ్జ చేలలో సంతృప్తిగా నవ్వుతున్న శ్రీయుతులు కృష్ణమ నాయుడు, రాజగోపాల నాయుడు

భలే ముచ్చటైన వేషం. స్వరాజ్యం వచ్చిన వెనుక ఈ రకం మనుష్యులకు ఏదో చేయాలనే ఉబలాటం ప్రభుత్వానికి ఉన్నా ఒకచోట వీరిని నిలబెట్టలేని పరిస్థితినే ఎదుర్కోవలసి వచ్చింది.

"మీవారు ఎక్కడైనా స్థిరంగా నివసిస్తున్న ఊరంటూ ఒక్కటున్నదా ?" ప్రశ్నించాను సికిందరును.

"లేకేం. తమిళనాడులో సెయ్యారు తాలూకాలో డెబ్బై ఇండ్లున్నవి. వారికి పొలాలు, పంపుసెట్లు కూడా ఉన్నవి వారిలో కుప్‌సింగుకు పదిహేడు ఎకరాలున్నది." అన్నాడు సికిందరు. అప్పటికి గంట రెండు కావచ్చింది. మధ్యాహ్నం ఎండ దప్పిగా ఉంది. నీళ్ళు కావాలన్నాను. చేదబావినుండి నీరు చేది తెచ్చి పెట్టాడు. నీళ్ళుత్రాగి మీరంతా భోజనం చేశారా అన్నాను, సమాధానం లేదు. మళ్ళీ అడిగాను.

"ఉదయం యాదమతికి వెడుతూవుండే దారిలో అమ్మవారి గుడివద్ద పొంగలి పెడుతున్నవారెవరో తలో గుక్కెడు అంబలి పోశా"రన్నాడు. అంతే భోజనం లేదు. చరచరా పైకి లేచి వారి గుడిసెల వైపు వెళ్ళాను. ఏ ఒక్క గుడిసెలోనూ పిడికెడు నూకలు లేవు.

## ఆకలి బ్రతుకులు

ఎట్లా బ్రతుకుతున్నారో! చేల్లల్లో కూలికి వెళ్ళడం యిప్పుడిప్పుడే ప్రారంభించారట, మధ్యాహ్నం ఒకపూట సంగటి దొరుకుతుంది అందరూ ఆకలితో ఉన్నా హుషారుగానే ఉన్నారు నా ముఖం వాడిపోయింది బాగా దప్పిపోయాను శ్రీ గోవిందరెడ్డిగారు ఫాస్కులో కాఫీ ఉన్నదన్నారు, వెళ్ళి త్రాగివచ్చాను కానీ ఎంతటి స్వార్థపరుణ్ణి అనిపించింది. నేను ఎన్ని ప్రశ్నలడిగినా వారు ఉత్సాహంతో జవాబు లిస్తున్నారు. తమిళంలో నడికొరవన్, కురివిక్కారన్ అంటారట. నెల్లూరులో పిట్టల దొరలంటారట. అనంతపురం జిల్లాలో వీరిని కప్పనక్కలోళ్ళంటారట. హిందీలో చూడా లీలే అంటారట. ఇవన్నీ సికిందర్‌తో పాటు ఉన్నవాళ్ళంతా చెప్పారు. మూరు మనువు నిఖా ఉంది. ఏవిధంగా పూజిస్తారు దేవుణ్ణి అని ప్రశ్నిస్తే మధుర మీనాక్షిని, పరవేటి ఎల్లమ్మను, చాముండేశ్వరిని, మహాకాళిని, పువ్వుపావడా దేవతను, గరుత్మంతుని కొలుస్తామన్నారు. పిల్లలకు మొదట తల నీలాలు తల్లియే తీస్తుందట.

విడాకులు యిచ్చేటప్పుడు పచ్చి కసువు పోచను త్రుంచి వేసి తాళిబొట్టు తీసి పెట్టాలట కాళహస్తి తాలూకాలో చింతలపాలెంలో డెబ్బయి యిండ్లకు మూడువందల యాభై ఎకరాలిచ్చి ప్రభుత్వం కాలనీని యేర్పాటు చేసిందన్నాడు సికిందరు. వారికి బడి ఉందా అని అడిగాను లేదన్నాడు.

"సికిందర్ — ఈ వారమో మరువారమో మన కలెక్టర్ వస్తారట మిమ్మల్ని చూడ్డానికి మీలో చదివినవారే లేరా ?" అన్నాను.

"నాకు అక్షరం రాదు. ఈ మిలిట్రీ కన్నన్ ఒక్కడే సంతకం పెడ్తాడు". ఇంకెవ్వరికీ రాదన్నాడు.

"మీకు పొలాలకంటె ముందు చదువు కావాలి కలెక్టర్‌గారిని అడగండి. బడిపెట్టి మంచి మాష్టర్ని పంపుతాడు. నూకలు లేవని చెప్పండి చౌకడిపోను పెడతారు. పెద్దబావి సేద్యానికి, చిన్నచిన్న ఇండ్లు కాపురాలకు కావాలనండి. మీకు తప్పకుండా ఏర్పాటు చేస్తారు మీరు నిజంగా అదృష్టవంతులు మీ పొలాల్లో బంగారం పండుతుంది. మీ బిడలు ఈ దేశాధిపతులవుతారు, ఇలా నిలబడండి. మీతో కలసి ఒక ఫొటో తీసుకొందామని ఉంది." అన్నాను.

"బాబయ్యా మీరు దూరంగా ఉండండి కలిసే ఎట్లా?" అన్నాడొక పెద్దాయన.

"ఈ బొమ్మ పడినాక నాకొకటిస్తే ఎంత డబ్బుఅయినా యిస్తాను" అన్నాడు సికిందరు.

జీవితంలో ఎన్నడూ అనుభవించని మహదానందం కలిగింది. వాల్మీకి మహర్షి సాక్షాత్కరించాడు. ఏకలవ్యుడు లీలగా కన్పిస్తున్నాడు కాళహస్తి కన్నడు కనుల ముందు లీవిగా నిలబడాడు. శతాబ్దాల తరబడి అట్టడుగున ఈ లోకంలో ఈ మనుష్యులతో సంబంధ బాంధవ్యాలు లేని మచ్చలేని అమాయకుల ఎదురుగ నిలబడడమే ఒక మహద్భాగ్యం.

ఫొటో తియ్యగానే సికిందరు చెప్పకనే పరుగు తీస్తున్నాడు కేకేసి ఆపి ఎక్కడికన్నాను. మా శనగ చేనిలో కరిబూజకాయ కాస్త అర్థవాసి ఉంది తిందురు తిందురు తెస్తా" అన్నాడు. వాడి మాటలు గంట వాయించినట్లు విన్పిస్తాయి. పండేవరకు కొయ్యనే వద్దన్నాను. అతడు వినలేదు.

"చూడు సికిందర్! నువ్వింకా రైతువి కాలేదు. రైతే ఐతే పిందెను తుంచడానికి ఒప్పుకోడు. ఏ కాయను కాని పక్వం కానిదే తుంచకూడదన్నారు."

## మనుషులుగా బ్రతికితే చాలు

తమిళచిత్ర జగత్తు ఒకడుగు ముందుకువేసింది. వారామధ్య 'కొరత్తిమగన్' అనే చిత్రం తీశారు. అందులో జెమిని గణేశన్ గువ్వలోడుగా నటించారు. గువ్వలమ్మాయి పాముకాటుకు మందిస్తుంది. ఆ యింటివారు ఆదరిస్తే తన కొడుకును చదువు చెప్పించమని అప్పగిస్తుంది. చదివి పెరిగి ఒక శాసనసభ్యుడవుతాడు. ఈ చిత్రాన్ని గువ్వలవాళ్లు తెగచూచారు. తమిళ దేశంలో ఒక మార్పు వచ్చింది. సికిందర్ కూడా ఈ చిత్రంలో చూచినట్లే తమ బిడ్డలు గొప్పవారు కాకపోయినా మనుషులుగా బ్రతికితే చాలన్నాడు.

ఈ కాలనీ మా సాక్షిదగ్గరుంది. చిత్తూరికి పదిమైళ్లు. సికిందర్ అనుకొన్నట్లా చేశాడు. కలెక్టర్‌గారు వెళ్లి పుట్టు బడి కావాలన్నారు. పాఠశాల పెడుతున్నారు. బావిని కూడా త్రవ్విస్తున్నారు. ఇండ్లు కూడా కట్టవచ్చు. తిండిగింజలు కూడా సరఫరా చేశారు. గొఱ్ఱెలను కూడా యిస్తున్నారు.

చిత్తూరు ఆర్.డి.ఓ. ఆఫీసులో మళ్లీ కన్పించాడు సికిందర్. ఎట్లా ఉన్నావన్నారు. "బాగున్నాం బాగున్నాం మీరు రావాలి మా ఊరికి" అన్నాడు. అదోరకం జపాతంలా స్వరం స్వచ్ఛంగా నిష్కపటంగా మాట్లాడుతూ నిర్మలంగా కన్పించారు. "నెలకొకసారైనా వస్తాను మీ బిడ్డ కుమ చి కథలు చెబుతాను," అన్నాను. ఈ కాలనీకి వందాడెబ్బై ఎకరాలు ప్రత్యేకించారు. వందాన బై తొంబది ఎకరాలు సాగులో వుంది. బావి త్రవ్వే ప్రయత్నం జరుగుతోంది. ఇండ్లు కట్టి గేదెలు కూడా పటియిస్తే బ్రతుకును కుదుట పరచుకోవచ్చు. చేరుకునగ సాగును చూచాను. స్వల్పంలో క్రొత్త నిజానికి అనుభవంలేదు. ఐనా వారిపట్టు మెచ్చుకోదగింది. ఆ మర్రిచెట్టునీడ ఆ చేదబావి మాత్రమే వారికాధారం. బడికడితే, గొర్రెలకొక షెడును నిర్మిస్తే వీరుకూడా వర్షంలో తలదాచుకోవచ్చు. ప్రభుత్వం అనుకొంటే పోరంబోకులో తాటిచెట్లు కొట్టిస్తే తక్కువ ఖర్చుతో తక్కువ వ్యవధిలో తాటాకుల పాకలను నిర్మించవచ్చు.

ఈ కాలనీ మీనాక్షి నగరమో చాముండేశ్వరి పురమో కావాలి సికిందర్‌తో అన్నాను.

"ప్రభుత్వం యింతా ఖర్చుపెట్టి మీకు పొలమిచ్చి విత్తనాలిచ్చి గొర్రెలు గేదెలు, ఎద్దు పట్లు యిచ్చి బావిత్రవ్వి, బడిపెట్టి, యిండ్లు కట్టియిస్తే మీరు మళ్లీ గువ్వలవేటలో సూదుల బేరంలో ఊరు విడిచి పోరనే నమ్మకం ఏమి?"

అతడు భూమిపై చేతితో కొట్టి గట్టిగా అన్నాడు "చచ్చినా బ్రతికినా యిక్కడే. ఇక వెళ్లే పనిలేదు" ఎంతో సంతోషం వేసింది. ఇలాంటి జాతులు దేశమంతటా పలుచోట్ల వెదుకుతూ ఓటర్ల లిస్టులో కానీ జనాభా లెక్కల్లో కానీ మోదుకాని జాతీయులెందరో తెలియదు. చిత్తూరు జిల్లాలో ఈ కాలనీకి ప్రభుత్వం ఖర్చుపెట్టిన పైకం అన్ని కాలనీలకంటె తక్కువ. ఐనా వారితో గడిపిన క్షణాలలో కలిగిన మమకారానుభూతి సంతృప్తి యింకెక్కడా కలుగలేదు. కారణం ఒక్కటే ఈ గువ్వలోళ్లు ఎంతో అమాయకులు. అల్ప సంతోషకులు. ఒక్కపూట భోజనమే వారిబడ్జెట్టు. ఏ వీధి వంచనో ఆశ్రయం లభించడమే వారి ధ్యేయం. నాగరిక ప్రపంచంతో సంబంధమే లేదు. అసలు వారితో మాట్లాడానికి కూడా ఒక నిమిషమైనా వెచ్చించే విద్యావంతులులేరు. వారి తరఫున ప్రతినిధులెవరున్నారు? ఎంతో విచారకరమైన అమిత బాధాకరమైన ఊహించడానికే వీలుకాని జీవిత విధానం వారిది.

సికిందర్ చెప్పిన మాటను ఈ లోకం గుర్తించాలి. అతడన్నాడు "చూడు నాసు ప్రతి పిట్టకూ ఒక గూడుంది సాయంకాలానికా గూటిని చేరుకుంటుంది. మాకు జోలె డబ్బా తప్ప ఏముంది?" అక్షరం రాకపోయినా అతని గుండెల్లో నుండి దూసుకవచ్చిన మాటలవి. వారి కథలన్నీ వ్యథలు. కన్నీటి గాథలు. వారినిట్లా ఒక్కచోటచేర్చి ఈ కాలనీని స్థాపించడంలో శ్రమించినవారు కలెక్టర్ శ్రీ పళ్లియప్పన్ ఆ వెనుక ఆ కాలనీపై దృష్టిని కేంద్రీకరించారు కలెక్టర్ రాజాజీ

## కాలని సౌకర్యాలు

కన్నికాపురం కాలనీకి వెళ్లినపుడు మా శాసనమండలి సభ్యులు శ్రీ పి రాజగోపాల నాయుడుగారు కూడా వచ్చారు. నూటఏభై ఎకరాలలో నూటఅరవై ఒక ఎకరాలు సాగు. ఐదు బావులు ఏడు పంపుసెట్లు. వీరి చొరవవల్ల వుంది కన్నికాపురం, ఉప్పుండ మహారాజపురంనే నేసనేరు కాలనీలను చూచాము.

హరిజనుల సాగిస్తున్న సేద్యం రైతుల సేద్యంలా చక్కగా ఉంది. ఊటబావుల నీరు పుష్కలంగా ఉంది. కన్నికాపురం కాలనీలో గేదెలను చూచాము. వ్యవసాయ కూలీలైనందున వారికి వ్యవసాయంలో అనుభవం యెక్కువ. నేలను తీర్చడంలో కూడా ఎంతో నేర్పు కన్పిస్తూ ఉన్నది.

దేశంలో జనాభా పెరిగి తిండిగింజల ఉత్పత్తి అవసరమని గుర్తించినపుడు ఇలాంటి కాలనీలను ఎన్నిటిని వ్యవస్థీకరించినా నష్టంలేదు. ఇవన్నీ క్రొత్తగా యేర్పడ్డ గ్రామాలుగా భావించాలి. చిత్తూరు జిల్లాలో ఇలాంటి కాలనీలను ఇంకొక వంద స్థాపించటానికి అవకాశాలు పుష్కలంగా ఉన్నవి. ఎక్కడైతే రెండువందల ఎకరాలు ఒక్కచోటుగా కన్పిస్తుందో అక్కడొక కాలనీని స్థాపించవచ్చు. పెనుమూరు, చీలేపల్లి, కొత్తపేట, పుత్తూరు, కాశిపట్టు, కీలగ్రామం, అగ్గిరేనుపల్లి, పచ్చారం, పాలేరు ప్రాంతాల్లో ఈ కాలనీలున్నవి. మొత్తం పదమూడు కాలనీలకు 1771 ఎకరాల భూమి ప్రత్యేకించబడింది. దాదాపు పదివేల ఏడు వందల ఎకరాల భూమిలోనూ పదమూడువందల నలభై ఎకరాల భూమి సాగులో వుంది. త్రవ్వినవి పదిహేడు బావులే. పంపుసెట్లు పదొమ్మిది. వందాయాభై ఎనిమిది జతల ఎద్దు. ఏడు గేదెలు; బావుల సంఖ్య చాలదు.

నేసనేరులో యానాది కాలనీకి ఒక చెఱువును నిర్మిస్తున్నారు. ఈ చెఱువు దాదాపు పూర్తి కావచ్చింది. ఎంతో సత్ఫలితాన్నిచ్చే పథకమిది. ఈ యానాదులకు కడుతున్న ఇండ్ల నిర్మాణంలో కొంత లోపం కన్పిస్తుంది. మా వెంట ఉన్న ఆర్.డి.ఓ. గారు

గుర్తించారు. చర్య తీసుకొంటున్నట్లు చెప్పారు. ఇక్కడ పైరూ పచ్చ ఎంతో ముచ్చటగా ఉంది ఆ రైతులు కూడా ఎంతో సంతృప్తిని వెల్లడించారు. యానాదులు రైతులుగా రూపొందడం ఒక మహత్తరమైన చారిత్రాత్మకమైన సంఘటన. వీరికొక ప్రాథమిక విద్యాలయం ఉంది. ఎనభై ఐదు మంది పిల్లలున్న బడికొకే ఉపాధ్యాయిని ఉండటం ఆశ్చర్యమన్పించింది. ఇంకో టీచరు లేకుంటే ఏంసాగుతుంది. యానాబడి పిల్లలకు బట్టలు ఉచితంగా యివ్వవచ్చు మధ్యాహ్నం భోజనంకూడా పెట్టవచ్చు. ఆరోగ్యకరమైన పుష్కలమైన ఆహారం కొరతవల్లా ఆ పిల్లలు మిణుగురుల్లా కన్పించారు.

ఈ యానాది కాలనీలో ఒక వైద్యకేంద్రాన్ని నెలకొల్పవలసిన ఆవశ్యకత కన్పిస్తున్నది. తిరుమల కొండల తీరులో నున్న అపూర్వ సౌందర్యమును ప్రస్ఫుటించే కొండకొమ్ములు కోటగోడ లాంటి శిలాచ్ఛాదనాలైన పర్వతశ్రేణులు ఎంతో ముచ్చట గొలిపే ప్రకృతి. వీరి సేద్యం అనుభవజ్ఞులైన కర్షకుల వ్యవసాయానికి తీసిపోదు. వేరుశనగ పైరు అక్కడక్కడా ఏదో రోగంతో దెబ్బతిన్నది. వ్యవసాయశాఖ ఈ క్షేత్రంవైపు తగినంత శ్రద్ధ వహించి వుంటే పంట మరో యాభై శాతం చేతికి చిక్కేది.

శ్రీకృష్ణయ్యనాయుడుగారు వుత్తూరు భూమి తనఖాబ్యాంకి అధ్యక్షులు. వారు ఓ టి రెండు కాలనీలకు మంచి సహకారాన్నిచ్చి స్వయంగా బావుల త్రవ్వకం నుండి నేలను చదరం చెయ్యడం వరకూ దగ్గరే ఉన్నారు. ఇప్పుడూ అట్టి సహాయాన్నే అందిస్తూన్నారు. ఆ నాడల్లా ఎండలో మాతో నేఉన్నారు. ఆయనిట్లా అన్నారు.

"ఇదో స్వప్నం. ఈ లాంటి మైదానాలంతా సాగుకు తేవాలని నాకు ఎంతో ఆశ. ఐతే ఒకరిద్దరు నావంటి రైతులతో అయ్యేపని కాదు ప్రభుత్వం అనుకొంటే ప్రత్యేకాంచనాల మొత్తాలను ఎంతో జాగ్రత్తగా ఖర్చు పెడితే ఊసర క్షేత్రాలనే సస్యశ్యామలములైన పసిడి పంట పొలాలుగా మార్చవచ్చు."

## నిస్వార్థ సేవ

ఇట్టి రైతుల సహకారము, అధికారుల శ్రద్ధ ఈ క్షేత్రాలకు పునాదులు. ఆర్. డి. ఓ. దస్తగిరి సాహేబ్ పొలాల్లో నడుం వంచి పనిచేసే రైతు కార్మికుని మనస్తత్వం. ఆయన అంటాడూ: "ఈ ఎర్రని నెంబరు రాయినుండి మానేల. ఆ డొంకకిపతల మా చేను. ఈ బావులన్నీ మావేనండీ. చూవారా ఈ గేదెలు ఇంకా పుష్టిగా రాలేదు"

నాకాశ్చర్యం వేసింది. అన్నీ మావి అంటున్నారాయన. అంటే ఈ కాలనీని కాలనీల సేద్యం తనదిగా భావిస్తున్నాడు. ఉద్యోగులందరూ కాకపోయినా ఏ కొందరో యిలా భావిస్తే దేశం శరవేగంతో అభ్యుదయం వైపు పురోగమిస్తుంది.

కన్నికాపురం హరిజనుల కాలనీ కనుచూపు మేర పచ్చగా కన్పిస్తుంది బావులన్నీ మంచి ఊట. ఇక్కడ వరి, సజ్జ, వేరుశనగ, ముఖ్యమైన పంటలు. ఎ తకష్టపడారో నేలను తీర్చడానికి ఊహాతీతం. హరిజన వాడ కొత్తమూరం. తాత్కాలికంగా కాలనీలో



నేసనేరు యానాదులకు గృహనిర్మాణం

వేసిన గుడిసెలు లాంఛనంగా ఉన్నవి కానీ కాపురానికి అనుకూలంగా లేవు. ఈ శ్రామికులెంతో కష్టజీవులు. ఈ పంట పొలాలలో వారు శ్రద్ధగా పని చెయ్యడం చూశాను. శ్రీకృష్ణమ నాయుడుగారి సలహాలు, సహకారం వారికెంతో ఉపకరిస్తున్నట్లు చెప్పారు. ఇక్కడొక మంచి పాడి కేంద్రాన్ని అభివృద్ధి చేసే వీలుంది. హరిజనులకిక్కడ ఇండ్లు నిర్మిస్తే ఇదొక ఆదర్శ గ్రామంగా రూపొందవచ్చు. ఈ సేద్యపు బావుల్లో ఒక బావిలో మాత్రం యింకా గంగ పడలేదు. భగీరథ ప్రయత్నం చేసే కాని పడదన్నారు కృష్ణమనాయుడుగారు.

నేసనేరులో పండయ్య మల్లెపూల కుంటను చెరువుగా రూపొందించడాన్ని ఎంతో గొప్ప పనిగా వర్ణించారు. ఆ రైతుకు వచ్చిన భాషలో అభివర్ణిస్తుంటే యింకా వినాలన్పించింది. మూడు వందలా యాభై ఎకరాలు కొత్తగా సాగవుతున్నాయి. ఇంకా చెరువు ముందు కాస్త ఉత్తరం, మరీ పడమరగా వెడితే వెయ్యి ఎకరాలు సాగయ్యే భూమి వుందన్నాడు. అతడక్కడి భూమి దినుసు మట్టి గుణాన్ని విశదీకరిస్తూ ఈ క్షేత్రం పండితే రత్నాలు రాలుతాయన్నాడు.

అతడింకా ఆసక్తికరమైన విషయాలు చెప్పాడు. అరటి పిలకలు కొబ్బరి మొక్కలు బొప్పాయి, మునగ మొక్కలు గరిమల్లో, గడల్లో, కాలువ గట్లల్లో పెట్టాలన్నాడు. మంచి గేదెలు ఆవులు. గొర్రెలు ఉంటే ఎంతో సంపాదించవచ్చునన్నారు.

ఇక్కడ కొండ వాలులో చిట్టడవులున్నాయి. రిజర్వు ఫారెస్టు పేరుగానీ ఫారెస్టుకాదు. అద్భుతమైన మట్టి. ఈకొండ నేలలో పండని పైరంటూ ఉండదు రైతుకు రెండు లేక మూడెకరాల వంతున కేటాయించి వ్యవసాయాన్ని విస్తరిస్తే ధాన్యోత్పత్తికి మంచి వీలుంది.

పాతికేళ్ళ క్రితమే ఇట్టి ప్రయత్నాలను పుష్కలంగా చేసి ఉండవలసింది. రాయలసీమ అంతటా ఇలాంటి మైదానాలున్నవి.

రాయలసీమ రాళ్ళలోనే నవధాన్యాలు పండుతాయి రాళ్ళలో రతనాలంటే యివి. కందులు, ఆముదాలు, వేరుశనగలు, ఉలవలు అలసందాలు, పెసలు, అనుములు, మినుములు, ఆరికలు, శామలు, కొర్రలు, సజ్జలు, జొన్నలు, బైటొడ్లు, జెరొడ్లు, నల్లరాగులు, వంటి ధాన్యాలకు రాయలసీమ చేలన్నీ పెట్టిన పేరు.

## ప్రపంచంలో అరుదు

ఇక్కడి సేద్యం తీరు తెన్నుల నింకా వ్యవసాయశాఖ పూర్తిగా ఆకళింపు చేసుకోలేదు. ప్రత్తి, గోగులు, చిక్కుడు, గోరు చిక్కుడు, చొర, గుమ్మడి, కాకర, బెండ, సూర్యకాంతం, కరిబూజ కూడా చేలలో పండుతాయి వరాహారంతో ఇన్ని పంటలు పండే భూమి ప్రపంచంలో ఏ దేశంలోనూ కన్పించదు ఒకే భూమిలో ఒకేమారు వేరుశనగ, జొన్న, కంది, గోగులు, గోరు చిక్కుడు, అనుము, అలసంద, పెసర, బెండ, గుమ్మడి, చొర పండుతుంది. ఒకదాని కొకటి సంబంధం ఉండదు దేనికదే మంచి సారముంటే అన్నీ మంచి ఫలితాలే. పదిరోజు లటూ యిటూ ఒక్కొక్క పంటనే ఒడుపుకోవచ్చు. ఇక్కడి వ్యవసాయ కూలీలకివన్నీ అనుభవాలు. వారికి నేలతోపాటు కాస్త పైకం, సకాలంలో విత్తనాలు, ఎరువులు అందితే చాలు. ఈ కాలనీలలో ఆ యేర్పాట్లు దాదాపు ఉండటంచేత వ్యవసాయం సాగుతోంది. ఈ జిల్లాలోని పల్లెల్లో నూటికి నెలకు పది రూపాయలు వడ్డీకైనా డబ్బు దొరకదు. (సంవత్సరానికి నూటికి నూట యిరవై వడ్డీ) ఈ స్థితిలో బంజరు భూములు పట్టాలిచ్చినా ఏంచెయ్యగలరు? ఎట్లా సాగుకు తేగలరు? పైగా ఆ భూమిని చదరం చెయ్యడానికి ఏడాది నుండి మూడేండ్లు పడుతుంది. వారే సదుం వంచిపని చెయ్యాలి. కూలీలను పెడితే ఎకరాకు వెయ్యి రూపాయలైనా చాలవు. ఈ కాలనీలకు ట్రాక్టరుంది. బుల్‌డోజర్లతోనైతే వాటిని జిల్లాలో బంజరు పొలాలను పట్టాలు చేసుకొన్న వారికిస్తే గంటలో రోజుల్లో వందల ఎకరాలను సాగుకు లాయకు చేయవచ్చు ఇవన్నీ ఆలోచనలు. స్వప్నాలు. మాపాకి గువ్వలవారి కాలనీలో సికిందర్ లాంటి పట్టుదల గలవారు. నేసనేరు పండయ్యలాంటి శ్రమజీవి, కన్నికాపురం కృష్ణమ నాయుడు లాంటి అనుభవజ్ఞుడు, గోవింద రెడ్డిలాంటి సెక్రటరీ, దస్తగిరి సాహెబ్‌లాంటి ఆర్.డి.ఓ., శ్రీ వళ్ళియప్పన్, రాజాజీల వంటి కలెక్టర్లు ఉన్నప్పుడీ కాలనీలకు భయంలేదు.

## గాంధీజీ కన్న కల

సంకల్ప బలము, చిత్తశుద్ధి, నిజాయతీ ఈ కార్యక్రమంలో ముఖ్యాంశాలు. నాకు తెలిసినంత మట్టుకు గాంధీజీ బ్రతికి ఉంటే ఈ కాలనీలను చూచి ఆనంద బాష్పాలు జార్చేవారు. ఇవి ఈ జిల్లాకు ఈ రాష్ట్రానికేకాదు ఈ దేశానికే ఆదర్శంగా, చరిత్రాత్మకంగా రూపొందగలదనే విశ్వాసం నాకుంది. ఈ విశ్వాసాన్ని సఫలీకృతం చెయ్యడానికి అధికారులు, ప్రభుత్వము కృషిచెయ్యడంలో ఎట్టి విలంబనా జరుగనివ్వరాదు.

స్వరాజ్యం వచ్చిననాడు నాలో కలిగిన అపూర్వానందానికంటే ఈ కాలనీలను సందర్శించినపుడు ఎక్కువ ఆనందాన్ని పొందాను. ఏదో స్వాప్నికజగత్తులో విహరిస్తూ దివ్యానుభూతిని పొందినట్లని పించింది. ఆకలిని, దప్పిని, ఎండను మరచి ఆచేలవెంట, బావుల వెంట, పొలాలవెంట, ఆరైతులతో రెండురోజులు గడిపాను.

ఇప్పుడు కూడా మాట్లాడుతున్నట్లే ఉన్నది. సికిందర్. సికిందర్ సేద్యాన్ని చూస్తున్నట్లే ఉన్నది. నా దేశంలో. నవ భారత దేశంలో తర తరాలుగా శతాబ్దాలుగా తలదాచుకొనే నీడైనా లేక అనాథులై, అజ్ఞాతంగా సంచరిస్తూ వచ్చిన గువ్వలోళ్ళు స్థిరపడుతున్నారు. సికిందర్ సేద్యం చేస్తున్నాడు. సికిందర్ రైతుగా రూపొందినాడు. సికిందర్ సేద్యం గాంధీజీ కలల పంట.



# రాష్ట్రంలో పారిశ్రామికాభివృద్ధికి జిల్లా స్థాయీ సంఘాల కృషి

రాష్ట్రంలో భారీ ఎత్తున పరిశ్రమలు అభివృద్ధిచెందడానికి ప్రధానమైన యిబ్బందులలో ఒకటి ఏమంటే పరిశ్రమల స్థాపన విషయంలో అనుభవంగల పరిశ్రమదారులు పని ఆరంభించడానికి ప్రభుత్వశాఖలవెంట తిరగవలసి వస్తున్నది.

పరిశ్రమలు ఆరంభించడానికి అనుమతి యివ్వడంలోగల సాధక బాధకాలను నివారించి, ఆలశ్యాలను తొలగించే ఉద్దేశంతో ప్రభుత్వం ప్రతి జిల్లాకు జిల్లాస్థాయిలో ఒక సంఘాన్ని ఏర్పాటు చేసింది. దీనికి జిల్లా కలక్టరు అధ్యక్షులుగాను, జిల్లాలోని వాణిజ్య పరిశ్రమలశాఖ డిప్యూటీ డైరెక్టరుకానీ, అసిస్టెంటు డైరెక్టరుకానీ సభ్యుడు-కార్యదర్శిగా వ్యవహరిస్తారు.

ఈ సంఘాలలో జిల్లా వైద్య ఆరోగ్యశాఖాధికారి, డివిజనల్ ఎలక్ట్రికల్ ఇంజనీర్, ఫ్యాక్టరీల రీజనల్ ఇనస్పెక్టరు జిల్లా మునిసిపల్ కమీషనరు, మునిసిపాలిటీకి చెందిన టౌన్ ప్లానింగు ఆఫీసరు సభ్యులుగా వుంటారు.

కృష్ణా జిల్లా విషయంలో విజయవాడ టౌన్ ప్లానింగు ఆఫీసరు, జిల్లాలోని సివిల్ కమీషనరుకు బదులు విజయవాడ మునిసిపాలిటీ కమీషనర్ యీ సంఘంలో సభ్యులుగా వుంటారు.

హైదరాబాదుజిల్లా, జంటనగరాల విషయంలో పరిశ్రమల శాఖ డైరెక్టరు కమిటీకి అధ్యక్షులుగాను, జిల్లా కలక్టరు ఉపాధ్యక్షులుగాను, పరిశ్రమలశాఖ అసిస్టెంటు డైరెక్టరు సభ్యుడు, గాను కార్యదర్శిగాను వ్యవహరిస్తారు.

ఆంధ్రప్రదేశ్ ఇండస్ట్రియల్ ఇన్‌ఫ్రాస్ట్రక్చర్ కార్పొరేషను మేనేజింగు డైరెక్టరు, హైదరాబాదు మునిసిపల్ కార్పొరేషన్ స్పెషల్ ఆఫీసరూ, ఫ్యాక్టరీల చీఫ్ ఇనస్పెక్టరు, సిటీ సర్కిల్‌యొక్క విద్యుచ్ఛక్తి శాఖ ఆపరేషన్స్ సూపరింటెండింగు ఇంజనీరు, టౌన్ ప్లానింగు డైరెక్టరు, జిల్లా వైద్య ఆరోగ్య శాఖాధికారి, జిల్లా పంచాయతీ ఆఫీసరు సభ్యులుగా వుంటారు.

ఈ సంఘాల అధ్యక్షులు అవసరమైన సందర్భాలలో, పరిశ్రమల స్థాపనకు సంబంధించిన యితర శాఖల ప్రతినిధులనుకూడా సమావేశాలకు హాజరుకావలసిందని ఆహ్వానాలు పంపవచ్చు.

పరిశ్రమల ఏర్పాటుకు లైసెన్సులు మంజూరుచేయడం, యిందులోగల ఆలశాస్యాలను తొలగించడం మున్నగు విధులను యీ సంఘాలు నిర్వహిస్తాయి.

ఉదాహరణకి ఫ్యాక్టరీ చట్టం క్రింద లైసెన్సులు యివ్వడం పంచాయతీలు, మునిసిపాలిటీలు విద్యుచ్ఛక్తి సరఫరా కొరకు దిగుమతి యివ్వడం మున్నగు పనులను సత్వరంగా చేసుకోడానికి యీ కమిటీలు సహాయకారిగా వుంటాయి.

భారీ, మధ్య తరహా ప్రాజెక్టుల విషయంలో వలసిన అనుమతులు యివ్వడం, సిఫారసులు చేయడంవంటి విధులనుకూడా యీ సంఘాలు నిర్వహిస్తాయి.

జిల్లాల్లో పరిశ్రమల విస్తరణ అధికారులు హైదరాబాదు జిల్లా విషయంలో పరిశ్రమలశాఖ అసిస్టెంటు డైరెక్టరు లయజాన్ అధికారులుగా నామినేట్ చేయబడుతారు.

లఘుపరిశ్రమలను స్థాపించదలచుకొన్న పరిశ్రమదారులు లైసెన్సులు వగైరాకొరకు తమ దరఖాస్తు ప్రతిని సంఘానికి సంబంధించిన సభ్యుడు - కార్యదర్శికికూడా పంపవలసి వుంటుంది. ఈ విషయంలో యితర అవసరమైన పనులన్నీ లయజాన్ ఆఫీసర్లు చూస్తారు.

## పారిశ్రామికవేత్తలకు సౌకర్యం

ఈ సంఘం కనీసం నెలకొకసారి సమావేశమౌతుంది. సమావేశం జరిగే తేదీ ముందుగా తెలుపడం జరుగుతుంది. ఇప్పుడు పరిశ్రమదారులకు, లఘు పరిశ్రమల విషయంలో లైసెన్సులు జారీ చేయడం, ప్రభుత్వం అనుమతి యివ్వడం మున్నగు విధులకు, బాధ్యతలకు సంబంధించిన శాఖాధిపతులు సంబంధించిన జిల్లా అధికారులకు సమగ్రమైన సూచనలు, సలహాలు యివ్వడంవంటి పనులను చూడవలసివుంటుందనీ, వాటి ప్రతులను సంఘాల సభ్యులు - కార్యదర్శులకు పంపవలసివుంటుందని ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. ఆరంభదశలో పరిశ్రమదారుల పనులు సులభంగా సత్వరంగా జరగడానికిగాను యీ విధమైన ఏర్పాట్లు చేయడం జరిగింది.

---

**ప్రగతి కార్యక్రమాల్లో ప్రభుత్వానికి చేయూతనివ్వండి. అలజడులూ, ఆందోళనలూ, సమ్మెలూ మన ఆర్థిక జీవితానికి గొడ్డలి పెట్టు.**



హైదరాబాద్ ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం ఉద్యోగుల యూనియన్ తాలూకు ఎడ్యుకేషన్ కమిటీ విభాగం ఆధ్వర్యంలో రాష్ట్రంలో ప్రప్రథమంగా 14 రోజులపాటు నిర్వహింపబడ్డ ప్రెస్సు పనివారల కార్మిక విద్యాశిక్షణ కార్యక్రమానికి కేంద్ర ముద్రాణాలయం డైరెక్టరు శ్రీ వి. నారాయణరావు 1974 డిశంబర్ 19 వ తేదీన ప్రారంభోత్సవంచేశారు.

# వార్తా చిత్రాలు



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు ఇటీవల రామచంద్రపురంలో ప్రభుత్వ జూనియర్ కళాశాలకు ప్రారంభోత్సవంచేశారు. సహకార శాఖ మంత్రి శ్రీ బత్తిన సుబ్బారావు, శాసన సభ్యురాలు శ్రీమతి టి. రత్నాబాయిలను కూడా చిత్రంలో చూడవచ్చు.



ఇటీవల ముఖ్యమంత్రి శ్రీ జలగం వెంగళరావు నిజాంసాగర్ డామ్ వద్ద ప్రాజెక్టు రెగ్యులేటర్‌కు శంకుస్థాపన చేసినప్పటిచిత్రం.

ఒకటేమిటి, ప్రతిదీ ఈనాడు మీకు
అందుబాటులో లేనంత ఖరీదు.



ఒక్క-
మనశ్శాంతి తప్ప

30 ఏళ్ళలో
2500 రూపాయల విలువగా మారే
జీవిత భీమా ఖరీదు కేవలం
రోజూ మీరు తాగే ఒక
కప్పు టీ నీళ్ళు
మాత్రమే*
(అంటే 25 పైసలే)



* మీ వయస్సు 30 ఏళ్ళు అనే అంచనాతో

PRATIBHA-233 IVI-1 TEL




ఇంకా
మనశ్శాంతి మీ చేతుల్లోనే ఉంటుంది.
జీవిత భీమాతో

## జిల్లాల్లో

### క్రీడాకారులకు రాయితీలు

ఆంధ్ర ప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థ అధ్యక్షులు, శ్రీ పి. నర్సింగరావు ఇటీవల నల్లగొండ జిల్లా, భువనగిరి పంచాయితీ సమితిలో బొల్లేపల్లిలో భువనగిరి బ్లాకు స్థాయి విద్యా విషయక టోర్నమెంటుకు ప్రారంభోత్సవం చేస్తూ రాష్ట్రమంతటా ఆటల రాయితీ యిచ్చే ప్రతిపాదనను తమ కార్పొరేషన్ పరిశీలిస్తున్నదని అన్నారు.

ముఖ్యమైన యీ అంశానికి అన్ని స్థాయిలలో తగిన ప్రోత్సాహం యివ్వడం లేదని ఆయన అన్నారు. విద్యా సంస్థలే కాక, వివిధ పబ్లిక్ పరిశ్రమల సంస్థలు క్రీడలకు ఎక్కువ ప్రోత్సాహం లభింప చేయాలని ఆయన సూచించారు.

సమితి అధ్యక్షులు శ్రీ కె. నరసింహారెడ్డి సభాసదులకు స్వాగతం చెబుతూ ప్రాథమిక పాఠశాలలలో పరస్పర అవగాహన, క్రమశిక్షణలను పెంపొందించడానికి యీ టోర్నమెంటును నిర్వహిస్తున్నారని అన్నారు.

### చిన్న మొత్తాల పొదుపు ఉద్యమం

జాతీయ పొదుపు ఉద్యమం కమీషనరు, రెవెన్యూ బోర్డు సభ్యులు, శ్రీ ఎస్. కె సిన్హా, జనవరి 30న ఒంగోలులో కలెక్టర్ల కార్యాలయంలో జరిగిన సమావేశంలో ప్రసంగిస్తూ వసూలైన చిన్న మొత్తాల పొదుపులో రాష్ట్రానికి 2/3 శాతం అభివృద్ధి కార్యక్రమాలకు కేంద్ర ప్రభుత్వం కేటాయిస్తున్నదనీ, గత సంవత్సరం రాష్ట్రంలో 10 కోట్లు సేకరించారనీ అన్నారు.

గత సంవత్సరం యీ జిల్లాలో తక్కువ జరిగిన సేకరణ తమ అసంతృప్తిని వ్యక్తంచేస్తూ వచ్చే రెండు నెలలలో లక్ష్య సాధనకు తీవ్రంగా కృషి చేయాలని సభ్యులకు విజ్ఞప్తి చేశారు. జిల్లాకు నిర్దేశించిన లక్ష్యాన్ని సాధించడానికి ప్రత్యేక కృషి చేయాలని ఆయన విజ్ఞప్తి చేశారు. ఈ జిల్లాకు రు. 95 లక్షలు లక్ష్యంగా నిర్ణయించగా యింతవరకు రు. 10. లక లు సేకరించారు.

ఈ సందర్భంగా రు. 14,500 లు మదింపు చేసిన 8 మంది జాతీయ పొదుపు సర్టిఫికెట్లను ఆయన పంపించేశారు.

### చలన చిత్రాలకు ప్రభుత్వ బహుమతులు

ఆంధ్ర ప్రదేశ్‌లో చలన చిత్ర పరిశ్రమను ప్రోత్సహించడానికి ఆంధ్ర ప్రదేశ్ ప్రభుత్వం కథాచిత్రాలు, వార్తా చిత్రాలు, విద్యా విషయక చిత్రాలు బాలల చిత్రాలలో ఉత్తమ చలన చిత్రాలకు రాష్ట్ర ప్రభుత్వం బహుమతులను ఏర్పాటు చేసింది.

1974 నవంబరు 5వ తేదీ ఆఖరు గడువుగా 1975 సంవత్సరంలో నిర్మించ బడిన చలనచిత్రాల ఎంట్రీలను పంపాలని కోరడం జరిగింది. దిగువ తెల్పిన చిత్రాలకు బహుమతులను ప్రకటించారు.

1. ఉత్తమ చిత్రం : శారద.
2. ద్వితీయ బహుమతి : అందాల రాముడు.
3. తృతీయ బహుమతి : సంసారం—సాగరం.

1973 సం. సంబంధించిన వార్తా చిత్రాలు, విద్యా విషయక చిత్రాలు, బాలల చిత్రాల ఎంట్రీలు రాలేదు.

### సినిమాకళాకారులచే రు. 3 లక్షలు సేకరణ

### ప్రపంచ తెలుగు మహా సభ

విద్యాశాఖ మంత్రి, శ్రీ ఎం. వి. కృష్ణారావు, ఫిబ్రవరి 16న గుంటూరులోని బ్రహ్మానందరెడ్డి స్టేడియంలో తెలుగు సినిమా కళాకారుల సంఘం వారి సాంస్కృతిక కార్యక్రమానికి ప్రారంభోత్సవం చేస్తూ తెలుగు ప్రజల సమైక్యతను, సంఘీభావాన్ని పరిరక్షించాలని అన్నారు. ఈ విషయంలో ప్రపంచ తెలుగు మహా సభలు ఎంతగానో దోహదం చేశాయని ఆయన వివరించారు. ప్రపంచ తెలుగు మహా సభల నిర్వహణకు సహాయం చేసే నిమిత్తం యీ కార్యక్రమం ఏర్పాటు చేశారు.

రెవెన్యూ శాఖ మంత్రి శ్రీ పి. నరసారెడ్డి ముఖ్య అతిథిగా విచ్చేశారు. జిల్లా కలెక్టరు శ్రీ కె. చంద్రయ్య యీ సందర్భంగా ప్రసంగిస్తూ సాంస్కృతిక కార్యక్రమాన్ని జయప్రదంచేసినందుకు గుంటూరు జిల్లా ప్రజలను అభినందించారు.

ఈ సందర్భంగా సేకరించిన రు. 3 లక్షలను రెవెన్యూ శాఖ మంత్రి, విద్యాశాఖ మంత్రికి అందజేశారు. దాదాపు 40 మంది సినిమా కళాకారులు యీ ప్రదర్శనలో పాల్గొన్నారు.

### జీల్డర్‌తిప్ప ప్రాజెక్టు శంకుస్థాపన

ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి, శ్రీ జె. వెంగళరావు, ఫిబ్రవరి 17న మహబూబునగర్ జిల్లా, కొల్లాపూరు తాలూకాలోని మాల చింతపల్లిలో రు 17–50 లక్షల ఖర్చుతో నిర్మించనున్న జిల్డర్ తిప్ప ప్రాజెక్టు నిర్మాణానికి శంకుస్థాపన చేస్తూ రాష్ట్రంలో వెనుకబడిన ప్రాంతాల అభివృద్ధికి ప్రభుత్వం ఎంతో శ్రద్ధ వహిస్తున్నదని అన్నారు. నాలుగు, ఐదు సంవత్సరాలలో రాష్ట్రంలోని వెనుకబడిన ప్రాంతాలకు ప్రభుత్వం అభివృద్ధి పరుస్తుందని ఆయన వివరించారు.

కేంద్రంనుండి లభించిన రు. 18 కోట్ల లోను మహబూబునగర్ జిల్లాకు రు. 1.5 కోట్లు కేటాయించిందని ముఖ్యమంత్రి వెల్లడించారు. అన్నిపథకాలను త్వరితగతిని అమలు పర్చడంలో ప్రభుత్వంతో సహకరించాలని ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

చీఫ్ ఇంజనీరు శ్రీ గోపాలకృష్ణారెడ్డి ప్రాజెక్టు నివేదికను సమర్పిస్తూ యీ ప్రాజెక్టు నిర్మాణానికి రు. 17.50 లక్షలు ఖర్చు అవుతాయని దీనివల్ల ఖరీఫ్ పంట కాలంలో 1500 ఎకరాలకు, రాబీపంట కాలంలో 500 ఎకరాలకు నీటిపారుదల సౌకర్యం లభిస్తుందని అన్నారు. దీనివల్ల మాలుచింత గ్రామానికి బాగా లాభం చేకూరుతుందని 1976 జూన్ నాటి ప్రాజెక్టునిర్మాణం పని పూర్తి అవుతుందని ఆయన ఆశాభావాన్ని వ్యక్తంచేశారు.

అంతకుముందు కొల్లాపూరు ఎం. ఎల్. ఎ. శ్రీ కె. రంగదాసు స్వాగత పత్రం సమర్పిస్తూ ఈ పథకం మంజూరు చేసి నందుకు ముఖ్యమంత్రికి కృతజ్ఞతలు తెల్పారు.

మార్కెటింగ్ శాఖామంత్రి, శ్రీ పి. మహేంద్రనాథ్ ప్రసంగిస్తూ మారుమూల గ్రామాన్ని ముఖ్యమంత్రి సందర్శించడం గ్రామీణ ప్రజలను ఎంతో ప్రభావితం చేసిందని అన్నారు. ప్రభుత్వంతో సహకరించాలని మంత్రి విజ్ఞప్తి చేశారు.

పశుపోషణ శాఖమంత్రి శ్రీ ఎస్. వెంకటామారెడ్డి ప్రసంగిస్తూ ఎక్కువ భూమికి నీటిపారుదల సౌకర్యం కల్పించడానికి ప్రతినీటి బొట్టును ఉపయోగంలోనికి తేవాలని అన్నారు.

## ఆంధ్ర ప్రదేశ్‌లో జనుము పంట

ఆంధ్రప్రదేశ్‌లో 1974–75 సంవత్సరములో 5000 హెక్టార్లలో జనుము పంటను వేశారు. గత సంవత్సరం యిదేకాలం 3900 హెక్టార్లలో యీ పంట వేశారు. ఈ సంవత్సరం పంట విస్తీర్ణంలో 28 శాతం పెరుగుదల ఏర్పడింది

పచ్చిఎరువు, పశుగ్రాసం నార మొదలైన ప్రయోజనాలకు జనుము పంటవేస్తారు. ఈ నివేదికకు సంబంధించినంత వరకు తెల్పిన విస్తీర్ణంలో నార నిమిత్తమును యీ పంటవేశారు. అయితే యీ పంట అంత ప్రధానమైనదికాదు. ప్రకాశం, హైదరాబాదు, మెదకు ఆదిలబాదు జిల్లాలలో పరిమితసాయిలో యీ పంట వేస్తారు.

ఈ సంవత్సరం 7,500 బేళ్ళ నార ఉత్పత్తి అయింది. గత సంవత్సరం ఉత్పత్తి 5,000 బేళ్ళు, ఉత్పత్తిలో 29 శాతం పెరుగుదల ఏర్పడింది.

## గ్రామీణ అభివృద్ధికి పంచాయితీరాజ్ సంస్థల ఆ వ శ్య క త

పంచాయతీరాజ్ శాఖామంత్రి, శ్రీ ఎల్. లక్ష్మణదాసు, ఫిబ్రవరి 2న నిజామాబాదులో పంచాయితీరాజ్ సెమినారుకు ప్రారంభోత్సవం చేస్తూ గ్రామీణ అభివృద్ధిలో ప్రజలు పాల్గొనే విధంగా పంచాయితీరాజ్ సంస్థలు మాత్రమే చేయగలుగుతాయని అన్నారు.

చట్టాన్ని తగిన విధంగా సవరించిన తర్వాత పంచాయితీరాజ్ సంస్థలకు ఎన్నికలు జరుగుతాయని మంత్రి అన్నారు. పంచాయతీరాజ్ పద్ధతిని పటిష్ఠం చేసే విషయంలో ప్రభుత్వం నరసింహం కమిటీ సిఫార్సులను పరిశీలిస్తున్నదని అన్నారు. జాతిపిత ఆశించిన విధంగా గ్రామాలను చిన్న రిపబ్లిక్‌గా రూపొందించాల్సిన అవసరాన్ని గూర్చి ఆయన నొక్కి చెప్పారు.

సభకు అధ్యక్షత వహించిన మత్స్యశాఖ మంత్రి శ్రీ డి. మునిస్వామి ప్రసంగిస్తూ పరిపాలనా విషయంలో అనధికారులు జోక్యంచేసుకో రాదని అన్నారు. గ్రామాలకు చెందిన చెర్వులలో చేపలు పట్టడాన్ని గ్రామంలోని సహకార సంఘాలకు యివ్వాలని ఆయన అన్నారు. స్థానిక అవసరాల ప్రాతిపదికగా గ్రామ పంచాయతీలు గ్రామ ప్రణాళికలను రూపొందాల్సిన అవసరాన్ని గూర్చి మంత్రి నొక్కి చెప్పారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పంచాయతీరాజ్ సంస్థల అధ్యక్షుడు శ్రీ యతిరాజరావు ప్రసంగిస్తూ అభివృద్ధి కార్యక్రమాలను అమలు జరపడానికి పంచాయతీరాజ్ సంస్థలకు ఎక్కువ నిధులు కేటాయించాలని కోరారు.

## రాష్ట్ర సమాచార కేంద్రం

హైదరాబాదులోని రాష్ట్ర సమాచార కేంద్రాన్ని 1975 జనవరిలో 3847 మంది సందర్శించారు.

ఈ కేంద్రం నేతాజీ సుభాష్ చంద్రబోసు జయంతి ఉత్సవాన్ని నిర్వహించింది. అఖిల భారత స్వాతంత్ర యోధుల సమితి కార్యదర్శి, శ్రీ వి. ఎల్. సుందరరావు, సమావేశంలో ప్రసంగించారు స్వాతంత్ర్య సమరయోధుడు నేతాజీ సుభాష్ చంద్రబోసు విప్లవ వీరుడు మాత్రమేగాక సహృదయుడు. ఆయన భారత జాతీయ సైన్యాన్ని ఏర్పాటు చేసి భారత జాతీయ సరిహద్దులలో వీరోచితంగా పోరాడినారు. సుభాష్‌చంద్రబోసు చేసిన త్యాగాలను, పడిన కష్టాలను గుర్తుచేస్తూ ఆయనకు సమావేశంలో జోహార్లు అర్పించినారు. నేతాజీకి సంబంధించిన పుస్తక ప్రదర్శనకూడా ఏర్పాటుచేశారు

రిపబ్లిక్ దినోత్సవం సందర్భంగా రాజ్యాంగ రజతోత్సవాన్ని కూడా యీ కేంద్రంలో ఘనంగా నిర్వహించారు. రాజేంద్రప్రసాద్ జవహర్ లాల్ నెహ్రూలు రాజ్యాంగంపై సంతకంచేస్తున్న ఫోటోలను ప్రదర్శించారు. జనవరి 28న లాలా లజపతిరాయ్‌కు చెందిన పుస్తకాలను ప్రదర్శించారు.

రాష్ట్రంలో వ్యవసాయరంగంలో సాధించిన విజయాలను గూర్చిన ఫోల్డర్‌కు యీ కేంద్రం ప్రచురించి కేంద్రాన్ని సందర్శించిన వ్యక్తులకు పంపిణీచేశారు.

ఈ నెలలోనే రాష్ట్ర వార్షిక ప్రణాళిక, అభివృద్ధిరంగాలకు నిధుల కేటాయింపులను గూర్చి వివరిస్తూ ఒక ఫోల్డరు, ఆరు సూత్రాల పథకాన్ని గూర్చిన ఫోల్డరును కూడ ప్రచురించి ఉచితంగా పంపిణీచేశారు.



# "ఆంధ్రప్రదేశ్" మాస పత్రిక ప్రచురణ వివరాలు

(వార్తా పత్రికల రిజిస్ట్రేషన్ రూలు 8, ఫారం IV ప్రకారం)

ప్రచురణ స్థలం : హైదరాబాదు

ప్రచురణ వ్యవధి : మాస పత్రిక

ముద్రాపకుని పేరు : డైరెక్టరు, ప్రభుత్వ కేంద్ర ముద్రణాలయం, హైదరాబాదు

చిరునామా : చంచల్‌గూడా, హైదరాబాదు-500036

ప్రచురణ కర్త : శ్రీరాజ్యం సిన్హా

చిరునామా : డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు

ప్రధాన సంపాదకులు : శ్రీరాజ్యం సిన్హా

చిరునామా : డైరెక్టరు, సమాచార, పౌరసంబంధ శాఖ, హైదరాబాదు.

పత్రిక పెట్టుబడిలో ఒక శాతం కంటే ఎక్కువ షేర్లుగల సభ్యులు లేక భాగస్వాములైన వారి పేర్లు, చిరునామాలు } ———

పైన పేర్కొన్న వివరాలు యథార్థములు.

హైదరాబాదు
1-3-1975

(ప్ర. సం) శ్రీరాజ్యం సిన్హా
ప్రచురణ కర్త

PUBLISHED BY THE DIRECTOR OF INFORMATION, PUBLIC RELATIONS, ANDHRA PRADESH, HYDERABAD.
PRINTED BY THE DIRECTOR OF PRINTING, GOVT. OF ANDHRA PRADESH, AT THE GOVT. CENTRAL PRESS HYDERABAD

స్వీయ చరిత్ర ఆధారంగా - **బుజ్జాయి**




హైకోర్టుకు ఎదురుగా ఒక ఇల్లు అద్దెకు తీసుకుని ప్రకాశం బారిష్టరీ వృత్తి ప్రారంభించాడు. కొద్ది రోజుల లోనే ప్రాక్టీసు బాగా అందుకుంది.




నాయుడుకు చదువు కోసం అష్టకష్టాలు పడి, మరల పూటకూళ్ళు పెట్టుకుని శ్రమించిన ఆ తల్లి ఆనందానికి మేర లేదు.




కొంతకాలానికి ప్రకాశం భార్య గర్భవతి అయింది. ఇంతలో ప్రకాశం తల్లికి జబ్బు చేసింది.




తల్లి కన్ను మూసింది. చనిపోతూ కూడా ఆ కన్న తల్లి జాగ్రత్త చేసిన ఎనిమిది వందల రూపాయలు ప్రకాశానికి ఇచ్చి వెళ్ళిపోయింది.

కొద్ది రోజులకు ప్రకాశం భార్య మగబిడ్డను కన్నది.




మరి రెండేళ్ళకు మరో కొడుకు పుట్టాడు. నరసింహారావు, హనుమంతరావు అని కొడుకులకు పేర్లు పెట్టాడు.

ఇక ప్రకాశం ప్రాక్టీసు విషయం చెప్పాలా? అతి జోరుగా ఉంది. నెలకు నాలుగైదు వేలు సంపాదిస్తున్నాడు. మద్రాసులో ఒక ఇల్లు కొన్నాడు.



